

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ శంకరానందస్వాములవారి

## శ్రీ భగవద్గీతోపన్యాసాలు

# అక్షరపరబ్రహ్మయోగము




శ్రీ గీతా ప్రచార సేవా సమితి

ఆళ్లగడ్డ – కర్నూలు జిల్లా.



(రెండవ కూర్పు 2000 ప్రతులు)

1961 వెల రు. 1-00



# విషయసూచిక


1. సందేశాలు – శుభాకాంక్షలు .... ౧
2. తొలిపలుకులు .... ౩౩
3. గీతావాణి ప్రచురణలు .... ౩౬
4. అర్జునుని ప్రశ్నలు .... 1
5. మొదటి ఆరుప్రశ్నలకు భగవంతుడొసగిన సమాధానాలు 12
6. అంత్యకాల కర్తవ్యం - సప్తమప్రశ్నకు సమాధానం 25
7. సగుణోపాసన .... 39
8. ప్రణవోపాసన - భక్తివిచారం .... 51
9. బ్రహ్మదేవుని దినరాత్రి గణన - పరమపురుషప్రశంస 66
10. శుక్లకృష్ణగతులు - ఫలశ్రుతి .... 73
11. మూలశ్లోకాలు .... 84




ఓమ్

ఈ అక్షరపరబ్రహ్మయోగాధ్యాయసంచికను గురించి

పూజ్యమహనీయుల - మాన్యమహాశయుల

# అభిప్రాయములు - శుభాకాంక్షలు

# మహాత్ముని ప్రసాదము

★

1. కాలచక్రంలో 24 గంటలు కల్గిన మన రేబగళ్లు అత్యల్పము. దీనిని వృథా చేయక లౌకికభోగములయెడ ఉదాసీనులమై భగవద్భక్తి యందును లోకసేవయందును వినియోగించి సార్థక మొనర్చుకొనవలెను.



2. యజ్ఞము చేయువాడును జ్ఞానమును బొందినవాడును బ్రహ్మవేత్తయు మరణించునప్పుడును తన స్థితి నట్లనే కల్గియున్న మోక్షమును బొందుచున్నాడు. దీనికి ప్రతికూలముగా యజ్ఞము చేయనివాడును జ్ఞానమును బడయనివాడును భక్తి నెరుంగనివాడును చంద్రలోకమనగా — క్షీణికలోకమును బొంది మరల జన్మచక్రమున బడుచున్నాడు. చంద్రునకెట్టి ప్రకాశమును సొంతముగా లేదు.

3. జగమునం దనాది సిద్ధములగు జ్ఞానము — అజ్ఞానము అను రెండుమార్గము లెన్న బడుచున్నవి. జ్ఞానమార్గముచే మనుష్యుడు మోక్షమును, అజ్ఞానమార్గముచే పునర్జన్మను బొందును.

మో. క. గాంధి

ఓం

# సందేశము

★

అష్టమాధ్యాయము భగవంతుడు అర్జునునకు బ్రహ్మోపదేశము చేసిన అధ్యాయము. ఇది 'అక్షరపరబ్రహ్మయోగ'మను పేరుగలది. నాశములేని పరమాత్మ యందు ఐక్యము గలుగజేయునది. ఇదే అర్థము నుద్దేశించియే ఋషులు బాలురకు అక్షరాభ్యాస మేర్పర చిన రహస్యము. కావుననే 'ఓం' అను పరబ్రహ్మమును తెలి



పెడి ప్రణవము నుప దేశించుటకు కారణమై నది. అంత్యమందును, ఆత్మజ్ఞానులు యీ ప్రణవమును ధ్యానించి యే పరమాత్మయం దైక్యము నొందు చున్నారు.

క్షరమైన అపరవిద్యలోనే — అనగా శాస్త్రపఠనములోనే కాల మును గడుపక అంత్యకాలమునందైనను పరవిద్యయగు బ్రహ్మవిద్య యందు ప్రవేశించి అక్షరాభ్యాసకాలమునందు యే ఓంకార ముపదేశింప బడియున్నదో అట్టి ప్రణవోపాసనపరుడై, పరమపురుషుడగు శ్రీమన్నారా యణునియం దైక్యము గావలెనను తలంపు గలిగి పరమకరుణతో ఋషు లిట్టి పద్ధతిని యేర్పరచిరి.

(signature)

# అక్షరపరబ్రహ్మయోగము

శ్రీ సచ్చిదానంద సరస్వతీస్వామివారు,
శ్రీ అధ్యాత్మప్రకాశకార్యాలయము హొళెనరసీపుర (మైసూరు)





అక్షరమనునది యెట్టి విశేషమునూలేని పరతత్త్వమని బృహదారణ్యకము (3–8–8) మొదలగు ఉపనిషద్వచనములలో చెప్పబడి యున్నది. ఎవరు శమదమాదిసాధనలతో కూడి శాస్త్రాచార్యోపదేశమును శ్రవణ మనన నిదిధ్యాసములతో అనుభవగతముగ చేసుకొనియున్నారో, వారి కీజన్మముననే అక్షరపరబ్రహ్మైక్యము కరతలామలకము వలె సిద్ధించుచున్నది. వారు కృతకృత్యులు. వారు ముందు చేయవలసిన దేమియులేదు. వారి సేవవలననూ ఉపదేశము వలననూ యితరులు కృతకృత్యులగుదురు.

ఎవ్వరు, ఈ విధముగ అక్షరపరబ్రహ్మసాక్షాత్కారము సాక్షాత్తుగ పొందజాలనివారో అట్టి మధ్యమాధికారులకు ప్రశ్నోపనిషత్తు మొదలగువాటియందు చెప్పియున్న ప్రణవోపాసనముద్వారా అక్షర ప్రాప్తి కాగలదు. ప్రణవోపాసకులు చేయదగిన ధ్యానక్రమమునూ, వారు సుషుమ్నానాడీమూలకముగ ఉత్తరాయణమార్గముగుండా బ్రహ్మ లోకమునకుపోయి తత్త్వజ్ఞానముతో అదే బ్రహ్మమును పడయురీతినీ, గీత యెనిమిదవ అధ్యాయమున చెప్పబడినది.

ఈ యోగాభ్యాసమునకును అర్హత లేనివారికై భగవద్గీతలో విస్తారముగ కర్మయోగము ప్రవచించియున్నారు.

# అభిప్రాయములు — శుభాకాంక్షలు

ఓమ్

"సదేవ సౌమ్యేదమగ్రమాసీదేకమేవా — ద్వితీయం బ్రహ్మ" యిత్యాది శ్రుతిప్రతిపాదితంబగు అయ్యద్వితీయవస్తువే. అధికారి ప్రభేద మున జ్ఞేయబ్రహ్మమని ధ్యేయబ్రహ్మమని ద్వివిధముగ బోధింపబడును. జ్ఞేయబ్రహ్మమన అవ్యక్తాక్షర శబ్దవాచ్యంబగు నిర్గుణపరమాత్మ, ధ్యేయ మన ధ్యానించుటకు తగు (తత్పదార్థము) సగుణ బ్రహ్మము.

అక్షరపరబ్రహ్మయోగమను నీ యష్టమాధ్యాయము గతా ధ్యాయమునందలి అర్జునుని ప్రశ్నబీజమును పురస్కరించుకొని ఏడు ప్రశ్నలరూపమున యావిష్కరణ మొంది యేతత్సమాధానరూపమై యొప్పుచున్నది. అందు "అక్షరం బ్రహ్మ పరమం" "అక్షరం న క్షరతి ఇతి అక్షరం పరమాత్మా" "న క్షరతి న నశ్యతీతి అక్షరం" "అశ్నుతే సర్వమితి అక్షరం" అను నిత్యాదిగా జ్ఞేయ ధ్యేయవస్తు ప్రతిపాదనార్థ విస్తృతిచే విశేషముగ ధ్యేయవస్తు (ధ్యానించుటకుదగువస్తు) బోధకమై ఉపాసకులగు ముముక్షువుల కత్యంతోపాదేయమై యొప్పుచున్నది.

ఇందు సాధకుని ప్రాణప్రయాణసమయమునందలి కర్తవ్యమును, అతడు పొందు గంతవ్యస్థానమును, మరియు పునరావృత్త్యపునరావృత్త్యా త్మకములగు స్థాననిర్దేశమున్ను తత్కారణమును ఇక కర్మఠులకును ఉపాసకులకును గల భేదమును, ఆయా మార్గసంకేతములను మరి యా మార్గముల నతిక్రమించిన యోగియొక్క వైశిష్ట్యము మున్నగు విషయ ముల విపులీకరణ మీ యధ్యాయము సాధకజనశరణ్యము.

ఓమ్ తత్సత్ శివమ్ ఓం

గంజికుంట,
అనంతపురంజిల్లా. — శ్రీ శంకరానందగిరిస్వామి.

ఓమ్

అష్టమాధ్యాయం సప్తప్రశ్నోత్తరాత్మకమైంది. కాబట్టే యిది సప్తమాధ్యాయాంతమునగల సార్ధశ్లోకానికివ్యాఖ్యానభూతమైంది. ఇందలి ప్రశ్నలలో సప్తమప్రశ్న మిక్కిలి ముఖ్యమైంది. ఓంకారాన్ని ఉచ్చరిస్తూ సగుణబ్రహ్మను ధ్యానిస్తూ కళేబరాన్ని వదిలివేస్తే ఆ సగుణోపాసకులు క్రమముక్తిని బొందుతారు. అనగా ప్రాణవియోగానంతరం దేవయాన మార్గాన హిరణ్యగర్భలోకానికివెళ్లి ఆ లోకభోగానంతరం సముత్పన్న సమ్యగ్దర్శనులై బ్రహ్మదేవునితోకూడ నిర్గుణబ్రహ్మభావాన్ని (కైవల్య మోక్షాన్ని) పొందుతారు. దహరాద్యుపాసకులుకూడ క్రమముక్తి భాజనులే. నిర్గుణబ్రహ్మధ్యానపూర్వకంగా శరీరాన్ని విడిస్తేమాత్రం అట్టివారి ప్రాణాలు యిచటనే లీనమైపోతాయి. ఆకారణంచేత నిర్గుణోపాసకులు సాక్షాత్తుగా బ్రహ్మభావాన్ని పొందుతారు. ప్రాణవియోగ సమయంలో అన్యచింతకులైనవారు అన్యమునే పొందుతారు. పరమాత్మభావాన్ని మాత్రం పొందరు. ఎవరు పంచాగ్నివిద్యాద్యుపాసనలతో బ్రహ్మలోకానికి వెళ్లుతారో, వారు బ్రహ్మలోకభోగానంతరం మరల యీ లోకాన జన్మిస్తారు. తప్పదు. ఇష్టాపూర్తాది కామ్యకర్మల నాచరించేవారు పితృయాణమార్గాన చాంద్రమసజ్యోత్యుపలక్షిత స్వర్గానికి వెళ్లి ఆయా కర్మఫలములను అనుభవించి మరల అందరు తప్పక పుడ్తారు. ఈ విధంగా వివిధములైన ఉపాసనాతత్ఫల విశేషాలను సూచిస్తూ ఉపాసనాకాండకు సార్థక్యాన్ని సంపాదించి యీ అష్టమాధ్యాయం భగవద్గీతలో ఒక విశిష్టస్థానాన్ని పొందగల్గింది. సప్తప్రశ్న ప్రతివచనాలతో యోగమార్గాన్ని నిరూపిస్తూ యీ అధ్యాయం తత్పదార్థాన్ని ధ్యేయంగా వ్యాఖ్యానం చేసింది. ఇట్టి మహోత్కృష్ట విషయాలను "గీతావాణి" మాసపత్రికామూలంగా ప్రకటిస్తూ, ఏతత్పత్రికా సంపాదకులు ఆధ్యాత్మికలోకానికి మిక్కిలి సేవజేస్తున్నారు. కాన వారు మిక్కిలి అభినందనీయులు. లోకాస్సమస్తాస్సుఖినోభవంతు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

శ్రీ శివగిరి ఆశ్రమము,
అరగొండ పోష్టు — (చిత్తూరు). } విద్యానంద.



## అభిప్రాయములు — శుభాకాంక్షలు



### ఓమ్

బ్రహ్మజ్ఞానికి సాక్షాన్ముక్తియు, ఉపాసకునకు క్రమముక్తియు, యజ్ఞాదులచేయు కర్మఠునకు పునరావృత్తియు తప్పక ప్రాప్తించునని యెనిమిదవదగు నీ యధ్యాయమున సంగ్రహముగాఁ జెప్పఁబడెను. “న తస్య ప్రాణా ఉత్క్రామంతి అత్రైవ సమవలీయంతే బ్రహ్మాప్యేతి బ్రహ్మైవసన్” జ్ఞానికి ప్రాణోత్క్రమణము లేదు. అతని ప్రాణము లిచటనే బ్రహ్మమునందు లయించుచున్నవి. వాడు బ్రహ్మమగుచున్నాడు. కావున జ్ఞానికి సాక్షాన్ముక్తి లభించుచున్నది.

ఉపాసకులు మరణానంతరమున దేవయాన (అర్చిరాది) మార్గము నాశ్రయించి బ్రహ్మలోకమునకు బోవుదురు. వారచ్చట దివ్యసుఖముల ననుభవించుచు బ్రహ్మోపాసన నాచరింపుచు కల్పాంతమువరకు బ్రహ్మలోకమున నివసించి తుదకు బ్రహ్మజ్ఞానసంపన్నులై, చతుర్ముఖునితోఁబాటు ముక్తి నొందుదురు. వారు మరల సంసారము నొందరు. దీనినే క్రమముక్తియని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

ఇక యజ్ఞాది పుణ్యకర్మల నాచరించువారు పితృయాన (ధూమాది) మార్గమున చంద్రలోకమునకుఁబోయి యందలి భోగముల ననుభవించి పుణ్యకర్మ క్షీణించుటచే మరల భూలోకమునకు వత్తురు. కర్మఠుల శరీరమునుండి జీవుఁడు నిర్గమించునప్పుడును పునర్జన్మకు వచ్చునప్పుడును పంచీకృతభూతములతో సహా ప్రాణములు, ఇంద్రియములు, మనస్సు, అనాద్యవిద్యచే యేర్పడిన ధర్మాధర్మసంస్కారములతోడయి నిలిచియుండును. అట్టివారికి పునరావృత్తి తప్పదు. కావున ప్రతి మానవుఁడు గురుముఖమున బ్రహ్మతత్త్వమును విచారించి శ్రవణ మనన నిదిధ్యాసముల ద్వారా బ్రహ్మాపరోక్షజ్ఞానమును సిద్ధింపజేసికొని పునరావృత్తి లేని సాక్షాన్ముక్తిని పొంది సుఖింతురుగాక !

శ్రీ భూమానందభారతీస్వామి,
అనంతాశ్రమము,
కొత్తచెరువు పోస్టు, అనంతపురం జిల్లా.

అభిప్రాయములు – శుభాకాంక్షలు



# అక్షరపరబ్రహ్మయోగము

## ( శ్రీ శ్రీ శ్రీ స్వామి శివానంద, ఋషీకేశ్ )

★

శ్రుతులలోకెల్ల భగవద్గీతకు గల అద్వితీయ సౌందర్యమేమనగా, అందు ప్రతి అధ్యాయమునందును మిక్కిలి మూలాధారమైన ముఖ్యతత్త్వజ్ఞాన అంశములు విమర్శింపబడియున్నవి. సత్యము లేక బ్రహ్మముయొక్క స్వభావము, గుణములు మానవుని ఉత్కృష్టధర్మములు, వ్యక్తిగతసంస్కారవిధానములు, నీతిమర్యాదలకు గల విలువ, విషయప్రపంచమునకు గల అపరిపూర్ణత, అసంతృప్తికరనైజము మొదలగునవన్నియు అందు విమర్శింపబడినవి.



చక్కని తత్త్వజ్ఞానమునందలి ముఖ్యఅంశములను నొక్కి చెప్పుట వలన పరిణామము అనుకూలముగను తప్పనిసరియు కలుగుచుండును. అందువల్ల ప్రతిదైవిక గురువును, ప్రతి గొప్ప మతసిద్ధాంత వివరమున్ను తత్త్వజ్ఞానమున్ను, సత్యమునందలి కేంద్ర అంశములను మిక్కిలి నొక్కి వక్కాణించుట నైజము. వేదములందు, ఉపనిషత్తులందు గల దైవిక జ్ఞానమును బోధించుటకు ముఖ్య అంశములు పునరుచ్చారణ చేయుట యొక్క సామాన్య సాధనముగా కనబడుచున్నది. ఉపనిషత్తుల నవనీతము అనదగు గీతయందు కూడ యీ సాధనము అనుసరింపబడియున్నది.

దివ్యగానమగు గీతయందలి యీ అష్టమాధ్యాయమునందు ఆత్మసాక్షాత్కారమునకు వివిధయోగములు సూచింపబడియున్నవి. జ్ఞానయోగమునకు సంబంధపడిన అవిభక్త సత్యస్వరూపుని నైజము, వ్యక్తిగతజీవుడు అస్థిరవిషయప్రపంచము, దాని అధిష్ఠానదేవత

విషయములు యిందలి 3, 4_వ శ్లోకములు తెలుపుచున్నవి. 7_వ శ్లోకము కర్మ, భక్తి యోగములను కలిపి తెలుపుచున్నది. (చేతులు పని చేయుచుండుటకు, మనసు పరమాత్మను సమర్పించుటకు) 8_వ శ్లోకము అభ్యాసయోగమును తెలుపుచున్నది. 10, 12, 13 శ్లోకములు రాజయోగము, హఠయోగములను కలిపి తెలుపుచున్నవి. 14_వ శ్లోకమున నామస్మరణ విశేషముగా కొనియాడబడియున్నది. జగత్సంబంధమగు సృష్టి లయములుకూడ యిందు పరిచయము చేయబడియున్నవి.

పరబ్రహ్మము అక్షరము, సాకారరహితము, అవిభక్తము. అందుకు వ్యతిరేకమగు విషయసముదాయములు, జీవులు అన్నియు అతనినుండి తమ అస్తిత్వముపొంది, అతని మీద ఆధారపడి నిర్ణయింపబడుచున్నవి. సప్తమాధ్యాయమునందలి చివరిశ్లోకమునను, ఈ అధ్యాయమునందలి ప్రథమశ్లోకమునను యీ విషయము తెలుపబడుచున్నది. వ్యక్తిగత జీవుడు, విషయప్రపంచము అంతయు ఆ అక్షరపరబ్రహ్మముయొక్క క్రిందిభాగముగ నున్నది.

జీవితమునందలి ఉన్నతోత్తమ గమ్యస్థానమును పొందుట అనగా అంతరాత్మయు యీ పరబ్రహ్మయు అద్వితీయము అని అనుభవరూపమున తెలుసుకొనుట అగుచున్నది. అట్టి సమయములలో మనము అతనితో సన్నిహితసంబంధము కలిగియుందుము. హిందూ మతవిజ్ఞానశాస్త్రములయందంతటయు యిదియే గమ్యస్థానమని తెలుపబడుచున్నది.

ఇట్టి గొప్పపదవిని పొందుటకు గల కొన్ని మార్గములుకూడ యిచ్చట తెలుపబడు చున్నవి. నిరంతరమనోనిగ్రహము మనసును ఏకాగ్రతచేయుట, ఉన్నతస్థానమున దానిని స్థాపించుట యిందు ఒక విధానముగా నున్నది. భక్తిపరులకు నిరంతర పరమాత్మస్మరణ చక్కని మార్గముగానున్నది. మానవుని చివరి ఆలోచన కనుగుణముగ అతని ముందటి జన్మము యేర్పడుచున్నదను సత్యవచనమునందుగల రహస్యమును పరమాత్మ మనకు తెలుపు చున్నాడు. ప్రాణప్రయాణసమయమునందు ఘోరతాపము, బాధలు అనుభవించుచుండు సమయమున కలుగు ఆలోచనలు అకస్మాత్తుగా కలుగవు. తాను మిక్కిలి కృషిచేసి జీవితదశయందు బుద్ధిపూర్వకముగా స్మరించుచున్న ఆలోచనల కనుగుణముగా చివరి ఆలోచన యుండును. వాని మరణసమయమునందలి పశ్చాత్తాపము చాల ప్రయోజన పడుటలేదు. "నన్ను స్మరించుచు యుద్ధము చేయుము" జీవితయుద్ధమును సాగించుము అని నొక్కి వక్కాణించుచున్నాడు. ఇందు ఒకటి మరియొకటినుండి విడదీయ సాధ్య పడదు. సాధకుడు మిక్కిలి కార్యవాదిగా నుండవలెను. అంతరభావము బాహ్యమున ప్రపంచనడవడియందు ప్రకటితమగుచుండవలెను.

బ్రహ్మాండమూలాధారమును వదలి ఆత్మేతరవిషయములను వాంఛించుట అనగా ఈ పరిచ్ఛిన్నకోశములవశమై అహంకారమునందు నరకవాసమును వదలకుండుటయగును.

## అభిప్రాయములు — శుభాకాంక్షలు

జ్ఞానమార్గమును "జ్యోతిర్మార్గమని" కూడ తెలుపుటకలదు. దాని ననుసరించినవారు మరల సంసారబంధములో తగులుకొనరు. "ధూమమార్గము" అజ్ఞాన ఆవరణమునుండి మనలను దాటింపజాలదు. దీనివల్ల పునర్జన్మము సిద్ధము. ఈ సత్యము తెలిసిన యోగి అజ్ఞాన రాత్రిని తొలగించుకొని "జ్యోతిర్పగలు"ను అన్వేషించును. అతనికి మోహము కలుగ జాలదు.

జీవుడు కోరునది ఉత్తమానందము, పరిపూర్ణశాంతము, సామాన్యజీవితవిషయా వరణమున దొరుకునదికాదు. ఇందు బాధలు, అస్థిరగుణములు నిండియున్నవి అని గీత తెలుపుచున్నది. బాధలను ఓర్చుటే వికాసమునకు లక్షణము. పోరాటమే జీవితచట్టము. మోక్షమునకు, ఆనందమునకు త్యాగము ముఖ్యపడికట్టు. పోరాటము, త్యాగము అధికము కాను కాను తీక్ష్ణానందము శీఘ్రవికాసము ఒడగూడును. బాధ యొక నిజమయిన గురువు. భగవంతుని దూత. ఎట్టి ఉన్నతవిషయ జీవితమయినను, అపరిపూర్ణము, అసంతృప్తికరము. కనుక దానివల్ల నిర్మలానందము, పరిపూర్ణమోక్షము, నిర్భయస్థితి కలుగ జాలదు — బాధవల్ల పై సత్యములు మనకు గోచరమగుచున్నవి. సచ్చిదానందపదవిని వెదకుటకు మనలను బాధ ప్రోత్సహించుచున్నది.

సదా సుఖము నపేక్షించు యీ జీవునకు హారహారగా విడచీసి, కోశకోశమును ఖండించి ఆత్మయొక్క పునర్దర్శనము పొందుట చాల అసంతృప్తికర వ్యవహారముగ తోచును. కాని యీ పరిశ్రమ బుద్ధిపూర్వకముగా విచక్షణతో సాగించగలిగినచో, ఆనందము సంప్రాప్తమగుచున్నది. దివ్యసాధన ఫలవంతముగ సాధించగలిగినచో, విజయ సుఖము, మోక్షానందము, సమదృష్టి, మానవభావమునకు బదులు దైవీభావము సమకూరు చున్నది. ఇట్టి సాధనను యిట్టి దైవికశిక్షణను అనుసరించి విచక్షణతో సాగించవలెనని గీత ప్రోత్సహించుచున్నది.

దేహము, మనస్సు, హృదయము, బుద్ధి యేకీభావము పొంది మానవవ్యక్తి సంస్కారము పొందగలుగుట గీతయందు తెలుపబడిన వివిధయోగములవల్లనే సాధ్యము. అట్టి యోగవిధానములు సంక్షేపముగా యీ అష్టమాధ్యాయమున వర్ణించబడియున్నవి.

Swami Sivananda



## Intelligence of the majority and of one great person



(*Swami Madhavatirtha*)

Before the war of Mahabharat began, Arjun and Duryodhan went to Shri Krishna for help. Arjun asked for his personal help but Duryodhan asked for Shri Krishna's Army, thinking that he will win the battle with the help of the majority but he failed.

Similarly, the present democratic Governments of the world believe that they will improve the world by the majority of notes but that is a great mistake. They do not give us a plan for the whole life. But Shri Krishna's teachings give a plan for the whole life. In the Gita he has given Varna Dharmas and in the eleventh Skandha of Shri Bhagavat he has given both Varna Dharmas and Ashram Dharmas. These give us a plan for the whole life.

*Swami Madhavtirtha*

---

విచక్షణః—

### సముదాయకబలమా? సత్పురుషుని ఆశ్రయమా?

భారత మహా యుద్ధారంభమునకు పూర్వము అర్జునుడు, దుర్యోధనుడు ఇరువురు సహాయాపేక్షతో శ్రీకృష్ణుని ఆశ్రయించిరి. అర్జునుడు అతని స్వకీయసహాయమును కోరెను. కాని



దుర్యోధనుడు శ్రీకృష్ణుని సైన్యమును కోరెను. అతడు సముదాయక బలముతో యుద్ధమున గెలువ నెంచెను గాని భంగపడెను.

అదేరీతి ప్రస్తుత ప్రజాపాలక ప్రపంచ సామ్రాజ్యములు

సముదాయక సమ్మతి సహాయముతో ప్రపంచమును అభివృద్ధి చేయగల మని నమ్ముచున్నారు. కాని యిది యొక గొప్ప పొరబాటు. వారు పరిపూర్ణజీవితమునకు అనువగు ప్రణాళిక నొకదానిని మనకు తెలుప లేకున్నారు. కాని శ్రీకృష్ణుని ఉపదేశములు పరిపూర్ణజీవితమునకు ఒక ప్రణాళికను తెలుపుచున్నవి. అతడు గీతయందు వర్ణధర్మమున్ను, శ్రీ భాగవతమునందలి ఏకాదశస్కంధమున వర్ణధర్మములు, ఆశ్రమ ధర్మములు రెండును తెలిపియున్నాడు. ఇవి పరిపూర్ణజీవితమునకు తగు ప్రణాళికను మనకు తెలుపుచున్నవి.

— స్వామి మాధవతీర్థ.

శ్రీ

శ్రీకృష్ణభగవానుడు జన్మమరణముల కాలచక్రము నుండి విడుదల పొందుటకు సులభోపాయమును యిందు చూపుచున్నాడు. వేదములు బ్రహ్మమునకు 'ఓం' అను బహుక్లుప్తమగు నామమును యొసగి యున్నవి. ఎవరు తమ మనసును నిగ్రహించి యింద్రియవిషయముల వైపు పరుగిడనీయక, నిర్మలప్రేమతో నిరంతర "ఓం"కార జపమును చేయుచుందురో, అట్టివారి మనసు బ్రహ్మమయము పొందియుండుటచేత జీవాత్మ దేహమును వదలు మరణసమయమునందు వారు బ్రహ్మము నందు శాంతమయవిశ్రాంతి పొందుచున్నారు. వారు కర్మబంధములకు వశులగుటలేదు. వారికి కర్మశేష ముండదు. కనుక వారికి పునర్జన్మము లేదు. అట్టివారికి మరణముకూడలేదు.

సూర్యుని కిరణములు సముద్రజలమును ఆవిరి గావించును. ఆవిరి మేఘములుగా మారుచున్నది. మేఘములు పర్వతములపై వర్షించును. ఆ నీరు నదులుగ మారును. నదులు సముద్రమునకు పరుగిడి యందు యేకమగుచున్నవి. అదేరీతి జీవాత్మ పరమాత్మయొక్క అంశము గనుక ఆత్మయందు ఐక్యముపొంది శాంతి ననుభవించుచున్నది.

హరిః ఓం తత్సత్

విజయాశ్రమము,
మద్రాసు-౬ } शान्त



# పుణ్యమరణము




संत विनोबा

పుణ్యమరణము కావలయు నన్నచో అగ్ని సూర్యచంద్రాది దేవతల ఆకాశాది భూతముల కృపయుండవలెను. అగ్ని కర్మకును యజ్ఞమునకును చిహ్నము. అంత్యసమయములోకూడ యజ్ఞజ్వాల మండుచుండవలె. న్యాయమూర్తి రానడేగారు యిట్లను వారు: "కర్తవ్యకర్మను నిరంతరమును పాలించుచు మరణించువాని జన్మము ధన్యము. ఏదోయొక సద్గ్రంథమును పఠించుచునో వ్రాయుచునో ఒక సత్కార్యమును చేయుచునో నేను మరణించితినా ధన్యుడనే." అగ్ని మండుచున్నదనిన అర్థమిది. మరణసమయమునకూడ కర్మ నాచరించుచుండుట అగ్నికృప. సూర్యునికృప యనగా బుద్ధియొక్క ప్రభ చివరవరకును ప్రకాశించుట. చంద్రునికృప అనగా అంత్యసమయములో పవిత్రభావనలు వృద్ధిచెందుట. చంద్రుడు మనస్సుయొక్క — భావనయొక్క అధిదేవత. శుక్లపక్షచంద్రునివలె మనస్సులో ప్రేమ భక్తి ఉత్సాహము పరోపకారము దయ — ఇత్యాది శుద్ధభావనలు పూర్ణవికాసమును పొందవలెను. ఆకాశముయొక్క కృపయనగా హృదయాకాశములో ఆసక్తియను మేఘపుసంచారము యేమాత్రము నుండరాదని అభిప్రాయము. ఉత్తరాయణమనగా ఆసక్తియను మేఘములు హృదయాకాశమును ఆవరింపకుండుటయే.



శ్రీకృష్ణ
# ఎనిమిదవ అధ్యాయముయొక్క సారము

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
## శ్రీ శ్రీ శ్రీ (1008) సీతారామయతీంద్రులవారు

సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, సర్వేశ్వరుడును, సకలకల్యాణగుణసాగరుడును అయిన భగవంతునియొక్క దివ్యవాణి శ్రీగీత. అట్టి పరమమహత్తరమైన యీ గీతా ప్రచారమే లోకకళ్యాణమునకు యథార్థమైన ఉపాయము. గీతావాణి సంపాదకులు యీ ప్రచారమే గీతావాణిద్వారా చేయుచుండుట యెంతో ముదావహము. ఈ సంవత్సరము గీతాజయంతికి 'అక్షరపరబ్రహ్మసంచిక' యను పేరున గీతావాణి విశేషసంచిక ప్రచురించనున్నామనియును, 'ఆ సంచికకు మీరు వ్యాసము పంపించవలయు' ననియును, నాకు వ్రాసినారు. అల్పజ్ఞుడనైన నేను యేమి వ్రాయగలను? అయినను వ్రాయక తప్పక పోవుటచే వ్రాయుచున్నాను.

'మానవుడు అశాశ్వతమును, దుఃఖాలయమును నైన యీ ప్రపంచమునుండి, అనగా ప్రకృతిబంధమునుండి బయటపడి, శాశ్వతబ్రహ్మానంద మనుభవించవలయునంటే, ఏమి చేయవలయును' అను సంగతి యీ అధ్యాయమున చెప్పబడిన ముఖ్యవిషయము.

"అంతకాలే చ మామేవ — స్మరన్ ముక్త్వా కళేబరం।
యః ప్రయాతి స మద్భావం — యాతి నాస్త్యత్ర సంశయః ॥"

'అంత్యకాలములో నన్నే స్మరించుకొనుచు, ఎవడు యీ దేహమును వదలిపోవుచున్నాడో, వాడు నన్ను పొందుచున్నాడు. ఈ విషయమున యెంతమాత్రమును సందేహములేదు' అని భగవానుడు చెప్పియున్నాడు. దానికి కారణముకూడ తరువాతి శ్లోకములో చెప్పినాడు. "యం యం వాపి స్మరన్ భావం - త్యజత్యంతే కళేబరం। తం తమేవైతి కౌంతేయ॥" 'కౌంతేయా! మానవుడు ఏయేభావములను స్మరించుకొనుచు దేహమును విడుచునో, వాడు ఆయాభావములనే పొందుచున్నాడు' అనుదానినిబట్టి మనము తెలిసికొనవలసినదేమనగా మానవుని అంత్యకాలములోని చివరిభావమునకు ప్రాధాన్యత యివ్వబడినది. చిట్టచివరి క్షణములోని మానసికస్థితినిబట్టి మరణానంతరానుభవముండును. మొదటినుంచియును పరమార్థమునుగూర్చి యెంతప్రయత్నించుచున్నను, జీవితముయొక్క ఆఖరిక్షణములో ప్రాపంచికసంబంధమైన భావము మనసులో కలిగినా, ఇక అంతేయును

పొడగును. దీనికి కారణము యేమంటే, ప్రాపంచిక మమకారము మనకు తెలియకుండనే, అంతఃకరణములో బలముగ నుండును. మమకారమున్నది అంతఃకరణములో యేమాత్ర మున్నను, మరణసమయములో అది యేరూపముగనైనను పైకివచ్చును. భరతుని చరిత్ర యీ విషయమునే తెలుపుచున్నది. భరతుడు తనగొప్పరాజ్యమును, అనేకమంది సుందరులను, భోగములను అన్నిటిని త్యజించి, అరణ్యమునకుబోయి తపస్సు చేసికొనుచుండగా, ఒక లేడిని పెంచుట తటస్థించినది. తనకు తెలియకుండగనే ఆ లేడిమీద మమకారము యేర్పడినది. ఆ కారణమున మరణసమయములో చేసిన తపస్సంతయు నేమైనదో–లేడిమీదనే భావము నిలిచినది. అందుచేత మరుజన్మమున లేడియై పుట్టవలసివచ్చినది. ఇక, జనకుడు మొదలగువారి విషయము చూడుడు. వారు అనేకప్రపంచవ్యవహారములలో నున్నను, విషయములందు పరిపూర్ణవైరాగ్యముకలవారై సర్వకాలసర్వావస్థలయందును భగవద్భావనయే కలిగియుండుటచేత వారికి మోక్షమే లభించినది. సదా ఏ భావము బలముగా కలిగియుండునో, ఆ భావమే మరణకాలమునందు వచ్చును. అర్జునా! "తస్మాత్ సర్వేషు కాలేషు — మామనుస్మర యుద్ధ్య చ" 'కాబట్టి సర్వకాలములయందును నన్నే స్మరించుకొనుచు యుద్ధము చేయుము' అని చెప్పియున్నాడు. ఇక్కడ యుద్ధము వర్ణాశ్రమ ధర్మములకు ఉపలక్షణము. అనుభవమునకు మనోభావన ప్రధానమును, కార్యకారియును గాని, బాహ్యమైన కర్మలుగాదు. కేవలము కర్మలు బంధనమునుగాని, మోక్షమును గాని కలిగించలేవు. "మన ఏవ మనుష్యాణాం-కారణం బంధమోక్షయోః" 'మనస్సే మానవులయొక్క బంధమోక్షములకు కారణము' అని చెప్పబడియున్నది. కనుక మనోభావము భగవంతునియందు నిలిపి, వారి వారి వర్ణాశ్రమధర్మములను కర్మలను చేయవలయును. అంతియేగాని, బాహ్యమునకు యేకర్మలను చేయక, మనస్సులో విషయచింతనము కలిగియున్నచో, అట్టివాడు సిద్ధపురుషుడును, సాధకుడును కూడ కాకపోగా, మిథ్యాచారియగుచున్నాడు. కాని, మనస్సులో భగవద్భావనకలిగియుండి, వర్ణాశ్రమధర్మములు కర్మములు ఆచరించుచున్నను, వాడు సిద్ధపురుషుడే. గీతయొక్క రహస్యమిదియే. కనుకనే సిద్ధపురుషులు తమకు మూడులోకములలోకూడ కావలసినదేమియును లేకున్నను, లోకకళ్యాణము కొఱకు కర్మముల నాచరించుచునేయుందురు. ఇదియే కృష్ణపరమాత్మకు ఇష్టమైన అభిమతమగుటచేత గీతలో ఈ అభిప్రాయమునే ముఖ్యముగా ప్రతిపాదించియున్నాడు.

## ప్రేమపూర్వక నారాయణస్మరణములు

సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు।
సర్వస్సద్బుద్ధిమాప్నోతు సర్వస్సర్వత్ర నందతు॥

ఓం

# అక్షరపరబ్రహ్మయోగము

కారణమేమియో తెలియదు కాని లోకములో జనులు పెక్కురు 'అష్టమి' పై ఒకింత చిన్నచూపు కలిగియుండుచున్నారు. తిథులలో అష్టమి పనికిరానిదని దానిని దూరముగ త్రోసివైచుచున్నారు. ఏదైన సంఖ్య చెప్పవలసి వచ్చినప్పుడు యెనిమిదిని తప్పించి మఱియొకదానిని చెప్పుచున్నారు. కాని చిత్రమేమియనిన, సాక్షాత్ శ్రీకృష్ణ పరమాత్మ ఆ 'అష్టమి' తిథియందే జన్మించెను. ఏ మహనీయుని దేవదేవునిగ జనులందరున్ను కొలుచుచున్నారో, అట్టి షోడశకళాపరిపూర్ణుడైన అవతారపురుషుడు జనులు ఈసడించుకొను ఆ 'అష్టమినే' ప్రీతితో వరించెను. ఇంతియేకాదు, తన యథార్థస్వరూపమగు అక్షరపరబ్రహ్మమునుగూర్చి గీతయందలి అష్టమాధ్యాయమందే విస్పష్టముగ వచించినవాడాయెను. కనుకనే అద్దానికి అక్షరపరబ్రహ్మయోగమను పేరు వచ్చినది. ఇది 28 శ్లోకములతో గూడిన చిన్న అధ్యాయము. అధ్యాయము చిన్నదైనను గొప్ప గొప్ప పరమార్థరహస్యములతో గూడియుండునది యగుటచే గీతయందలి యోగములలో నిది ప్రముఖస్థాన మాక్రమించుకొనియున్నది. ఈ అధ్యాయమందు భగవానుడీక్రింది ఐదు అపూర్వ తత్త్వములను వెల్లడించియున్నాడు.

(1) అంత్యకాలమున యెవరెట్టి భావన గల్గియుందురో, తదనుగుణ్యమగు జన్మమునే పొందుదురు. అంత్యకాలమున దైవభావనగలవారు దైవమునే పొందుదురు.

(2) అట్టి ఉత్తమసంస్కారము అంత్యకాలమున కలుగు నిమిత్తము జీవితమునం దెల్లపుడును భగవచ్చింతన చేయుచుండవలెను. అయితే వారి వారి జీవితయాత్ర కవసరమగు వ్యవహారములను విడువవలెనని అర్థము కాదు. వారివారి ఆశ్రమోచిత విధ్యుక్తధర్మములను ఆచరించుచు దైవస్మరణను మాత్రము త్యజించక యుండవలయుననియే భావము.

(3) చిత్తమును అన్యత్ర పోనీయక, అభ్యాసముచే హృదయస్థ పరమాత్మయందు నెలకొల్పుచుండవలెను. అందులకై పరబ్రహ్మవాచకమగు ఓంకారమును (ప్రణవమును) ఉచ్చరించుచు, తదర్థమును మననము చేయుచుండవలెను.

(4) దృశ్యవస్తువులన్నియు నశించిపోవునవి. అవి క్షరములు. పరమాత్మయో ఆ దృశ్యవస్తువులకు పరమైనవాడు; నశింపనివాడు; అక్షరుడు. అతనిని పొందినవాడు తిరిగి యీ సంసారదుఃఖమున తగుల్కొనడు. శాశ్వతకైవల్యమునే బడయును.

(5) అట్టి పరమాత్మ అనన్యభక్తిచే జీవులకు లభించగలడు. ఈ ప్రకారముగ అతి ముఖ్యములైన పరమార్థరహస్యము లనేకములు యీ అధ్యాయమున పొందుపరుపబడినవి. సాధ్యవస్తువగు పరబ్రహ్మ మెట్టిది? ఆ పరబ్రహ్మమును పొందుటకు వలయు సాధనమెద్ది— అను నీ రెండు విషయములు అనగా సాధ్య, సాధనములు రెండును యీ అధ్యాయమున పేర్కొనబడియుండుటంబట్టి దీని గొప్పతనము వెల్లడియగుచున్నది. మఱియు పరబ్రహ్మమునొక్క వాచకమగు ఓంకారమునుగూర్చి గీతయందు ప్రస్తావింపబడిన సందర్భములు రెండో మూడో కలవు. అందు యీ అధ్యాయ మొకటి. కాబట్టి యీ ఘట్టము ముముక్షువులకు, ధ్యానపరులకు అత్యంతప్రధానమై యొప్పుచున్నది.

అంత్యకాల భగవత్స్మరణమునుగూర్చి యీ అధ్యాయమున భగవానుడు ప్రముఖముగ బోధించుచుండుట ఒక గొప్ప విశేషము. అయితే భగవంతుని ఆశయము అంత్యకాలమందు మాత్రమే దైవస్మరణ చేయవలెనని కాదు, జీవిత కాలమం దెల్లవేళలయందును దైవచింతనము చేయుచు తదభ్యాసప్రాబల్యమువలన అంత్యకాలమందుగూడ చేయవలయుననియే భగవదభిప్రాయము. కనుకనే 'చ'కారమును ప్రయోగించి 'అన్తకాలే చ' (అంత్యకాలమందుకూడా) అని నుడివెను. ఈ 'చ'కారము సోమరులకు గొడ్డలిపెట్టుగా తయారైనది. అది లేనిచో అనేకులు భగవత్స్మరణను అంత్యకాలమువరకు వాయిదా వేసెడివారే. సోమరులయొక్క యిట్టి ఊహలకు తావులేకుండ చేయుటకే కాబోలు, భగవానుడంతటితో తృప్తిపడక ఆ 'అన్తకాలే చ' అను పదముయొక్క విపులీకరణమునకు వెనువెంటనే పూనుకొని 'తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర' (కాబట్టి ఎల్ల వేళలయందును నన్ను స్మరించుచుండుము) అని నుడివెను. ఒకవేళ అంత్యకాలమున మాత్రమే దైవస్మరణ చేసెదమని యెవరైన తలంచినప్పటికిని అట్టి అంత్యకాలము ఫలాని సమయమని యెవరు నిర్ణయింపగలరు? జనులెందరో బాల్యముననే మరణించుటలేదా? యౌవనమున మరణించుటలేదా? కావున భగవానుడాదేశించినట్లు జీవితమున సర్వకాలములందును దైవస్మరణ చేయుచుండుట భావ్యము.

జీవితము అశాశ్వతమైనది, క్షణికమైనది. అట్లే దృశ్యపదార్థములున్ను అశాశ్వతములు, క్షణికములు. వానిగూర్చి భగవానుడే యీ అధ్యాయమున 'అవి దుఃఖాలయములని, అశాశ్వతము'లని పేర్కొనెను. ఇక నట్టి దృశ్యవిషయములపైకి పరుగిడనేల? క్షరములగు వస్తువులను పట్టి వ్రేలాడినచో నేమి ప్రయోజనము? దుఃఖాలయమగు పదార్థము సుఖము నెన్నటికిన్ని యీయజాలదు. అట్లే అశాశ్వతమగు వస్తువు శాశ్వతపదవిని యేకాలమందును నొసంగజాలదు. కాబట్టి విజ్ఞుడగువాడు సుఖాలయమగు వస్తువేదియో, శాశ్వతమగు పదార్థమేదియో విచారించుకొనవలెను. అదియే అక్షరపరబ్రహ్మము, అనగా నాశములేని పరబ్రహ్మమని అర్థము. అట్టి అక్షరమును ఆశ్రయించినవాడే ధన్యుడు. అట్లుగాక లౌకిక అక్షరములను పెక్కింటిని నేర్చుకొనినను, పెక్కువిద్యలను బడసినను, అక్షరమగు పరమాత్మను తెలిసికొననిచో, వారందరు నిరక్షరకుక్షులేయగుదురు. లౌకిక అక్షరము ఒక్కటియు తెలియనప్పటికిని, ఒకవిద్యయు చేతగానప్పటికిని, అక్షరమగు పరబ్రహ్మమును తెలిసికొనినచో, ఆతడు పరిపూర్ణ అక్షరాస్యుడేయగును. కావున వయోవృద్ధులు, విద్యావృద్ధులు, ధనవృద్ధులు అందరున్ను పరమార్థక్షేత్రమున పలక, బలపము తీసికొని అక్షరాభ్యాసమును ప్రారంభించవలసియున్నారు. కడతేరుటకు మార్గమిదియొకటియే. క్షరమును (దృశ్యమును) ఆశ్రయించినవారు క్షరత్వమునే (బంధమునే) పొందుదురు. అక్షరమును (పరమాత్మను) ఆశ్రయించినవారు అక్షరత్వమునే (మోక్షమునే) పొందుదురు. ఇదియే సర్వశాస్త్రసిద్ధాంతసంగ్రహము. ఇదియే యీ అధ్యాయమందు తెలుపబడిన పరమరహస్యము. ఓం తత్ సత్

శ్రీ శుకబ్రహ్మాశ్రమము,
కాళహస్తి.

స్వామి విద్యాప్రకాశానంద

# అక్షరపరబ్రహ్మయోగము

## (శ్రీ యం. వి. నరసింహస్వామి, వాల్తేరు)



భగవద్గీత ఏడవ అధ్యాయములో భగవంతునిచే నుడువబడిన బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము అను పదములకు నిర్వచన మీ యధ్యాయమున నిరూపింపబడినది. కర్మతక్క తక్కినపదములు పరబ్రహ్మయొక్క నానావిధభావములను తెలియజేయును. కర్మ యా భావములందు పరబ్రహ్మ యావిష్కరించు ప్రక్రియను నిరూపించును. పరబ్రహ్మవిషయమై తేబడిన యీ వేర్వేరు కల్పనలలో నేది నిజమైనది యను ప్రశ్న యతిప్రాచీనమైనది. సర్వభూతములందును, సర్వదేవతలయందును, సర్వాత్మలయందును, సర్వలోకములందును, సర్వయజ్ఞములందును అంతర్యామిరై పరబ్రహ్మ వ్యాపించియుండెననియు, నవి యతనిని తెలిసికొనలేకపోయినను, వానిని నియమించు పరమాత్మయొక డున్నాడనియు, బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞ్యవల్క్యుడు ఆరుణి యనువాని కుపదేశించెను. ఉపనిషత్తులందలి యీ సిద్ధాంతమే బాదరాయణసూత్రములలో అంతర్యామ్యధికరణమున స్వీకరింపబడినది. (వే. సూ. 1.2 18-20) ఈ సిద్ధాంతము ననుసరించియే మనుజునియొక్క దేహమునందును (అధిదేహము) సర్వభూతములందును (అధిభూతము) సర్వకర్మలయందును సర్వయజ్ఞములందును (అధియజ్ఞము) సర్వదేవతలయందును (అధిదైవము) సర్వవస్తువుల సూక్ష్మరూపమగు స్వరూపము (ఆత్మ)నందును (అధ్యాత్మము) నొక పరమేశ్వరుడే నిండియుండుటచే భూతములు, దేవతలు, కర్మ, యజ్ఞములు మొదలుగాగల నానాత్వముగాని లేదా వివిధప్రకారములగు జ్ఞానములుగాని సత్యములు కావని భగవంతుడిచ్చట యర్జునుని కుపదేశించుచున్నాడు. సర్వభావముల కంతర్భావమగు నీ పరబ్రహ్మ అక్షరుడు అనగా నాశరహితుడు.

సంసారిజీవుల కీపరవస్తువు యోగము (ప్రాప్తి) యెట్లు సంభవించునను ప్రశ్నకు పరిహారముగా కృష్ణపరమాత్మ అంత్యస్మరణ నీ యధ్యాయమునందు విధించుచున్నాడు. (అంత్యస్మరణమనగా, జీవము కళేబరమును విడువనున్న క్షణములయందు భగవంతుని స్మరణము) ఇంద్రియములు చేష్టలుడిగి మనుజుడు స్మృతిదప్పి పడియుండిన యవస్థలో భగవంతుడు స్మృతికెక్కుట యెట్లు అను ప్రశ్న యిచ్చట రాకమానదు. ఈ ప్రశ్నకు కూడ సమాధానము కృష్ణుడే కల్పించెను. సదా తద్భావభావితత్వకారణమున అంతిమ స్మరణ సుసాధ్యమగును. ఇచ్చట మన స్తత్వశాస్త్రవిషయ మొకటి యుపన్యసింపబడినది. ఏ వస్తువు నొక డెప్పుడును తన మనమునం దిడుకొని స్మరించుచుండునో ఆ వస్తువాతని ప్రయాణావస్థయందుకూడ నప్రయత్నముగా నాతని ప్రత్యయపథమునందును. అందువలన

"సర్వేషు కాలేషు" అన్నికాలములందును అవిరతస్మరణ విధింపబడినది. ఇట్లు భగవదర్పిత మనోబుద్ధులుగలవాడై యెవ్వడు చరించునో వాడు తప్పక నన్ను చేరగలడని భగవంతుడు ప్రతిజ్ఞ జేసియున్నాడు. అంతేకాని జీవితాంతక్షణములయందు యేది జ్ఞప్తి కెక్కునో, ఆ భావమునే జీవి శరీరపాతానంతరము పొందుననునది మన సత్త్వశాస్త్ర విరుద్ధము. అట్లైనచో శరీరధాతుదోషములచే తాత్కాలికేంద్రియవైకల్య సంక్షుబ్ధ చిత్తవృత్తుడగు విజ్ఞునికి సైతము జడత్వము జనించుటచే తామసగతియే సంప్రాప్తమగును. ఇది శ్రుతిశాస్త్రసమ్మతముకాదు.

ఇచ్చట మరియొక ప్రశ్న రావచ్చును. ఇదివరకు శరీరము స్వస్థముగా నున్నపుడు సదా స్మరించబడుచుండెడి వస్తువు, అంతిమకాలమందు స్మృతి కెక్కునని నమ్ముట యెట్లు? దానికి సమాధానము: ఏదేని యొక పదార్థమును సదా స్మరించుటచే మనస్సు యందు దానివాసన యను సంస్కారమొకటి యంటును. ఈ సంస్కారము కారణముగా మరణకాలమందుకూడ ఆ వస్తుస్మృతి సంభవించును.

ఇది యట్లుండ నీ యధ్యాయమునందు భగవంతుడు అర్జునుని వ్యాజముగా గొని లోకానుగ్రహార్థము పరమోదారమైన సందేశము నొకండు వెలిబెట్టినాడు. అది ఇది. భగవద్గీతయందలి సారతమాదేశము యజ్ఞభావము.

సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వం ఏషవోఽస్త్విష్టకామధుక్ ॥ (గీ. 3-10

లోకసంగ్రహార్థము పరాత్పరుడు యజ్ఞమును పరికల్పించి యజ్ఞసాధనము చే పరగతిని పొందమని యుపదేశించినాడు. యజ్ఞభావమునకు భగవంతుడు కేవలముపదేష్టయే గాక అత్యుత్కృష్ట నిదర్శనభూతుడుకూడను. "అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర" "ఇచ్చట యీ దేహమందు యజ్ఞప్రవర్తకుడ నేగాక సాక్షాద్యజ్ఞావతారమును కూడ నేనే. చూడుము అర్జునా! అవ్యయాత్మనై, అజుడనైయుండి, అవిద్విద్ధమగు శరీరమును స్వీకరించితిని. ఇంతకన్న త్యాగమేమున్నది? ఆలోచించుము. అవ్యక్తమగు పరబ్రహ్మ నియమ్యమగు అచిజ్జడప్రకృతియొక్క నియమములకు లోబడి యెట్లుంటినో కంటివా? యజ్ఞము నెట్లు నిర్వర్తించవలెనో లోకమునకు చూపుచున్నాను" అని కృష్ణుడు సెలవిచ్చెను.

ఇచట యజ్ఞమనగా శరీరము నాయాసపెట్టు పారివ్రాజిక తపశ్చర్యకాదు. దేవతలకై అగ్నిహోత్రమందు చరుపురోడాశములను వ్రేల్చుటయు కాదు. ఈ యజ్ఞమందాహుతిగా నిర్దేశించబడినది యాత్మద్రవ్యమే. బ్రహ్మాయనెడి యగ్నిహోత్రమునందాత్మను సమర్పించుటయే యజ్ఞము. ఈ యజ్ఞ మాత్మనాశముకాదు, ఆత్మసంపూరణము; ఆత్మధిక్కారముకాదు, ఆత్మానందసాక్షాత్కారము.

ఓం నమో భగవతే వాసుదేవాయ

# శ్రీకృష్ణోపదేశము

శ్రీ నిత్యానందస్వాములవారు — శ్రీ కైలాసాశ్రమము,
శ్రీ భగవద్గీతాప్రబోధసంఘాధ్యక్షులు, శ్రీ కాళహస్తి.

శ్రీ కృష్ణపదారవింద మకరందాస్వాద శుద్ధాశయులగు ఆత్మీయులారా!
ఓం తత్సత్ నమస్తే!



భగవదుపదేశము, అ. 2, శ్లో॥ 11 "అశోచ్యాన్" అను వాక్యముతో ప్రారంభమై, అ. 18 శ్లో॥ 66 "మాశుచః" అను వాక్యముతో పరిసమాప్తి యగుచున్నది. కావున "అశోచ్యాన్" అను పదమునుబట్టియు, "మాశుచః" అను పదమునుబట్టియు దుఃఖనివృత్తి, లేదా నిత్యానందప్రాప్తి యనునదియే గీతోపనిషత్తుయొక్క ముఖ్యసందేశము. అఖిల ప్రాణులును అభిలషించునది నిత్యనిరతిశయానందము కదా! ఉద్యోగ, వ్యాపార, వ్యవసాయముల వలన ధనధాన్యవస్తువాహనములను, ఆహారాదులను సంపాదింప సాధనములగును. గీతోపనిషద్విజ్ఞానము చేతనే శాశ్వతసుఖము సిద్ధించును. బాహ్యములగు భోగభాగ్యములు ఆంతరంగికమగు దుఃఖమును అంతమొందింప నేరవు. నిత్యసుఖము దేహమునకు వెలుపల కలుగునది కాదు. హృదయముననే కలుగుచున్నది. దుఃఖము ఆగంతుకమైనది. నిత్యసుఖము స్వాభావికమైనది. నిత్యసుఖమును రాగద్వేషాదులు సూర్యప్రకాశమును మేఘములవలె మరుగు పఱచుచున్నవి. ఈ రాగద్వేషాదులు గీతావిజ్ఞానమనెడి వాయువుచే చెల్లాచెదరు చేసి వేయబడగా హృదయమున అవ్యక్తమైయున్న నిత్యసుఖము సువ్యక్తమగును. కర్మోపాసనలవలనగాని, ప్రత్యక్ష అనుమానాది ప్రమాణములవలనగాని, నామరూపములకు అతీతమగు బ్రహ్మము గోచరముకాదు. మరియు అ. 4. శ్లో॥ 16, అ. 9. శ్లో॥ 1. అశుభమగు సంసారమునుండి మోక్షమును, అ. 18. శ్లో॥ 54 "బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి" అని దుఃఖనివృత్తియు, అ. 2. శ్లో॥ 71, 72 హృదయగ్రంథి విచ్ఛేదమగు జీవన్ముక్తియు, అ. 11. శ్లో॥ 54, అ. 18. శ్లో॥ 55 విదేహముక్తియు ప్రబోధింపబడెను. గీతాధ్యయనతత్పరులారా! ప్రజాపరిపాలనగల యీ ఇరువదవ శతాబ్దమున అమరవాణియగు శ్రీగీతాశాస్త్రమున ప్రబోధింపబడిన ఆదర్శముకంటె మిన్నయగు

మఱొండు ఆదర్శము మానవులకు లేదనుట ముమ్మాటికిని సత్యము. మరియు శ్రీకృష్ణభగవానుడు ప్రాద్దేశసార్వభౌముడుగనో, మహోన్నతశిక్షణాధికారిగనో, లేక ప్రఖ్యాత మంత్రిగనో గాక మానవుని స్నేహితుడుగ చిత్రింపబడియున్నాడు.

“ఏకం సత్ విప్రా బహుధా వదంతి” ఉండునదెల్ల ఒక్కటే! తత్త్వవేత్తలు వివిధముల బేర్కొందురు. అశేషప్రజాదరణను పొందిన శ్రీ గీతామతల్లి భారతీయుల హృదయసీమయందు విశిష్టస్థానమును అలంకరించియున్నది. పవిత్రతలోను, పావనములోను గీతాభగవతి గంగాతరంగిణిని బోలియున్నది. శ్రీమద్గీత భారతావనిలో ప్రభవమొందినను, అందలి దివ్యోపదేశములు విశ్వమతప్రబోధకములై విలసిల్లుచున్నవి. గీతాప్రబోధము విశాలభావబంధురమగుటయేగాక హృదయమునకు సూటిగను, విజ్ఞానబోధముగను నున్నది. మానవులు కర్తవ్యతామూఢులైనపుడును, సంశయగ్రస్తులైనప్పుడును పరిశీలించుకొనుటకు ఆధ్యాత్మికశబ్దరత్నాకరమువలె గీతాంబ ప్రయోజనకారిణియైయున్నది. గీతావిజ్ఞానులు సంఘసేవజేసినను నిరహంకారులై జేయుదురు. వారికి కర్తృత్వ, భోక్తృత్వ భావనయే యుండదు. ఆత్మయందే వారి క్రీడ; సంగరహితులై లోకసేవ జేయుదురు.

---





నేనర్థం చేసుకున్నంతవరకు సంగ్రహంగా చెప్పాలంటే—జీవితంలో ప్రతిక్షణం మూల్యవంతమైనదనీ — దానిని సద్వినియోగపరచడానికి — కోరికలచే కలుషితంగాని కర్మను — తుది శ్వాస పీలుస్తున్నంతవరకు చేస్తూ - కర్మలోనే లీనం గమ్మనీ యెనిమిదవ అధ్యాయం పాఠకులను హెచ్చరిస్తూ వుంది.

ఆరంభించిన ప్రతిపనీ విజయాన్ని అందుకొనిందా అన్నది ప్రశ్నేగాదు. ఆచరిస్తున్న ప్రతి పనీ శ్రద్ధాభక్తులతో చేస్తున్నాడా లేదా అన్నదే ప్రశ్న. నిరంతరం కర్మ చేస్తూనే మృత్యువును ఆలింగనం చేసుకోగల్గడం ఉత్తమోత్తమం.

సంపాదకుడు, ఆంధ్రవాణి.



# అక్షరపరబ్రహ్మయోగము

హరిః ఓం శ్రీకృష్ణుడర్జునునకుపదేశించిన అష్టమాధ్యాయము చాలగొప్పది. దానిని తెలిసికొనుటచే యోగి, వేద యజ్ఞ దాన తపంబుల పుణ్యంబును బొంది, పరబ్రహ్మమును బొందుచున్నాడు.



శ్రీకృష్ణుడే పరబ్రహ్మము. జీవుడు శరీరములను బొంది జననమరణాది స్వభావముకలవాడు. నాశమగు జడమే అధిభూతము. జడజీవులకు సంబంధము జననస్థితి నాశకారణములగు కాలకర్మములను నడపు శ్రీశుని యిచ్ఛచే గలుగును. భవబంధనాశము నతని వలననే కావలసియున్నది. అతడు భక్తిచే భజించి అంత్యకాలమున తనచరణస్మరణజేసినవారికి జననమరణ పరంపరలేకఁ జేసి, మరల పుట్టి రాకుండునట్టి మోక్షమిచ్చి తన లోకమున నుంచి ఆనందింపఁజేయును. ప్రాణాయామాదులచే నంతరంగశుద్ధిఁబడసి "ఓం" అను నక్షరమును దాని అర్థమునుగూడ తెలిసి జపించుచు దేహత్యాగమొనర్చువారు అర్చిరాది మార్గముచే శ్రీహరిని పొందుదురు. శ్రీకృష్ణలోకమునకు బోయినవారు తిరిగి భవకూపమున పడరు. బ్రహ్మాది సర్వలోకములు అశాశ్వతములు - తిరిగి సంసారము నిచ్చునవి. మోక్షసమాన సుఖసంసాధకములుకావు. దీని నెఱిగినవాడు నచికేతునివలె నితరవిషయములగోరక విరక్తిఁజెందును. పరబ్రహ్మము సర్వోత్తమము. అవ్యక్తమనగా త్రిగుణములరాశి. దీనినుండిపుట్టి బ్రహ్మాండమున బ్రహ్మకు పగటి కాలమున అవ్యక్తమయశరీరములఁబొందిన జీవులు మరల కల్పాంతముకాగానే అవ్యక్తములోనేచేరిన దేహములు కలవారగుదురు. ఇట్లు పుట్టి చచ్చుచు తిరుగుచుండుటకంటె అక్షరుని అనగా శరీరాదులచేగూడ నాశములేని సకలజీవసృష్ట్యాదికర్తను, సర్వజ్ఞుని తెలిసికొని వానివలె నాశరహిత స్వరూపభూతశరీరులై తిరిగిరాని లోకమగు "విష్ణోః పరమం పద" మనంబడు వైకుంఠమున సుఖజ్ఞానమయులై విహరించుట లెస్సయని గుర్తించిన సుఖజీవులు ధూమమార్గమున నడుపు కర్మప్రవృత్తిని పరిత్యజించి, అర్చిరాది మార్గమునొసంగు నివృత్తికర్మనాచరించి జ్ఞానముచే పక్వమైన భక్తిగలిగి, దానిచే ప్రసన్నుడైన శ్రీకృష్ణునిచే మోక్షముఁబొంది సుఖించుచున్నారు. హరిః ఓం తత్ సత్.

"ఓం" అనగా అ + ఉ + మ = సర్వశబ్దవాచ్యుడు, సర్వోత్తముడు, సర్వజ్ఞుడు. నిర్దోషుడు, అనంతకళ్యాణపూర్ణుడు, సర్వవ్యాప్తుడు మొదలగు అనంతార్థములుకలవు,

**విద్వాన్ - ఘూళీ కృష్ణమూర్త్యాచార్యులు.**

ఓం

# కృష్ణం వందే జగద్గురుమ్



ప్రపంచమునందుగల సమస్తజీవులను మృత్యుదేవత మింగివేయుచున్నది. కాని మానవుడు మాత్రము మృత్యువును మింగుటకు వచ్చినవాడు. ఈ విషయమును బొత్తిగా మఱచిపోయినాము. మార్కండేయుడు, నచికేతుడు మొదలైనవారు మృత్యుదేవతను యెదుర్కొని జయించినారు. మరణములేని నిత్యజీవితమును ప్రతివారును పొందవచ్చునని శ్రీ జ్యోతిరామలింగస్వాములవారు శ్రీ తాయుమానస్వామి మొదలైన మహాత్ములు స్వానుభవముగా యెఱిగి ప్రపంచమునకు చక్కగా చాటించినారు.

లెక్కలేని మరణములుమాత్రము పొందినాముగానీ యెట్లు మరణించవలయునో అదిమాత్రము తెలిసికొనలేము. మరణము ఒక గొప్ప సద్గురువంటిది. మరణము అనేక మంచిపాఠములను నేర్పుచున్నది. ఒక్కసారి మరణించిన చాలును. ఎలా మరణించవలయునో ఆ విషయములను కరుణామూర్తియగు శ్రీ భగవానుడు తన వాక్యములలో 8-వ అధ్యాయమగు అక్షరపరబ్రహ్మయోగమునందు మిక్కుటముగా తెలిపియున్నాడు. ఈ అధ్యాయనామమును తిలకించినను చాలును. 5-వ శ్లోకమునందు:—

శ్లో॥ అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥

అని అంత్యకాలమందు నన్ను స్మరించుచు మరణము పొందినవాడు నా స్వరూపమునే పొందుచున్నాడని చక్కగ పెక్కువిధముల తెలిపిరి. ప్రాణప్రయాణకాలమున యెట్లుండవలయునో ఆ విషయములను "ప్రయాణకాలే మనసా చలేన" అను 10-వ శ్లోకమునను విశదపరచినారు. ఇంతకుముందు జన్మము యెట్లుండినదియో, యిక రాబోవు జన్మ విషయములనుకూడ మానవుడు చక్కగా తెలిసికొనవచ్చును. ప్రస్తుతజన్మ పరిస్థితులను బట్టి పూర్వము యెట్లుండినావో అను విషయమును, ఇప్పటి భావముల ననుసరించి రాబోవు జన్మవిషయములనుకూడ తెలిసికొనవచ్చును. అందుకని 6-వ శ్లోకమున యే భావమున శరీరమును వదలుచున్నాడో ఆ భావమే జన్మమని తెలిపిరి.

కాన జననమరణములకు మనమే కారణమై యున్నాము. ఇట్టి పరమరహస్యమును తెలుపునదియైన యీ పరబ్రహ్మయోగమును అందరికి నందజేయు "శ్రీగీతావాణి" ప్రకా

శించుగాక! ఇట్టి పావనసేవ యొనర్చు శ్రీ పూజ్యపాదులగు శ్రీ శ్రీ శ్రీ శంకరానంద స్వాములవారికి మన శాశ్వతకృతజ్ఞతలు సమర్పితములగుగాక !!

ఇట్లు,
శాంతానంద
ఆనందాశ్రమము, ఎర్త్రేపల్లె, చిత్తూరుజిల్లా.



# అక్షరబ్రహ్మయోగము

★

(స్వామీ సీతారాం, కార్తీక శు॥ ౧ బుధవారం, గాం. శ. 5-3-11)

ఇది భగవద్గీతలోని 8-వ అధ్యాయముయొక్క నామధేయమైయున్నది. ఇందులో ఈశ్వరతత్వము విశేషరూపమున బోధింపబడినదని గాంధీమహాత్ముడు తన నిష్కామ యోగములో వర్ణించియున్నారు.

అక్షర బ్రహ్మమనగా నాశములేని బ్రహ్మమని యర్థము. పరిణామములపొందు, అప్పటికప్పటికి రూపవిజృంభణము, నాశనముపొందు సృష్టికాదని యర్థము. ఆ సృష్టికి మూలాధారమైన పరమాత్మస్వరూపమే యిందులో వర్ణింపబడినది.

ఇందులో మొట్టమొదట కొన్ని నిర్వచనము లీయబడినవి. అన్నింటిలోనికి ముఖ్యమైనది —

"అధియజ్ఞోఽహమేవాత్ర దేహే"

సమస్త ప్రాణికోటి దేహములలో నేనే అధియజ్ఞమైయున్నాను అనునది. అందుచేత దేహములు విభిన్నముగా కన్పడినను తానొక్కడే యేకరూపమున అన్నింటిలోను 'యజ్ఞభుక్' అయ్యున్నాడు. శరీరపోషణకు అర్పించు అన్నాదులున్నూ, మానసికాభివృద్ధికి వినియోగించు విద్యాదులున్నూ, ఆధ్యాత్మికానుభవము కల్గించు ఉన్నత తపోసాధనలున్నూ, సమాధిస్థితిలోగల్గు ఐక్యానందములున్నూ నాకే అర్పితమగుచున్నవని శ్రీకృష్ణుడు ధృవపరచినాడు.

ఇంకొక సంగతికూడా మనము తెలుసుకొనవలెను. "యద్భావం తద్భవతి" అనునది 5, 6, 7, 8 శ్లోకములలో వివరించబడినది.

దైవభక్తి యెట్టిరూపమున పరిణమించవలెనో 14_వ శ్లోకము స్పష్టపరచుచున్నది. ఇతర పదార్థములయందు మనసు పోనీక యెల్లప్పుడూ, ప్రతి నిముషమూ పరమాత్మనే స్మరించుచుండవలెను. ఆ శ్లోకములో చెప్పిన పదం 'నిత్యయుక్తస్య' అనుదానిని

గమనించవలెను. 'యుక్తః' అనునపుడు విషయములు యింద్రియములందును, యింద్రియములు మనస్సునందును, మనస్సు బుద్ధియందును, బుద్ధి జీవాత్మయందును, జీవాత్మ పరమాత్మయందును లీనం కావలెనని అర్థము. అట్టి స్థితి అప్పుడప్పుడూ వచ్చిపోవుచున్నదిగాక నిత్యమై, శాశ్వతమై యుండవలెను. అంటే నిర్వికల్పసమాధి స్థితిలో నుండవలెను. వికల్పసమాధిస్థితిని కూడా అతిక్రమించవలెను.

గీతలో బోధింపబడిన శ్రీకృష్ణుడు నిర్గుణ పరబ్రహ్మస్వరూపమని 16-వ శ్లోకము ధృవపరచుచున్నది. ఏ దేవత అనుగ్రహమున ఏ లోకము లభించినను, అచ్చటినుండి భూలోకమునకు పునరావృత్తి గల్గుటయూ, పునర్జన్మగల్గుటయూ సంభవించుచున్నది. శ్రీకృష్ణుని, అనగా నిర్గుణపరబ్రహ్మను పొందినవారుమాత్రమే పునర్జన్మలేని మోక్షసామ్రాజ్యమున కర్హులగుచున్నారు. సగుణబ్రహ్మను పొందినవారు ఆ లోకములో నిల్చియుండి ఆ బ్రహ్మతోబాటు నిర్గుణ పరమాత్మని పొందుదురని బ్రహ్మసూత్రములలో బాదరాయణ వ్యాసులు నిర్ధారించియున్నారు. దానికినీ యీ శ్లోకమునకునూ కొంచెము భేదమున్నట్లు కన్పడును. దానిని సమర్థించుటకునూ వేరొక ఉపాయము గలదు. ఈ శ్లోకములో బ్రహ్మయని నుడువబడిన వ్యక్తి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో, త్రిమూర్తులలో బ్రహ్మ కావచ్చును. అపుడు పునరావృత్తి తప్పదు.

17-వ శ్లోకము మొదలు చివరివరకు చెప్పబడిన విషయములు మహత్తరమైనవి. కాలమంతయూ ఆ పరమాత్మస్వరూపమునియూ, అందులోనూ యోగులకు, యోగులు కానివారలకు ఆయా కాలమునుబట్టి, ఆయా జ్యోతిరంధకారమునుబట్టి దేహత్యాగము చేసినపుడు భిన్నమైన సద్గతులు కల్గునని తెలుపబడినది. యోగాచరణమునందు ఆయా సమయములకు, ఆయా మార్గములకు ప్రత్యేకతగలదని శ్రీ వినోబాజీ సూచించియున్నారు. సామాన్యులకు అది అగమ్యమైన విషయము. ఐననూ యోగాభ్యాసము చేయువారు అట్టి అనుభవములను పొందవచ్చును.

"యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి"

ఇత్యాది 20-వ శ్లోకములోని 2-వ పాదము; దానినిబట్టికూడా సృష్టింపబడిన భూతములకును, సృష్టికర్తకునూ ఉండే భేదము మరియొక పర్యాయము తెలుపబడినది. అట్లు నశించనివాడే అధియజ్ఞమైనవాడు. అక్షరుడన్ననూ అదియే అర్థము. నాశనమునకు, పరిణామమునకు అతీతుడైనవాడని యర్థము. అట్టివానిని "సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ" అని స్మరించుచూ ఆ ఉన్నతస్థానమునకై అందనిభావములతో, సర్వవిధప్రలోభములతో పోరాడుచూ, తన స్వస్థితిని స్మరించుచూ నిశ్చలతత్త్వుడై జీవన్ముక్తికి అర్హుడు కావలెను. అట్టి భావమునే భగవద్గీత బోధించుచున్నదని యెంచి దానియందే మనస్సు లగ్నము చేయవలెను. వేరొండు గత్యంతరము లేదు.

ఓమ్



గీతావాణి గీతాజయంతి ప్రత్యేక సంచికను వెలువరింప బూనుకొనుట ప్రశంసార్హ విషయము. అష్టాక్షరీ మహా మంత్రమువలె గీతలోని అక్షర పరబ్రహ్మ యోగమను ౮-వ అధ్యాయము ముఖ్యమైనదియు, సర్వోత్తమమైనదియునై అలరారు చున్నది. ఈ అధ్యాయమునందు బ్రహ్మము, అధ్యాత్మము, కర్మము, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము, అంత్యస్మరణక్రమము జిజ్ఞాసువుల కత్యావసరములగు యీ యేడు ముఖ్య సమస్యలను గీతాచార్యుడు విపులముగ చర్చించియున్నాడు. పై యేడు ప్రశ్నములలో కడపటిదియగు అంత్యస్మరణక్రమము అమూల్యమైనది. సంవత్సరమంతయు శ్రమించి పఠించిన విద్యార్థికి పరీక్షాసమయమున ఆ ముఖ్యాంశములన్నియు స్మరణకు రావలసినట్లు జీవితమంతయు చేయబడిన యోగసాధన, ప్రణవోపాసనము, భగవన్నామస్మరణము అవసానకాలమున జ్ఞాపకమునకు రావలయును. అప్పుడే పరమశాంతి; అపుడే కైవల్యము; అపుడే పునరావృత్తిరహిత దివ్యధామప్రాప్తి. ఈ అనంతజ్ఞానము యీ పరమశాంతి చిత్తైకాగ్రతతో చేయబడిన అభ్యాసయోగమున సుసాధ్యమని శ్రీ కృష్ణదేవుడు లోకమునకు చాటియున్నాడు. యుగములు మారినను, దేశములు మారినను, వస్తువులు మారినను, వ్యక్తులు మారినను, వ్యవహారములు మారినను యీ సువర్ణోపదేశము నిత్యనవీనమై ముముక్షుజన హితకారిణియై శోభిల్లుచున్నది. "ఓమ్"

శ్రీ సత్యానందాశ్రమము, ఇనమడుగు,
30—9—57.

— శ్రీ సత్యానందమహర్షి.

ఓమ్

# అక్షరపరబ్రహ్మయోగము

★



వేదాంతశాస్త్రమునకు కీలకము లైన ప్రశ్నలను ఈ అధ్యాయమున అర్జునుడు శ్రీకృష్ణభగవానుని అడిగినాడు. (1) బ్రహ్మమననేమి? (2) అధ్యాత్మము, (3) అధిభూతము, (4) అధిదైవము; (5) కర్మ అననేమి? (6) అధియజ్ఞము దేహమం దెట్లుండును? (7) మనోనిగ్రహము గలవారిచే నీవు మరణావసానకాలమందు యెట్లు యెరుగబడుదువు?

ఈ యేడు ప్రశ్నలకు సమాధానము తెలుసుకొనినచో, వేదాంత సారమును గ్రహించినట్లే. కావున యీ ఎనిమిదవ అధ్యాయము వేదాంత సారమును బోధించుచున్నది. సారభూతమైన విజ్ఞానమును, గీతావాణి ప్రత్యేకసంచికగా ప్రకటించుట యెంతయు ముదావహము. యోగసారము ఉపనిషత్సారమునైన గీతలోని ప్రతి అధ్యాయమును గుఱించి ప్రత్యేక సంచికలు క్రమేపి వెలువడునుగాక యని శ్రీకృష్ణపరమాత్మను ప్రార్థించు చున్నాను.

హైదరాబాదు,
14—10—57. } [signature]



# గీతావాణీ ప్రశంస

స్వామి ఆత్మానంద,
శ్రీ నిర్వచనాంధ్రగీతాభాష్యాదిగ్రంథకర్త, పాలకొల్లు.

మ॥ "ధర సౌఖ్యంపుఁబ్రసక్తి ముచ్చటగఁ బార్థా! మూడునాళ్లే సుమా,
మరణం బెన్నటికైన తప్పనిదె జన్మంబొందు జీవాళికిన్;
బరమోదాత్తము గీత నక్షరపరబ్రహ్మాఖ్యయోగంబు, శ్రీ
హరి, నన్ జేరెడి మార్గమున్ దెలుపు", నంచాడెన్ రమాజానియున్.

శా॥ "గీతావాణి"ఁ బఠించు సజ్జనులకున్ గృష్ణోపదేశార్థమున్
బ్రీతిన్ విస్తృతమున్ బొనర్పఁగ శ్రమం బెంతేనియున్ సైచి యీ
భాతిన్ గ్రంథ మొకండు నేర్పలరఁగాఁ బ్రత్యేక మర్పించి రో
హో! తత్త్వజ్ఞులు రామకృష్ణయతివర్యుల్ శంకరానందులున్.

సీ॥ నాస్తికు లెందఱో ఆస్తికులైరి మీ అమృతోపమోక్తుల నాలకించి
అట్టి ఆస్తికులందు గట్టిపట్టునుబట్టి పలుమంది అభ్యాసపరులు నైరి
అట్టి సాధకులందు నెట్టన నిఁశఁ గొంద ఱిద్ధచరిత్రులు సిద్ధులైరి
వారు వీరన కెల్లవారు గీతను జేతఁబట్టి పఠించెదు ప్రాజ్ఞ

గీ॥ ఇంత లోకోపకారంపుఁ జింత మీకుఁ
గలదు కావున సభఁజేయు స్థలములందుఁ
బ్రజలు మిము బ్రహ్మరథమును బట్టుచుంద్రు
జంటయతులార! మా నోముపంటలార.



ఓమ్



అష్టాదశాధ్యాయాత్మకమైన భగవద్గీతలో అష్టమాధ్యాయానికి ఒక విశిష్టతవున్నది. ఇంతవరకు గడచిన ఏడధ్యాయాలలో అర్జునుడు కొన్ని ప్రశ్నలను అడిగాడు. శ్రీకృష్ణ పరమాత్మ అన్నింటికి విశదంగా జవాబు చెప్పాడు. ఈ ఏడు అధ్యాయాలచేత శ్రీ కృష్ణుని ఉపదేశం విన్న తరువాత అర్జునుడు కొంత పరిపక్వత కలవాడైనాడు. బ్రహ్మ విషయకంగా, కర్మవిషయకంగా యింకా ఆధ్యాత్మికమైన ప్రశ్నలనేకం అడిగే సమర్థుడయ్యాడు.

శ్రీకృష్ణుడు యీ అధ్యాయారంభంలో అడిగిన మొదటి ఆరు ప్రశ్నలకు సంగ్రహంగాను, కడపటి ప్రశ్నమైన అంత్యకాలస్మరణనుగూర్చి విశదంగాను జవాబిచ్చాడు. మానవుని జీవనకాలంలో యితరచింతలో వుండి అంత్యకాలంలో మాత్రం భగవచ్చింతన వుంటే చాలునని భగవంతునికి వివక్షితంకాదు. జీవితకాలంలో సహితం యే పని చేసినా "భగవానేవ స్వస్మై స్వప్రీతయే స్వయమేవ కారయతి" అని కర్తృత్వాన్ని భగవంతుని కర్పించి నిశ్చింతగా నిరంతరంగా భగవచ్చింతన గలవానికే, అభ్యాసపాటవంచేత అంత్యకాలంలో మోక్షసాధనమైన భగవత్స్మరణ లభ్యమౌతుందన్నదే యీ అధ్యాయంలోని ఆశయం.

చిత్తూరు,
19—11—57.

కీశాత్తూరు శ్రీనివాసాచార్యులు,
పరీక్షామంత్రి - సం. భా. ప్ర. సభ.

ఓమ్

# సందేశము

## గీత:— ఎనిమిదవ అధ్యాయము

హరిః ఓం. భగవద్గీతా యోగమును సంపూర్ణయోగమనియు, అక్షరబ్రహ్మయోగమనియు, అక్షరపరబ్రహ్మయోగమనియు, సర్వయోగమనియు వ్యవహృతము సలుపనగును. వాస్తవములో వున్నది ఒక్క యోగమే, అదియే బ్రహ్మయోగము. అన్ని యోగములు అయ్యదియే.

భగవద్భక్తుండై యుండనిదే, స్థితప్రజ్ఞుండై యుండనిదే, గుణాతీతుండై యుండనిదే మానవుఁడు పరిపూర్ణకర్మయోగి కాఁజాలఁడు. కృతులు గీతాభావనయందు నాటుకొనియున్నప్పుడు ఆ కృతులు యోగకృతులగును. అదియే బుద్ధియోగము. బుద్ధియోగమునకు ఆధారశిల ధ్యానయోగము.

భగవద్గీత సహస్రశీర్షుండైన పురుషునకు నిర్ణీతకర్తవ్యాచరణములనెడి జ్యోతుల నారతి యొసగును. అక్షరపరబ్రహ్మయోగమున స్వామి సర్వులకు నుపదేశించిన యోగము స్మరణయోగము.

"అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥"

ఇది అక్షరపరబ్రహ్మయోగమాలకు మేరువు, మధ్యమణి.

R Ramabose

వెంకటగిరిటౌన్, నెల్లూరుజిల్లా. (ఆంధ్ర)



ఓం

ఆత్మతత్త్వం యీ మనుష్యశరీరంలోవలెనే అన్నిభూతాలలోనూ వుంది. కాని యీ మనుష్యశరీరంలో అనాసక్తస్థితిరూపంలో అనగా విశేషరూపంలో వుండగలిగింది. ఆత్మతత్త్వమే సంపూర్ణజగత్తుయొక్క నశ్వరస్వరూపంగానూ వ్యక్తమై అధిభూతమనిపించుకొనింది. అదియే అన్ని భూతములలో సర్వవ్యాపీస్వభావమై 'పురుషు'డనిపించుకొంది. ఆ పురుషునినే అధిదైవతమనినారు. అదే ఆత్మతత్త్వమే శరీరంలో అనాసక్తస్థితిలో వున్నపుడు అధియజ్ఞమనబడింది. సర్వభూతాలలో క్షరభావము అధిదైవతభావమను రెండు రూపాలలోమాత్రంవుండే ఆత్మ మనుష్యశరీరంలో క్షరభావ అధిదైవతభావ అధియజ్ఞభావమనే మూడురూపాలతో విరాజమానమై వుంది.

(గీతామృతంనుండి)

ఓం

కర్తృత్వ భోక్తృత్వాది లక్షణములు లేని నిర్గుణస్థితికి బ్రహ్మమనియు, కర్తృత్వ భోక్తృత్వాది లక్షణములుగల సగుణస్థితికి అధ్యాత్మ (జీవాత్మ)మనియు, యజ్ఞయాగాది క్రతువులచే పొందబడి దేవతలకన్న అగ్రస్థానము నొందినపుడు ఆ అధ్యాత్మమే అధిదైవమనియు, నశించునది కావున దేహమునకు అధిభూతమనియు, యీ దేహము చేయబడు యజ్ఞయాగాదులే కారణముగా గల సృష్టి వ్యాపారమునకు కర్మయనియు చెప్పబడెను. దేహము, దేహమునందలి జీవాత్మ, జీవాత్మయే సృష్టికర్తయగు స్థితి, సృష్టికర్తయే సర్వభోక్తయగుస్థితి, సర్వభోక్తయే నిర్గుణమగుస్థితి, యీ తరగతులన్నియు నిందు సూచింపబడినవి. కావున నొకే పదార్థమునకే అవస్థాభేదము ననుసరించి కల్గిన పేర్లు.

— విన్నకోట వెంకటరత్నశర్మ.

# నా అభిప్రాయం

ఎనిమిదవ అధ్యాయాన్ని గురించి వ్రాస్తూ వ్రాస్తూ నా మనస్సు కొంత కొంతగానేవుంది. మోక్షం పొందుటకు యోగమార్గం ద్వారా ఉత్తరాయణమార్గంగుండా దేహాన్ని వదలవలసిన ఆవశ్యకత యేమో, యీ విషయంలో వ్యాసుని అభిప్రాయమేమో నాకు బోధపడలేదు. గీతకు టీకలు వ్రాసినవారు యీ విషయంలో తేలికగా జారిపోయినారే కాని అనివార్యంగా చూపించలేదు. వాసనారాహిత్యం — జ్ఞాననిష్ఠే, మోక్షానికి ఆవశ్యకమంటూ వారు సూచించినారు. నా పంథాకూడా ఆ విధంగానే వెళ్లింది. కాని మహాభారతంలో ఆయా భాగాలలోనూ సంగంలోనూ గమనికతో చూచినపుడు, వ్యాసుని కాలంలో పై విధంగా దేహత్యాగం చేయుటలో యెక్కువ గౌరవం వుండిందంటూ భావించాలె. ఈ అధ్యాయంలోని 27-వ శ్లోకం కొంత మట్టుకీపద్ధతిని తాత్సారం చేసిందంటూ వూహించవచ్చు. కాని ఆ మాట కూడా స్పష్టంగా చెప్పలేము. కాని గీతకు తర్వాత కాలంలోమాత్రం యీ ప్రాచీనపద్ధతి ఉపేక్షింపబడ్తూవచ్చింది. కావుననే టీకాకారు లీవిష యాన్ని గౌణంగా భావిస్తూవచ్చారు. జ్ఞానమార్గీయులు భక్తిమార్గీయులు జ్ఞానేశ్వరునివంటి యోగమార్గీయులుసైతం యీ విధానాన్ని పట్టుదలతో స్వీకరించకపోయారు.

శ్రీ కిశోరీలాల్ మశ్రూవాలా.

(గీతామంథన్ నుండి)

ఓమ్

# సందేశము





“సప్తమాధ్యాయముయొక్క చివర సూచించిన విషయములపై అర్జునుడు జిజ్ఞాసతో నడిగిన ప్రశ్నలకు సమాధానముగా భగవంతుడు పరమకరుణతో బోధించినట్టి బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము. వీని స్వరూప లక్షణములు మిక్కిలి మననీయములు.

ఇవిగాక అర్జునుని చివరిప్రశ్నకు సమాధానముగా, ప్రయాణకాలమున ముముక్షువునకు కర్తవ్యము, ధ్యాతవ్యము మరియు ప్రాప్తవ్యమును నగు వస్తు ప్రతిపాదనకై పునరావృత్తి సహితరహితస్థానముల స్వరూపమును బోధించు నుద్దేశ్యముతో కర్మిష్ఠులకు ఉపాసకులకును గలిగెడి కృష్ణ శుక్ల మార్గములను యీ అష్టమాధ్యాయమున చక్కగా బోధింపబడినది. ఇట్టి అధ్యాయముయొక్క సారసర్వస్వము విపులముగాను సులలితశైలితోను చక్కని ఉపమానాదులతోను యీ ప్రత్యేకసంచికరూపముగా వెలువడి పాఠకుల కత్యంతోపాదేయమైయున్నది.”

ఎస్. రాజగుప్త,

బెంగుళూరు.



శ్రీ

# తొలిపలుకులు



మనుష్యుడు యెందుకు పుట్టినాడు? చచ్చే కోసం. ఎందుకు చస్తాడు? పుట్టేకోసం – అని మనకు దొరికే సామాన్యమైన సమాధానం. కాని నిజమిదికాదు. ఎందుకు పుట్టినాడు? మరీ పుట్టకుండా వుండేకోసం. ఎందుకు చస్తాడు? మరీ చావకుండా వుండేకోసం. జన్మమెందుకు? జన్మ రాహిత్యంకోసం. మరణమెందుకు? మరణ రాహిత్యం కోసం. ఇదీ పరమార్థం.

ఒక మహాత్ముడు చెప్పినాడు: "పుట్టెనా మరి చావు నెఱుగని గుట్టు నేర్వగవలె జుమీ, ఆ పట్టు దొరకొనదేని మరి తా, పుట్టు వెఱుగని విద్యనైనను పట్టుకొనవలెను". పుట్టి చావని విద్య జ్ఞాన విద్య. చచ్చి పుట్టని విద్య ఉపాసనావిద్య. మనుష్యుడు అజ్ఞానంతో పుట్టినాడు; కాని అజ్ఞానంతో చావరాదు. ఏడుస్తూ పుట్టినాడు; యేడుస్తూ చావరాదు. పుట్టేటపుడు పసివాడు కాబట్టి – అజ్ఞానం కాబట్టి యేడ్చినాడు. సరిపోయింది. మరణించేటపుడు యేడుస్తూ మరణించడం మానవునికి శోభాయమానం కాదు. పుట్టేటపుడు మనుష్యప్రాణితప్ప మరేప్రాణులూ యేడ్వవు. మనుష్యుడు "కోఽహం కోఽహం" అంటూ యేడుస్తూ పుట్టినాడు. "సోఽహం సోఽహం" అంటూ మరణించాలె. అప్పుడే జన్మ సమాప్తమైతుంది. సమాప్తమంటే అర్థమేమి? 'సమ' అంటే బ్రహ్మం. "సమం బ్రహ్మ" – అని భగవద్గీత అయిదో అధ్యాయం పందొమ్మిదవ శ్లోకంలో, సమశబ్దా

నికి బ్రహ్మమనే అర్థం చెప్పబడింది. ఆప్తమంటే పొందుట. బ్రహ్మ ప్రాప్తే సమాప్తం. చావడంతో సమాప్తం కాదు. చస్తే మళ్లీ పుట్టనే పుట్తున్నాడు. ఎక్కడికి సమాప్తం!

జ్ఞాని యిక్కడే ముక్తిని పొందినాడు. వాడు చచ్చినాక యెక్కడో ముక్తిని పొందుతాడనే మాటలేదు. వాని ముక్తి అప్పు సప్పుల బేరంకాదు. అప్పటికప్పుడు నగదుబేరం. నిజానికి వానికి మరణమే లేదుగదా! మరణించిన తర్వాతనే జ్ఞానులైనారు కాబట్టి వారికిక మరణంలేదు. కానీ ఉపాసకుడు మరణానంతరం బ్రహ్మ లోకంచేరి ముక్తిని పొందుతాడు. వాడూ తిరిగిరాడు. ఈ రెండు తర గతులకు చెందనివర్గం ఒకటివుంది. ఒకటికాదు. కోటానుకోట్లు ఆ రకంనారే. వాళ్లు జన్మిస్తారు. ఎందుకు? చచ్చేకోసం. చస్తారు. ఎందుకు? పుట్టేకోసం. ఏతంబానలాగా పైకీ క్రిందికీ తిరుగుతూండుటే వారి పని.

మొత్తానికి యీ అధ్యాయంలో 'జరామరణమోక్ష' విద్య చెప్పబడింది. అనగా మరణవిద్య చెప్పబడిందని అర్థం. మృత్యు గ్రస్తుడైన మానవుడు మృత్యుంజయుడు కావాలె. ఇది శాస్త్రాల ఆశయం. అందుకు కావలసిన భగవదుపాసన యీ అధ్యాయంలో బహువిధాల చెప్పబడింది. ఉపాసనాప్రధానమైన అధ్యాయం కాబట్టి యెంతెంత చెప్పుకున్నా అవగాహనకాడం కష్టం. అనుభవవిద్య అనుభవానికి వచ్చినపుడే అర్థమైతుందిగాని అనుకున్నంతమాత్రంతో అర్థంకాదు. భగవంతు డనుగ్రహించుగాక!

గంపెడు గొడవలెందుకు? భగవంతు డీ అధ్యాయంలో రెండు మహావాక్యాల నుపదేశించాడు. అవి మహావాక్యాలే కాదు; మహామంత్రాలు. "తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్య చ" (7 శ్లో.) "తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున"

(27 శ్లో.) అధ్యాయంయొక్క ఉపక్రమోపసంహారాలలో చెప్పిన యీ మహామంత్రాలు నిరంతరమననీయాలు. మృత్యుగ్రస్తుడైన మానవుడు మృత్యుంజయు డయ్యేటందుకు యింతకు మించిన ఉపాయమేముంది? "తాను సంసారంలోవున్నా తనలో పరమాత్ము డుండాలె" — దీనికంటె మించిన యోగమేముంది? ఇదే మహా యోగం.

అనంతపురంజిల్లా కల్యాణదుర్గంలో శ్రీశంకరానందస్వాముల వారొసగిన ఉపన్యాసాల చిత్తుప్రతులనూ, మరీ ఆయా సహాయక గ్రంథాలనూ సేకరించి యీ రచనను కూర్చినాను. ఎప్పటివలె వ్యవహారభాషలోనే గ్రంథం వ్రాయబడింది. ఇందులో సారవస్తు వేదైనా లభిస్తే అది గురుదేవునిది. లోపదోషాలను నా అల్పజ్ఞతపై వదలి క్షమించండి. అమూల్యమైన తమ అభిప్రాయాలను, సందేశాలను పంపి గ్రంథాన్ని సమగ్ర శోభాసంపన్నంగా ఉత్తమభావభూషితంగా అనుగ్రహించిన పూజ్యపాదులకు, పుణ్యమహాశయులకు నా అనంతానంత ప్రేమాభివందనాలు. పాఠకులు ఆ సందేశాలను తప్పక పఠించాలంటూ సానురోధంగా అభ్యర్థిస్తున్నా.

మరొక్కమాట. ఈ పుస్తకం 1957 వ సంవత్సరంలో గీతావాణి పత్రికకు విశేషసంచిక రూపంలో మొదటిసారి ముద్రింపబడింది. నాటి ప్రతులన్నీ ముగిసిపోవడంతో రెండవ ముద్రణ నందుకొనింది. మా సేవను యింతగా ఆదరించిన ఆంధ్రప్రజకు గీతాభక్తులకు హృదయపూర్వక నమస్కారాల నర్పిస్తున్నాను.

ఇట్లు,

స్వామి శ్రీరామకృష్ణానంద

'గీతావాణి' సంపాదకులు.

# గీతావాణి ప్రచురణలు

"ఆంధ్రభూమిలో గీతాతత్త్వసందేశాన్ని ప్రచారం చేసే ఏకైక మాసపత్రిక – విశేషసంచికతో కలిసి

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 4–00 |
| 1. భక్తియోగము | 1–00 |
| 2. జ్ఞానయోగము | 1–00 |
| 3. క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము (రెండవ కూర్పు) | 1–00 |
| 4. అక్షరపరబ్రహ్మయోగము (రెండవ కూర్పు) | 1–00 |
| 5. విజ్ఞానయోగము | 1–00 |
| 6. పురుషోత్తమప్రాప్తియోగము | 1–00 |
| 7. గుణత్రయ విభాగయోగము | 1–00 |
| (పై పుస్తకములన్నియు కన్నడ భాషలో సైతం దొరకును.) | |
| 8. గీతాతాత్పర్య ప్రదీపము | 1–50 |
| 9. గీతామూలము | 0–50 |
| 10. గీతాసూత్ర రత్నమాల | 0–25 |
| 11. శాంకర వేదాంత ప్రక్రియ | 0–50 |


వివరములకు వ్రాయండి:—

మేనేజరు,

'గీతావాణి' కార్యాలయము,

ఆళ్లగడ్డ పోస్టు, కర్నూలుజిల్లా.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

శ్రీ శంకరానందస్వాములవారి

# భగవద్గీతోపన్యాసాలు

## (ఎనిమిదో అధ్యాయం)

# అక్షరపరబ్రహ్మయోగం

మకాం — కళ్యాణదుర్గం. 6—9—57.

ప్రియమైన ఆత్మబంధువులారా!

ఇంతటి విశాలనరనారీరూపంతో విరాజమానమైవుండే శ్రీకృష్ణ భగవంతునికి ప్రప్రథమంలో నా హృత్పూర్వకనమస్కారాలు. భక్త



జనులైన మీ అందరి అనుమతితో భగవద్గీత లోని యెనిమిదవ అధ్యాయం - పేరు అక్షర పరబ్రహ్మయోగం — ప్రారంభిస్తున్నాను. సావధానచిత్తంతో ఆలకించి నా శ్రమను సార్థకం చేయగల్గుతారంటూ ఆశిస్తున్నాను.

ప్రపంచంలో ఒక నియమముంది. ఒకరి ద్వారా ఒక వస్తువు తీసుకో దలచావా — ప్రత్యామ్నాయంగా వారికొకటి యిచ్చే తీరాలె. నేను మీకు గీతోపన్యాసాలు వినిపిస్తున్నాను. మరి మీరు నాకేమిస్తారు? ...... భయపడకండి. ఏమీ అక్కర లేదు. చెప్పే మాటలను శాంతంతో సావధానంతో నిశ్శబ్దంతో వినండి. అంతేచాలు. నేను కోరేదంతే. బజారునుండి ఒక కిరసనాయిల్ టిను

ఇంటికి తెచ్చినావు. అందులోని నూనెను వేరే ఖాళీడబ్బాకు తిరుగ బోయాలె. పోసేటపుడు క్రింది డబ్బా తొణకరాదు; పై డబ్బా తొణక రాదు. రెండూ నిశ్చలంగా వున్నపుడే పై పాత్రనుండి క్రిందిపాత్రలోకి నూనె చక్కగా చొక్కంగా చేరగల్గేది. అట్లే చెప్పేవాడూ నిశ్చల చిత్తంతో చెప్పాలె. వినేవాడూ నిశ్చలచిత్తంతో వినాలె. అప్పుడే చెప్పుటా — వినుటా సఫలమైతుంది.

ఇది ఎనిమిదవ అధ్యాయం. దీనిపేరు అక్షరపరబ్రహ్మయోగం. ఈ అధ్యాయానికి మరీ కొన్ని పేర్లు వాడుకలో ఉన్నాయి. అక్షరబ్రహ్మ యోగమని — అభ్యాసయోగమని — ధారణాయోగమని — తారకబ్రహ్మ యోగమని — మంగళమార్గయోగమని — మహాపురుషయోగమని — బ్రహ్మాక్షరనిర్దేశయోగమని — నామాంతరాలతో యీ అధ్యాయాన్ని వ్యవహరించడం కద్దు. యోగమనగా ఉపాయం; అథవా యుక్తి. అంతే కాని, చిత్తవృత్తినిరోధం యోగమని పతంజలి చెప్పిన యోగాన్ని యిక్కడ అన్వయించుకోరాదు. క్షరమనగా నశించునది. ఏ విధంగా కూడా యేది క్షరంకాదో — దేశంతో కాలంతో జ్ఞానంతో అజ్ఞానంతో యేవిధంగానూ యేది నశించదో — అది అక్షరం. దానినే పరబ్రహ్మ మంటారు. అట్టి అక్షరరూప పరబ్రహ్మాన్ని పొందే ఉపాయం యీ అధ్యాయంలో చెప్పబడింది కాబట్టి యీ అధ్యాయానికి అక్షరపరబ్రహ్మ యోగమనే పేరు సంభవించింది. మరీ కొందరి అభిప్రాయంలో — "అక్షర + పరబ్రహ్మ" అనే రెండు శబ్దాలు బ్రహ్మముయొక్క సగుణ నిర్గుణ స్వరూపాలను సూచిస్తవి. పై పెచ్చు "అక్షర" శబ్దము బ్రహ్మవాచకమగు ప్రణవమును — అనగా ఓంకారాన్ని తెల్పుతుంది. బ్రహ్మముయొక్క సగుణ నిర్గుణ స్వరూపాలనూ, ఓంకారాన్నీ గురించి యీ అధ్యాయంలో చెప్పబడింది కాబట్టి యీ అధ్యాయానికి అక్షరపర బ్రహ్మయోగమని పేరు వచ్చింది.

పరమాత్మను తెలుసుకోడం — ముక్తిని పొందడం, మానవజీవిత లక్ష్యం. మేడలు కట్టడంతో — భూములు సంపాదించడంతో — డబ్బు నార్జించడంతో — బిడ్డల కనడంతో మానవజన్మానికి గొప్పతనం లేదు. పిల్లి తనకూన కళ్లుతెరిచే లోగా యేడుమార్లు తట్టలలో బుట్టలలో

గా దెలలో గంపలలో మారుస్తుందంటారు. మాయ అనే పిల్లి, జీవుడనే కూనను మనుష్యజన్మ వచ్చేలోగా, ఎనభై మూడులక్షల తొంభై తొమ్మిది వేల తొమ్మిదివందల తొంభై తొమ్మిది గర్భగోళాలలో వేసి తీసింది. కళ్లు తెరువవలసిన జన్మ మానవజన్మ. దీనిలోనూ కళ్లు మూసుకుంటేమా "పునరపి జననం పునరపి మరణం — పునరపి జననీ జఠరే శయనం" తప్పిందికాదు. జ్ఞాననేత్రం తెరచి ముక్తిని సాధించి, నరుడు నారాయణుడై, జన్మసంసారబంధంనుండి శాశ్వతవిముక్తిని సాధిస్తాడు. అది వానికి నిత్యశాంతి. అది వానికి నిత్యవిశ్రాంతి.

ఒక నదివద్దకు పోయి నిలవండి. ఆమె ప్రవహిస్తూంది. నదీమాతకు గడియ తీరుబడిలేదు. ఒకటే ఉరుకు; ఒకటే పరుగు. "అమ్మా! నదీ మతల్లీ! ఎక్కడికి నీ అవిరామప్రయాణం?" - అని అడగండి. ఆ మహాకర్మ యోగిని ప్రక్కమాటలు యేమీ వినిపించుకోదు. ఇటు చూడదు; అటు చూడదు. తన పనే పని. తన ప్రయాణమే ప్రయాణం. ఆమె తన మౌన భాషలో మనకు సమాధానం చెప్పకనే చెప్పింది. ఆ సంజ్ఞను మనం గ్రహించవలసిందే తరువాయి. "నేను సముద్రం పోవాలె, సముద్రం చేరాలె. అదే నాకు పతి. అదే నాకు గతి. అక్కడ చేర్తేనే నాకు శాంతి - విశ్రాంతి. నది నదిగా వుండేవరకూ ప్రయాణం తప్పదు. హద్దులు పద్దులు లేని అఖండమహాసముద్రంలోచేరి తద్రూపమై పోవాలె. పరిచ్ఛిన్ననామ రూపాలను గోల్పోయినప్పుడే నాకు అఖండశాంతి; అనంత విశ్రాంతి. సముద్రంలోచేరిన తర్వాత గంగ గంగకాదు; యమున యమునకాదు; గోదావరి గోదావరికాదు; కృష్ణ కృష్ణకాదు; కావేరి కావేరికాదు; పెన్న పెన్నకాదు. ఒకే ఒక అఖండమహాసముద్రం. సముద్రానికి యెందుకు పోవాలె? ఇక్కడే వుండరాదా? అని అడుగుతారా? వినండి. సముద్రం నాకు స్వస్థానం. సముద్రంనుండే నేను వచ్చినాను. సముద్రానికే వెళ్లాలె. ఎక్కడనుండి వచ్చారో అక్కడికి వెళ్లడం, ప్రపంచంలో సహజమైన ఒక నియమం. సముద్రజలం సూర్యకిరణాలతో ఆవిరై మేఘమై వానై క్రిందబడి, నదీరూపంతో యిప్పుడు ప్రవహిస్తూంది. స్వస్థానమైన సముద్రం చేరేవరకు మధ్యలో ఆగే పనిలేదు" నది తన ఆత్మకథ వినిపించింది. గుణ పాఠం బోధించింది.

పరమాత్మను మరచి జీవుడు జననమరణాలకు గురి అయ్యాడు. తాను దేహాభిమానియై వుండేవరకు యీ నానా నామరూపపరిచ్ఛిన్న ప్రతిబంధాలు తప్పవు. అఖండపరమాత్మస్వరూప ప్రాప్తికల్గిందా — జీవుని జీవననదీప్రవాహానికి నిత్యశాంతి; నిత్యవిశ్రాంతి. స్వస్థానమై — స్వరూపమే అయిన పరమాత్మను చేరాలంటూ వాని తహతహ. నీటిలోనుంచి చేప గట్టునపడి విలవిలలాడిపోతూంది. తన స్థానమైన నీరు చేరాలంటూ దాని తాపత్రయం. అట్లే మానవప్రాణి శాంతిలేక విశ్రాంతిలేక తపించి పోతూన్నాడు. వ్యాపారంచేసి వ్యవసాయంచేసి ఉద్యోగంచేసి సద్యోగం చేసి యెక్కడా శాంతిలేదు; విశ్రాంతిలేదు. ఒకటే ఉరుకు; ఒకటే పరుగు నది సముద్రంలోచేరి సముద్రమైనట్లు, జీవుడు పరమాత్మునిలోచేరి తానూ తద్రూపమైతూన్నాడు. అదే వానికి ముఖ్యపురుషార్థం. పురుషునికి అర్థమేదో అది పురుషార్థం. పురుషుడంటే జీవాత్మ. అర్థమంటే ప్రయోజనం. నిజంగా పురుషునికి — జీవునికి ప్రయోజనం కల్గించేదేదో అదే ముఖ్యపురుషార్థం. తక్కినవి గౌణపురుషార్థాలు.

మీరు వింటూండేది అక్షరపరబ్రహ్మయోగం. అక్షరపరబ్రహ్మాన్ని ప్రాపించే ఉపాయం యిందులో చెప్పబడింది కాబట్టి యీ అధ్యాయాని కాపేరు కల్గింది.

వెనుకటి యేడవ అధ్యాయం చివరిలో భగవంతుడు అర్జునుని ఉద్దేశించి యిలా అన్నాడు.

"జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః॥"

"అర్జునా! జరామరణాలనే దుఃఖాలనుండి విముక్తిపొందేకోసం నన్నాశ్రయించి యెవరు సాధన చేస్తారో, వారు 'తత్' అని చెప్పబడే బ్రహ్మాన్నీ, సంపూర్ణమగు అధ్యాత్మాన్నీ, సమగ్రమగు కర్మనూ తెలుసుకున్నవారై తారు. పార్థా! అధిభూత అధిదైవ అధియజ్ఞాలతోకూడిన

నన్ను యెవరు ఉపాసన చేస్తూన్నారో, అట్టివారు సమాహితచిత్తవృత్తి కలవారై మృత్యుసమయంలో సైతం నన్ను మరచిపోరు."

రెండో శ్లోకానికి క్రిందివిధంగా కొందరు వ్యాఖ్యానకర్తలు అర్థం చెప్పారు. "అధిభూత అధిదైవ అధియజ్ఞాలతో కూడిన నన్ను, మరణ కాలంలోనైనా యెవరు తెలుసుకుంటూన్నారో వారు నన్నే ప్రాపిస్తారు."

దుఃఖనివృత్తి ప్రతిమానవునియొక్క పరమాశయం. మానవుడే కాదు —పశు పక్షి క్రిమికీటకాలుసైతం, దుఃఖం పోవాలని సుఖం కావాలని అభిలషిస్తాయి. దుఃఖం తన గడపే త్రొక్కరాదు; తన ప్ూరి పొలిమేరకే రారాదు; ఇంతగా మానవుడు దుఃఖాన్ని నిరసిస్తాడు. దేవాలయం వెళ్ళి దేవునికి టెంకాయకొట్టి, దుఃఖం పోవాలె పోవాలని ప్రతివాడూ కోరేవాడే కానీ, దుఃఖం కావాలని — రావాలని కోరేవాడెవడూ లేడు. ఇక్కడ భగవంతుడు చెబుతూన్నాడు. "జరామరణమోక్షాయ" ముసలితనమూ— చావూ, యీ రెండుదుఃఖాలు నివర్తించాలని ప్రతివాని కోర్కె. కోర్కె ఉండడంతోనే లాభంలేదు. దానికి అనుకూల ఆచరణమూ వుండాలె. బొంబాయి పోవాలనుకున్నావు. గుంతకల్లు జంక్షన్ వెళ్ళావు. టిక్కెట్టూ తీసుకొన్నావు. పొరబాటుతో మద్రాసు బండి నెక్కావు. పోవాలనుకున్నది బొంబాయే. టిక్కెట్టూ బొంబాయికే. అనుకున్న ప్రకారం బొంబాయి చేరలేవు. బండి మాత్రం మద్రాసుకే నిన్ను చేరవేస్తూంది. ముసలితనమూ — చావూ, యీ రెండు పరిస్థితులూ, మానవునికి నిండా దుఃఖదాయకాలు. ముసలితనమనే మాట, జన్మమాదిగాగల సంకటాలన్నిటికీ ఉపలక్షణంగా చెప్పబడింది. జన్మదుఃఖం భరింపరానిదే అయినా, అది అజ్ఞాతంగా గడచిపోయింది. పుట్టి తెలివి వచ్చిన తర్వాత, మనుష్యుని పట్టి సతాయించే దుఃఖాలు యీ రెండూ. వీటినుండి విముక్తి పొందాలని ప్రతివాని అభిలాష. అభిలాషేకాని దానికి తగిన సాధనాన్ని వాడు చేపట్టడంలేదు. మరింతా దుఃఖాన్నే వృద్ధిచేసే విపరీతమార్గాలే వాడవలంబించాడు. వాని ఉద్దేశ్యం సిద్ధించడం లేదు. కావుననే భగవంతుడు చెబుతూన్నాడు "మామాశ్రిత్య యతంతి" — అని. భగవంతుని ఆశ్రయించి సాధన చేసేవారు దుఃఖాన్ని తరిస్తారు. దుఃఖ

రూపాలైన ప్రాపంచికపదార్థాలను ఆశ్రయించినవారికి దుఃఖమేలా తప్పు తుంది! మనం మాయికపదార్థాల నాశ్రయిస్తూన్నామేకాని, మాయా పతిని ఆశ్రయించడంలేదు. కాబట్టి దుఃఖం తప్పడంలేదు. దుఃఖానికి మూలకారణమేదంటారు? అజ్ఞానమే — దేహాత్మభ్రాంతే దుఃఖానికి కారణం. అజ్ఞానం తొలగాలంటే జ్ఞానం కావాలె. జ్ఞానం కల్గిందా సమస్త దుఃఖనివృత్తి సంపూర్ణంగా తన పాటికి తాను లభిస్తుంది. కలలో కల్గే దుఃఖసంకటాలు తొలగిపోవాలంటే; పూజలతో పురస్కారాలతో మంత్రాలతో తంత్రాలతో — ససేమిరా — పోవు. మేల్కొంటే చాలు. వూడ్చుకొనిపోతాయి. అట్లే, అజ్ఞానజన్యమైన దుఃఖసముదాయం నశించాలంటే జ్ఞానంతోనే శక్యం. అన్యథా శక్యం కాదు. జన్మాలుండేవరకు జరామరణాలు నివర్తించవు. అజ్ఞానం మిగిలివుండేవరకూ జన్మబాధ తప్పదు. అజ్ఞానం పోవాలంటే జ్ఞానం కలగాలె. ఆ జ్ఞానంకోసమే అర్జునుడు శ్రీకృష్ణుని ఆశ్రయించాడు. జ్ఞానాన్ని పొందాడు. అతని దుఃఖం తొలగింది. ఆలాగే ప్రతిమానవుడూ గురుసన్నిధికి పోయి అజ్ఞాననివృత్తి చేసుకోవాలె.

జ్ఞానమంటేయేమి? ఈవిషయమే భగవంతుడు యేడవ అధ్యాయం చివరిలో సంక్షేపంగా సెలవిచ్చాడు. "బ్రహ్మమునూ అధ్యాత్మమునూ కర్మనూ, అధిభూత అధిదైవ అధియజ్ఞాలతో కూడిన భగవంతున్నీ తెలిసి, యెవరు మహాప్రయాణకాలంలో యుక్తచిత్తులై వుంటారో వారు మోక్షాన్ని పొందగల్గుతారు." ఈ ప్రసంగంలో చెప్పిన బ్రహ్మము-అధ్యాత్మము - కర్మము - అధిభూతము - అధిదైవము - అధియజ్ఞమనే మాటలకు అర్థమేమో తెలుసుకోవాలనే అపేక్ష అర్జునునికి కల్గింది. ప్రయాణకాలంలో పరమాత్ముని తెలుసుకొనే విధాన మెట్టిదో, అదీ తెలియాలనే అభిలాషకూడా ఆతన్ని ఆవరించిది. కాబట్టి తాను శ్రీకృష్ణుని అడుగుతూన్నాడు. అర్జునుని ప్రశ్నలను పురస్కరించుకొని యీ యెనిమిదవ అధ్యాయం ప్రారంభమైతూంది. సప్తమాధ్యాయంలోని చివరి రెండు శ్లోకాలు, బీజశ్లోకాలై అష్టమాధ్యాయమనే మహావృక్షాన్ని ఉద్భవింపజేశాయి.

ఇక్కడినుండి యెనిమిదవ అధ్యాయం ప్రారంభమైతూంది. అర్జును డడుగుతూన్నాడు: "పురుషోత్తమా! ఇంతవరకు నీవాడినమాటలు నాకు సరిగ్గా అర్థం కాలేదు. మరి కాస్త వివరించి చెప్పు. తత్పదవాచ్యమగు బ్రహ్మమంటే యేమి? అధ్యాత్మమంటే యేమి? కర్మమంటేయేమి? అధి భూతమని దేన్ని చెబుతారు? అధిదైవమని చెప్పబడేదెవరు?మధుసూదనా! అధియజ్ఞుడెవడు? అతడీశరీరంలో యెట్లున్నాడు? చిత్తనిగ్రహంకల్గిన మహా నీయులు ప్రయాణకాలంలో నిన్నెట్లు తెలుసుకొని ఉపాసిస్తారు?"

అర్జునుడు అడుగవలసినవి తటతట అడిగివేశాడు. మొత్తం యేడుప్రశ్నలు. కొందరు అధియజ్ఞునికి సంబంధించిన ప్రశ్నను రెండుగా విభజించి ప్రశ్నలు యెనిమిదంటారు. త్రిమతాచార్యులూ మరికొందరు వ్యాఖ్యాతలూ యేడు ప్రశ్నలనే అంగీకరించారు. ఏకొద్దిమందిమాత్రమో యెనిమిది ప్రశ్నలుగా విభజించినారు.

అర్జునుడు ప్రారంభంలోనే శ్రీకృష్ణుని "పురుషోత్తమా" అని సంబోధిస్తున్నాడు. పురుషుడనగా "పూర్ణం అనేన సర్వమితి పురుషః" అని వ్యుత్పత్తి. పురమనగా శరీరం. ఈ శరీరంలో నఖ శిఖ పర్యంతం నిండివుండేవాన్ని పురుషుడంటారు. అంతేకాని, పురుషుడంటే మగవాడని ఇచ్చటి అర్థంకాదు. జీవుడే పురుషుడు. అతడు శరీరమంతా నిండి వున్నాడు. కాబట్టే యేభాగంలో పట్టుకున్నా తెలుసుకుంటూన్నాడు. అట్టి జీవులలో శ్రేష్ఠుడు పురుషోత్తముడు. జీవుడు శరీరమనే పురంలో పూర్ణంగావుంటే, పురుషోత్తముడనబడే భగవంతుడు చరాచరవిశ్వ బ్రహ్మండమనే పురంలో నిండి నిబిడీకృతంగా వున్నాడు.

"అయ్యా! కృష్ణా! నీవు నా నొగలపై కూర్చుని గుర్రాలనుతోలే మూడున్నరమూర శరీరంమాత్రం కాదు. నీవు పురుషోత్తమునివి. ఈశ్వరునివి. సర్వజ్ఞునివి. నీకు తెలియనిదంటూ ఒక్క విషయమూలేదు. స్థూలప్రపంచాధిదేవతయగు విరాట్పురుషునికి స్థూలప్రపంచంలోని సంగ తులు మాత్రం తెలుసు. సూక్ష్మప్రపంచాభిమానదేవతయగు హిరణ్య గర్భునికి స్థూల సూక్ష్మప్రపంచాలలోని విషయాలు మాత్రం తెలుసు. అతని జ్ఞానం అంతమట్టుకే పరిమితం. స్థూల సూక్ష్మకారణప్రపంచాలకు

కూడా అధిపతివగు నీకు యావత్ప్రపంచవ్యవహారాలలో తెలియని దంటూ లేదు. కాబట్టి నీవు పురుషోత్తమునివి. సర్వజ్ఞునివి. నీ జ్ఞానం అపరిమితమైంది. నా ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగే సమర్థునివి నీవే కాబట్టి నిన్నే ప్రశ్నిస్తూన్నాను. ఉత్తమపురుషునిబోధ యెవ్వరికైనా సంతృప్తికరంగానే వుంటుందిగదా! 'తత్' పదవాచ్యమగు బ్రహ్మమనగానేమో దయచేసి చెప్పు".

బ్రహ్మనికి 'తత్' అనే పదాన్ని విశేషణంగా యిచ్చట చెప్పినారు. తత్ – అంటే – తెల్గులో అది – ఆ, అని అర్థం. అనగా దూరంగావుండే వస్తువును చూపెట్టి చెప్పేటందుకు వాడబడే పదమిది. దగ్గరిలోని వస్తువును చెప్పేటప్పుడు 'ఇది – ఈ' అని వ్యవహరిస్తాము. దూరంలోని వస్తువును చెప్పేటపుడు 'అది – ఆ' అని అంటాము. 'తత్ – బ్రహ్మ' ఆ బ్రహ్మము, అనినపుడు బ్రహ్మము యెంతదూరంలో వుందని ప్రశ్న. ఇంద్రియాలకు మనస్సుకు అందనంతటిదూరం. అజ్ఞానులకో అంతింతనరానంతటి దూరం. తెలిసినవారికి, భగవదనుగ్రహం – గుర్వనుగ్రహం కలవారికి మరింతా దగ్గర. కబీరుదాసు ఒకసూక్తి చెప్పినాడు: "కోటిజన్మకా పంథ థా క్షణమేం పహుంచా జాయ్". "గురుదేవా! నాకు నేనుగా ప్రయాణంచేస్తే, ఆ చోటికి కోటిజన్మాలకుగాని చేరలేను. నీ అనుగ్రహంతో ఒక్కక్షణంలో చేరిపోయాను." ఒకడు కలగంటూన్నాడు. కలలో ఘటసర్పమొకటి వాన్ని పట్టుకొంది. వాడు పెడబొబ్బలు పెట్టూన్నాడు. ఆ సమయంలో వానికి మందువేయాల్నా? మంత్రవేత్తకావాల్నా? ఏదీకాదు. మేల్కొల్పితే సరిపోయింది. అట్లే మానవజీవుడు అజ్ఞాననిద్రలోబడి వివిధవిచిత్రస్వప్నాలను కంటూన్నాడు. దేహం తానని జగత్తు నిజమని అసత్యము సత్యమని అనిత్యము నిత్యమని అనాత్మ ఆత్మయని – కలవరిస్తూన్నాడు. గురువు అజ్ఞాననిద్రనుండి మేల్కొల్పితే సరిపోయింది. అట్టివానికి పరబ్రహ్మం మరింతా దగ్గర. తన స్వరూపమే అయివుంది. అటుగాక, అజ్ఞాననిద్రలోనే పడివుండేవానికి పరబ్రహ్మం ఆమడలకొద్దిదూరం. ఈ అభిప్రాయంతో బ్రహ్మమునకు తచ్ఛబ్దము విశేషణంగా వాడబడింది.

"స్వామీ ! కృష్ణా ! బ్రహ్మము యింద్రియాలకు అతీతమైంది. ప్రమాణాలకు అందనిది. లౌకికవస్తువులను పంచజ్ఞానేంద్రియాలతో తెలిసికోవచ్చునుగాని, అలౌకికమైన పరబ్రహ్మాన్ని తెలుసుకొనే వీలులేదు. అది నా బుద్ధివైభవంతో — పాండిత్యప్రభావంతో అందుకునేదీ కాదు. బోధాపరంగా మాత్రమే తెలుసుకోవలసివుంటుంది. కాబట్టి దేవా! నీవు చెప్పాలె; నేను తెలుసుకోవాలె. ప్రపంచంలో — శాస్త్రాలలో బ్రహ్మ మనే మాటకు పలువిధాలైన అర్థాలున్నవి. బ్రహ్మ అంటే సృష్టికర్త చతుర్ముఖబ్రహ్మకూ అర్థమైతుంది. ప్రకృతికికూడ బ్రహ్మశబ్దం వాడ బడ్తుంది. వేదమునూ యజ్ఞమునూ బ్రహ్మమని చెప్పడంకద్దు. ప్రణవ మును — ఓంకారాన్ని సైతం బ్రహ్మమంటారు. ఈ అన్నింటికీ మించి నిర్విశేష నిరుపాధికమైన పరబ్రహ్మమునూ బ్రహ్మమంటారు. మరి నీ అభి ప్రాయంలో బ్రహ్మమనేమాటకు యేది అర్థం? సవిశేషబ్రహ్మమా? నిర్వి శేషబ్రహ్మమా? సోపాధికబ్రహ్మమా? నిరుపాధికబ్రహ్మమా? ఈ విష యాన్ని నిర్దిష్టంగా బోధించు.

అధ్యాత్మమంటే యేమి? అధి+ఆత్మ=అధ్యాత్మ. ఇచ్చట ఆత్మ అనగా దేహం. దేహానికి సంబంధించి దేహాన్ని అధికరించివుండు వస్తువు లను అధ్యాత్మములంటారు. 'అధి' అనే ఉపసర్గలో నిష్పన్నమయ్యే అర్థ మిది. అధికారి అంటే కార్యకర్తలకు సంబంధించి వారిని అధికరించి వుండేవాడు. 'అధి' అనే ఉపసర్గ వచ్చిన ప్రతిచోటా యిదే అర్థాన్ని గ్రహించాలె. అధ్యాత్మమంటే దేహమూ యింద్రియాలు మనస్సూ బుద్ధీ జీవుడూ పరమాత్మకూడా అర్థమైతుంది. మరి మీరు ఉద్దేశించిన అర్థమేమిటి? చైతన్యవిశిష్ట ఉపాధులా? కేవలచైతన్యమా?

కృష్ణా ! కర్మమనగా అర్థమమా చెప్పు. నిత్యనైమిత్తిక కామ్య నిషిద్ధ ప్రాయశ్చిత్తాది కర్మలను కొందరు కర్మలంటారు. ఆగామి సంచిత ప్రారబ్ధాలను కొందరు కర్మలంటారు. యజ్ఞ యాగ దాన ధర్మాది సత్క ర్మలను కొందరు కర్మలంటారు. సమస్త క్రియావ్యవహారాలన్నిటి — తినడం తిరగడం లేవడం కూర్చోడం, యింద్రియాలద్వారా స్వతంత్రంగా అతంత్రంగా జరిగే ప్రతిపనీ కర్మేనని కొందరంటారు. భగవంతుని సృష్టి

వ్యాపారాన్ని కర్మ అని కొందరంటారు. దీనిలో కర్మ అనేమాటకు మీ అర్థమేమో చెప్పు.

అయ్యా! అధిభూతమనగా నేమి? పంచభూతాలా? పంచ జ్ఞానేంద్రియాలకు గోచరించే పాంచభౌతికదృశ్యవర్గమా? దేహాదికములా? ఈ అన్నిటికి వేరైన మరోతత్త్వమా? వివరించి చెప్పు. స్వామీ ! కృష్ణ మూర్తీ ! అధిదైవమంటే యేమో చెప్పు? ప్రపంచములో అనేక దేవత లున్నారు. ఒక్కొక్క యింద్రియానికి ఒక్కొక్క అధిదైవమంటూవుంది. మరి వీనిలో అధిదైవమని యేది చెప్పబడ్తుంది. ఇవీగాక, అదృష్టమా హిరణ్యగర్భుడా జీవుడా — దేన్ని వుద్దేశించి అధిదైవమంటూ చెప్పావు?

అధియజ్ఞుడని అంటివే — అతడెవడు? నేను చేసే సమస్త కర్మా లకు ఫలప్రవర్తకుడు ఫలభోక్త యెవడు? మధుసూదనా ! ఆ అధియజ్ఞుడీ శరీరంలో యేలావున్నాడు? వెలుపలనున్నాడా? లోపలనున్నాడా?"

ఇచ్చట అర్జునుడు శ్రీకృష్ణున్ని "మధుసూదనా" అని సంబో ధించాడు. ఇది జన్మలగ్నంచూచి నామనక్షత్రంచూచి పెట్టిన పేరుకాదు. లాక్షణికార్థాన్నిబట్టి పెట్టిన పేరు. ఒకణ్ణి ఉపాధ్యాయుడని అంటాం. ఆ పేరు వాని తలిదండ్రులు పెట్టిన పేరు కాదు. వాని వృత్తినిబట్టి వచ్చినపేరు. అట్లే యీ చోటకూడా. మధుకైటభులనే రాక్షసులను సంహరించాడు కాబట్టి భగవంతునికి మధుసూదనుడనే పేరు సంభవించిందని పురాణాలు చెప్పే అర్థం. ఈ ఆధ్యాత్మిక ప్రసంగంలో అంతమాత్రం అర్థం చాలదు. మధువనగా తేనె, అనగా తీపివస్తువు. అన్నిటికంటె తీపి అయిన వస్తువేది? అహంకారం. దానికంటె తీపి అయిన వస్తువేలేదు. దేనికి ఆఘాతంకల్గినా మానవుడు సహిస్తాడేమో కానీ, అహంకారానికి దెబ్బతగిల్తే మాత్రం సహించడు. బెల్లంకంటె డబ్బుకంటె పెండ్లానికంటేకూడా అహంకారం మహాతీపి. దాని సంహరించేవాడు మధుసూదనుడు. భగవంతునితో తప్ప — ఆత్మజ్ఞానంతోతప్ప, అహంకారం సృష్టిలోని మరి యేవస్తువు తోనూ చావదు. అదే పరమాత్మునికి జీవాత్ముని అడ్డుతెర. అహం కారగ్రంథి వీడక జ్ఞాని కాబోడు. అహంకారావరణం తొలగక భక్తుడు కాబోడు. భాగవతంలో శ్రీకృష్ణుడు గోపికల వస్త్రాలను అపహరించాడని

వ్రాశారు. దాని అర్థమేమి? అదొక్క సాంకేతికమైన అర్థం. ఆ అంతరార్థాన్ని విచారించక కేవల బాహ్యార్థాన్నిమాత్రం చూచి ఆధునిక విమర్శకులు అశ్లీలప్రసంగమంటూ ఆక్షేపిస్తారు. గోపికలంటే జీవులు. స్త్రీలెట్లు పరతంత్రలో జీవులుకూడా పరతంత్రులే. వస్త్రమంటే అహంకారం. వస్త్రం దేహాన్ని మూసినట్లు, అహంకారం జీవుని ఆవరిస్తుంది. ఆ అహంకారం జీవుని స్వప్రయత్నంతో తొలగదు. ప్రయత్నం కూడా ఒక అహంకారమై పరిణమిస్తుంది. అనుగ్రహించి భగవంతుడే తొలగించాలె.

"కృష్ణా! నీవు మధుసూదనునివి. ఆశ్రితులకొరకు యెంతైనా కష్టాన్ని సహిస్తావు; ఏమైనా చేయగల్గుతావు. భక్తజనపాలనార్థం మధుకైటభులనే రాక్షసులనే సంహరించగలిగావు. నా సంశయాన్ని తొలగించలేవా? సమాహితచిత్తులైనవారు ప్రాణప్రయాణకాలంలో నిన్ను చేరగల్గుతారంటూ ఆనతిచ్చావు. వారు యే విధంగా నిన్ను తెలుసుకుంటారు? మరణసమయ మతిదారుణమైన క్లిష్టసమయం. ఆ సంకటసమయంలో నీ వుపాసన యెలా నిలువగల్గుతుంది? నిన్ను మరువకుండుట యెలా సంభవిస్తుంది?" ఈ యేడు ప్రశ్నలు అర్జునుని సొంత ప్రశ్నలుకాదు. అర్జునుడు విశ్వమానవకోటికి ప్రతినిధి. ఆయన నిమిత్తమాత్రంగా నిలిచి మనకు కావలసిన ప్రశ్నలనే జగద్గురుని ప్రశ్నిస్తూన్నాడు.



ప్రియమైన ఆత్మబంధువులారా!

వినండి. అర్జునుడు అడుగదలచినవి తటతట అడిగివేశాడు. ఇక భగవంతుడు సమాధానం చెప్పవలసివుంది. మొదటి ఆరుప్రశ్నలకు రెండు శ్లోకాలలో ముక్తసరిగా సమాధానంచెప్పి, చివరిదైన ప్రయాణకాలపు ప్రశ్ననుగూర్చి విస్తారంగా అధ్యాయాంతంవరకూ చెప్పుకపోయాడు. రణాంగణంలో నిలిచి అవసరమైతే ప్రాణాలను గోళ్లతో చిమ్మేటందుకు సిద్ధంగా వుండవలసిన యోధునికి అవసరమైన ప్రస్తుతసమస్యకూడా యిదే.

"ధనంజయా! బ్రహ్మమనగానేమి – అనిగదా నీ ప్రశ్న. విను. 'అక్షరం బ్రహ్మ పరమం'. పరమమైన అక్షరమే బ్రహ్మము. బ్రహ్మ మనగా పెద్దది అని అర్థం. ఎంతపెద్దది? నీవెంతచెబితే అంతకంటె పెద్దది. ఆ బ్రహ్మము అక్షరస్వరూపం. అక్షరమంటే అక్షీణము – నాశము లేని వస్తువని అర్థం. అక్షరశబ్దానికి మరొక్క అర్థంకూడా వుంది. అంతట వ్యాపించివుండు వస్తువును అక్షరమంటారు. బ్రహ్మము కేవలం అక్షరం కాదు. పరమమైన అక్షరం. కేవలం అక్షరమని చెబితే అతివ్యాప్తిదోషం సంభవిస్తుంది. కాబట్టి పరమమైన అక్షరమే బ్రహ్మమని చెప్తుచున్నాను. అతివ్యాప్తిదోషం అంటే యేమో, సదృష్టాంతంగా వివరిస్తాను విను. ఇద్దరు వ్యక్తులు పొరుగూరికి ప్రయాణమైపోతూన్నారు. వారు మార్గమధ్యంలో ఒక అడవిగుండా పోవలసివచ్చింది. నడిచి వెళ్లుతూన్నారు. శ్రమ తీర్చు కొనేకోసం వారిద్దరొక దట్టమైన చెట్టుక్రింద కూర్చున్నారు. ధార్మిక వ్యక్తులు కాబట్టి ధార్మికప్రసంగాలే ముచ్చటించుకుంటూన్నారు. 'సమానశీలే వ్యసనేషు సఖ్యం' – అంటూ ఆర్యోక్తి వుంది. శీలం కలిసినపుడే సావాసమూ కలుస్తుంది. 'ఆవు పూజనీయమైన ప్రాణి. భార తీయునికి భూమాత గోమాత వేదమాత యీ మూడూ తల్లితర్వాత తల్లులు. గోవును పూజిస్తే ముప్పదిమూడుకోట్ల దేవతలను పూజించి నంత పుణ్యం వస్తుంది. దాని అంగోపాంగాలలో దేవతలు వెలసి

వున్నారు' — అని బ్రహ్మాండంగా ప్రశంసిస్తున్నారు. చెట్టుచాటుననే వుండే అడవిమనుష్యుడొకడు ఆ మాటలను విన్నాడు. తానూ గోవును దర్శించాలనుకున్నాడు. ఎన్నడూ వాడు ఆవును చూచిందిలేదు. వారి ఎదుటికివచ్చి నమస్కరించాడు. 'స్వామీ! గోవంటే యెట్లుండునో చెప్పండి. నేనూ దానిని దర్శించి పూజించి ధన్యుణ్ని అయితాను' అని ప్రార్థించాడు. వారు ఆవు యిట్టిదని వానికి తెలిసేటట్లు నిరూపించాలె. ఆవు యెదురుగావుంటే యేతంటాలేదు. ఇదే ఆవని పట్టి చూపించవచ్చు. సమయానికి యెదుటలేదు. కాబట్టి లక్షణాలుచెప్పి యెరుకపరచాలె. 'అయ్యా! కొమ్ములు దేనికి వుండునో అదే గోవని తెలుసుకో' — అని చెప్పినారు. వాడు ఆ లక్షణాన్ని గమనికలోపెట్టుకొని వెదుకుతూ వెళ్లి నాడు. అదాటుగా ఒక గేదెగొడ్డు యెదురైంది. 'కొమ్ములుండునది గోవు'- ఈ లక్షణంబట్టి చూస్తే దానికీ కొమ్ములున్నవి. దాన్నే గోవనుకున్నాడు. సాగిలపడి నమస్కరించాడు. చూశారా! ఎంత ప్రమాదం. అతివ్యాప్తి దోషమంటే యిట్టిదే. గోవుకు చెప్పిన లక్షణం గోవునందేగాక, బర్రెగొడ్డు నందు సైతం ప్రవర్తించింది. ఏ వస్తువునుగూర్చి యే లక్షణం చెబుతారో, ఆలక్షణం ఆ వస్తువునందుతప్ప అన్యవస్తువునందు ప్రవర్తింపరాదు. ప్రవర్తిస్తే అతివ్యాప్తిదోష మంటారు. చెప్పేవాడు గోవుకు అసాధారణలక్షణం చెప్పక, సాధారణలక్షణం చెప్పినాడు. 'గంగడోలుకలది గోవు' — అని చెప్పుట అసాధారణలక్షణం. 'కొమ్ములుకలది గోవు' — అని చెప్పుట సాధారణ లక్షణం. కొమ్ములు గోవుకే కాదు; గేదెగొడ్డుకు కూడా వుంటవి. అట్లే బ్రహ్మము అక్షరమని చెపితే, అక్షరమనే మాట ప్రణవానికీ అర్థమిస్తుంది; మాయకూ అర్థమిస్తుంది, కాబట్టి ఆ అతివ్యాప్తిని నివారించేకోసం, బ్రహ్మమునకు పరమమూ — అక్షరమూ నని రెండు విశేషణాలు చెబుతూన్నాను. అక్షరమని చెప్పబడే మాయకూ, ప్రణవానికీ పరమైన — శ్రేష్ఠమైన వస్తువే బ్రహ్మం. ఆ రెండూ సోపాధికాలు, బ్రహ్మం నిరుపాధికం. ఆ రెండూ సవిశేషాలు, బ్రహ్మం నిర్విశేషం. ఆ బ్రహ్మమును తెలుసుకున్న యోగులు, జన్మజరామరణ విముక్తి నొంది నన్నే ప్రాపిస్తారు.

"అర్జునా! అధ్యాత్మమంటే యేమనికదా నీ ప్రశ్న. ఇది త్వం పదార్థవిమర్శకు సంబంధించిన విషయం. సర్వసాధారణంగా అందరూ తెలుసుకునే విషయం కాదు. అధికారియైనవాడు మాత్రమే తెలుసుకో గల్గుతాడు. తత్ పదార్థ విషయంలో పెద్ద చిక్కులేదు. శ్రద్ధవుంటే చాలు. శాస్త్రాలు చెప్పినవి – ఉపనిషత్తులు చెప్పినవి – తత్ పదార్థ బ్రహ్మ మిట్టిదని నమ్మి తెలుసుకుంటాడు. కాని త్వంపదార్థమగు జీవుని విషయం అలాకాదు. విచారశక్తి వుండాలె. అంతటి అధికారియై వున్న పుడే త్వం పదార్థశోధన చేయగల్గుతాడు.

'స్వభావోఽధ్యాత్మముచ్యతే' —— స్వభావమే అధ్యాత్మమని చెప్పబడ్తుంది. దేని స్వభావం? ఇంతకుముందు చెప్పిన బ్రహ్మముయొక్క స్వభావమే అధ్యాత్మం."

బ్రహ్మమే మన శరీరంలోపల నేను నేననే రూపంతో వుంది. అదే అధ్యాత్మం. నేననే వస్తువును ఆశ్రయించే యీ దేహం – యీ యింద్రి యాలూ – యీ ప్రాణం – యీ అంతఃకరణంవుంది. ఆ 'నేను' అనే వస్తువు యీ అన్నింటితో సంబంధించి అన్నింటికీ అతీతంగానూ వుంది. కరెంటు ఫ్యాన్‌తో చేరినపుడు ఫ్యాన్ విసిరింది. బల్‌బుతో చేరినపుడు బల్‌బు వెలిగింది. రేడియోతో చేరినపుడు రేడియో పాడింది. ఇంజన్ తో చేరినపుడు మిషన్ పని చేసింది. కరెంటులేక యే యంత్రమూ పని చేయలేదు. అట్లే 'నేను – తాను' అనే ఆత్మశక్తి కరెంటులాంటిది. దానితో సంబంధపడినపుడే, కన్నులు ముక్కులు కాళ్లు చేతులు మనో బుద్ధులు, పని చేయగల్గుతూన్నాయి. నేను కంటితో చూస్తూన్నా. నేను చెవితో వింటూన్నా. నేను ముక్కుతో మూచూస్తూన్నా. నేను కాళ్లతో నడుస్తూన్నా. నేను చేతితో యిస్తూన్నా. నేను మనస్సుతో సంకల్పిస్తూన్నా. నేను బుద్ధితో నిశ్చయిస్తూన్నా. ప్రతి యింద్రియంతో 'నేను' చేరినపుడే ఆ యింద్రియంపని చేయగల్గుతూంది. ఆ 'నేను' అనేది యెవరి సొత్తు? తల్లిదండ్రులిచ్చినారా? కంపెనీనుండి తెప్పించావా? కాదు. అది పరబ్రహ్మంయొక్క స్వభావం.

మీరింతమంది యిచ్చటున్నారు. ఒక్కమాట అడుగుతాను. కోపంరాదుగదా! సాయంకాలానికి చచ్చేటందుకు యెవరు సిద్ధమైతారు? చేతులెత్తండి. ఊహూం. ఎవ్వరికీ యిష్టంలేదు. నిత్యశాశ్వతంగా వుండి పోవాలనే ప్రతివాని యిష్టం. చావంటే యెవనికీ యిష్టంలేదు. పోనీ! ఇష్టం లేకపోతే మాత్రం చావు తప్పిందా అని. రాముడుపోయాడు; కృష్ణుడు పోయాడు; బుద్ధుడు పోయాడు; శంకరుడు పోయాడు; రామకృష్ణుడు పోయాడు; రమణమహర్షి పోయాడు; అరవిందుడు పోయాడు; గాంధీ పోయాడు; వారు ముందూ మనం వెనుకా, తప్పక పోవలసిందే. పుట్టిన వారు గిట్టేది శిలాశాసనం. అయినా మనం సమ్మతించం. దానికేమి కారణం? ఆత్మకూ చావుకూ సంబంధంలేదు. చావు దేహానికి మాత్రమే. ఆత్మ యెప్పుడూ వుండేది. కాబట్టి అది చావును ఒప్పుకోదు. ఆత్మకు నిద్రే లేనప్పుడు చావెక్కడిది? నిద్రంటే చిన్నచావు. చావంటే పెద్దనిద్ర. నిద్ర బుద్ధికేకాని ఆత్మకు లేదు. చావు దేహానికేగాని ఆత్మకుగాదు. మనం ఆత్మస్వరూపులం. మనకు మరణంయొక్క అనుభవం యెప్పుడూ లేదు. ఆ అభిప్రాయంలో యీ సత్యం వున్నా, ఆత్మయొక్క అమర ధర్మాని మానవుడు దేహంపై ఆరోపిస్తున్నాడు. వేసవికాలంలో క్రొత్తకడవ తెచ్చి దానిలో నీళ్లుపోసినావు. లోపలి నీటిచలువ కడవపైకి యెగదట్టి, పైనకూడా చల్లగా వుంటుంది. కడవకు పైగా కానవచ్చే చల్లదనం స్వయంగా కడవది కాదు. లోపలి నీటిది. అట్లే మనం దేహంపై ఆరోపించుకొనే అమరధర్మం దేహాంది కాదు, ఆత్మది. కాబట్టి ఆత్మ యెప్పుడూ వుండేది. మీ స్వరూపం ఎప్పుడూ వుండేది. ఎప్పుడూ వుండుట అంటే వేదాంతపరిభాషలో 'సత్' అంటారు. ఇదొక్క లక్షణం.

తర్వాత వెళ్లుదాం. అన్నీ తెలుసుకోవాలనే ఆసక్తి ప్రతి మానవునికీ వుంది. నలుగురు కలిసి యేమో మాట్లాడ్తున్నారు. అదేమిటో తెలిసికోవాలని వీని తహతహ. మీ పిల్లవాన్ని వెంటబెట్టుకొని బజారు వెంబడి వెళ్లినావు. వాడు కనబడిన వస్తువునంతా అదేమి యిదేమీ అని అడుగుతాడు. మూడున్నరమూర శరీరంలో అడగి మడగి పడివుండడం ఆత్మకు యిష్టం లేదు. త్రివిక్రమునిలాగా విశ్వబ్రహ్మాండాన్ని ఆలింగనం

చేసుకోవాలని, అగస్త్యుడులాగా జ్ఞానసముద్రాన్ని ఆపోశనంపట్టాలని ఆత్మయొక్క ఉత్కంఠ. పసిపిల్లవాడు రూములో పడుకొనివున్నాడు. తల్లి పని చేసుకుంటూంటుంది. పిల్లడు లేచి యేడుస్తాడు. వెలుపలికి తీసుక పొండని తల్లి చెబుతుంది. చీకట్లోవుంటే అబ్బాయి యేడుస్తాడు. వెలుతురుకు తెస్తే వానికి శాంతి; లోపల జ్ఞానప్రకాశమైన ఆత్మ వుంది. అది చీకట్లో వుండుటకు ఒప్పుకోదు. బైటకూడా తనకు సజాతీయమైన ప్రకాశమే కావాలె. ఇదీ పిల్లవాని యేడ్పులోని అర్థం. అయ్యా! నీవు మట్టిముద్దకాదు; మాంసపిండంకాదు. స్వయంగా చైతన్యమై జడవస్తువులను సైతం, చైతన్యవంతంగా ప్రకాశింపజేసే జ్ఞానజ్యోతివి నీవు. జాగ్రదవస్థలో స్థూలప్రపంచాన్ని, స్వప్నావస్థలో సూక్ష్మప్రపంచాన్ని, సుషుప్త్యవస్థలో ఆ రెంటి లేమిడిని తెలిసికొనే తేటతెలివి నీవు. నీ స్వరూపముయొక్క రెండవ లక్షణం 'చిత్'.

ఎప్పుడూ వుండాలె; అన్నీ తెలుసుకోవాలె; యింతే కాదు — సుఖంగా వుండాలె — అని ప్రతివాని ఆశయం. దుఃఖం యెవ్వనికీ పనికి రాదు. సుఖంగావుంటే — సుఖంగా యెందుకున్నావని అడగం. దుఃఖంతో వుంటే — ఏడుస్తూంటే, కారణమేమని అడుగుతాము. సుఖం మనకు స్వభావం. దుఃఖం ఆగంతుకం. ఆగంతుకం కాబట్టే యెందుకు దుఃఖిస్తున్నావని అడగడం కల్గింది. పిల్లవాడు నవ్వుతూంటే యేమీ ప్రశ్న లేదు. ఏడిస్తేమాత్రం — ఎందు కేడుస్తాడంటూ ప్రశ్న. ఏడ్వకపోతే యెందు కేడ్వలేదంటూ అడగంకదా! నీళ్లు చల్లగావుంటే ప్రశ్నే లేదు. బదరీనాథం తప్తకుండంలో వేడిగావుండే నీళ్లనుచూచి, నీళ్లు వేడిగా యెందుకున్నాయంటూ ప్రశ్నిస్తాం. నీళ్లకు చల్లదనం స్వభావం. వేడిమి విపరీత ధర్మం; ఆగంతుకంగా వచ్చిన ధర్మం. కాబట్టే యెందుకలా వున్నవంటూ ప్రశ్న యేర్పడింది. అట్లే ఆత్మకు దుఃఖం ఆగంతుకం. దుఃఖాన్ని లోపల పెట్టుకునేందుకు ఆత్మ ఒప్పుకోదు. బైటికి నెట్టి వేయాలంటూ దాని యిష్టం. సుఖంగా వుండడం ఆత్మకు సహజం; దానినే ఆనందమంటారు. ఆత్మకు ఆనందం స్వరూపం. నీవు స్వయంగా ఆనందసముద్రానివి. సినిమాల వెంటబడి సిగరెట్ల వెంటబడి హోటళ్ల వెంటబడి రేడియోల వెంటబడి ఆనందాన్ని దేబరించే పక్షివికాదు; భిక్షుగానివికాదు.

ఎప్పుడూ వుండాలనడం సత్. అన్నీ తెలుసుకోవాలనడం చిత్. సుఖాపేక్ష ఆనందం. మన అనుభవంలో సచ్చిదానందాలు జీవుని స్వభావాలుగా తేల్చుకున్నాం. ఉపనిషత్తులలో శాస్త్రాలలో బ్రహ్మము "సచ్చిదానంద స్వరూప" మని చెప్పబడింది. అనుభవరీత్యా నీ స్వరూపం కూడా సచ్చిదానందమే అని ఋజువైంది. పోల్చి చూచుకొన్నప్పుడు — బ్రహ్మముయొక్క లక్షణాలు నీలోనూ సంభవించినప్పుడు 'అహం బ్రహ్మాస్మి' అనుకోడంలో తప్పేముంది? మగవాడంటే యెట్లుంటాడని యెవడో అడిగాడట. మీసాలుంటే మగవాడని జవాబు చెప్పినారు. పట్టి చూచుకొన్నాడు. తనకూ మీసాలున్నాయి. ఇక తానూ మగవాడే. మగవాని లక్షణం తనలోవుందికదా! బ్రహ్మలక్షణాలు - సచ్చిదానందాలు తనలో గోచరించినపుడు తానే బ్రహ్మమనుటలో జంకేమిటికి? జీవుడే బ్రహ్మము. అతడు బ్రహ్మముయొక్క స్వభావం కాబట్టి 'అధ్యాత్మ' మనబడినాడు. "స్వభావోఽధ్యాత్మముచ్యతే"

"ధనంజయా! బ్రహ్మమంటే అధ్యాత్మమంటే విడివిడివస్తువులు కాదు. పేర్లమార్పేకాని వస్తుభేదంలేదు. తర్వాతి విషయం విచారిస్తాను. కర్మమంటే యేమనికదా నీ ప్రశ్న. 'భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః'. భూతమనగా పుట్టిన ప్రతియొక్కవస్తువు. చరాచరాత్మక వస్తువులన్నీ భూతాలు. వాటి భావము అనగా వాటిస్థితి, మరియూ వాటి ఉద్భవము, భూతములు పుట్టుటకు వుండుటకు కావలసిన విసర్గమే-త్యాగమే కర్మమని చెప్పబడ్తుంది. విసర్గమనుమాటకు త్యాగమని అర్థం. భూతభావ ఉద్భవకరమైన విసర్గమే కర్మ అని చెప్పబడ్తుంది. భూతముల స్థితి ఉత్పత్తికి కారణమైన త్యాగమే కర్మ."

ఈ విషయాన్ని సవిస్తరంగా వివరిస్తాను. ఇదో! ఎదురుగా ఇది ఒక టేబుల్‌వుంది. ఇదెప్పుడు సృష్టి అయిందంటారు? వడ్రంగివాడు తయారుచేసుకొనివచ్చి మీ యెదుట పెట్టిననాడు సృష్టి అయిందని మీరంటారు. అలాకాదు. నేను చెబుతాను. వినండి. ఈకన్యాకాపరమేశ్వరీదేవస్థానం అధిపతికి ఒకనాడొక వూహకల్గింది. ఉపన్యాసాలు జరిగే సమయాలలో ఉపయోగించుకొనేటందు కొక టేబుల్ వుంటే బాగుండు

నని ఆయన తలంచాడు. టేబుల్ యీ మాదిరి యీ యెత్తు యీ వెడల్పు యీ రకంగా వుండాలని ఆయన దీనిని మొదట్లో తన భావనాప్రపంచంలో సూక్ష్మరూపంతో సృష్టించుకొన్నాడు. వడ్రంగిని రమ్మని తయారు చేయించాడు. ఆ తర్వాత స్థూలరూపంతో యిప్పుడిది మన యెదుట వుంది.

ఇది దృష్టాంతం. ఇక దార్ష్టాంతం వినండి. ఆదిలో ఒకే ఒక పరమాత్మ అఖండంగా వున్నాడు. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం బ్రహ్మ — నేహనానాస్తి కించన" — అని శ్రుతి చెప్పింది. ఆ అఖండపరమాత్మకు ఒక సంకల్పం పొడమింది. 'నేను ఒక్కడుగా వున్నాను. బహురూపులు ధరిస్తాను' — అని ఆయన సంకల్పించాడు. "ఏకో౽హం బహుస్యాం" — అను దీనిని సృష్టిసంకల్పవీక్షణమంటూ శ్రుతి చెప్పింది. అంతకు ముందుకల్పంలోని జీవులు చేసిన కర్మలయొక్క సమష్టిసంస్కారమే యీశ్వరునికి సంకల్పం కల్గించింది. సంకల్పించేది అంతఃకరణం కదా! అంతఃకరణంలేక యీశ్వరుడెలా సంకల్పించాడని శంకించవచ్చు. జడవస్తువైన అంతఃకరణంకూడా పరమాత్ముని చైతన్యశక్తివల్లనే సంకల్పించ గల్గుతూంది. అంతఃకరణం సంకల్పించాలంటే పరమాత్ముని శక్తిసహాయం దానికి కావాలె. కాని పరమాత్ముడు అంతఃకరణసహాయం లేకనే సంకల్పిస్తాడు. ఆ పరమాత్ముని సమష్టిసృష్టి సంకల్పమే ప్రతివానిలోనూ జొరబడి వ్యష్టిరూపంలో భాసిస్తూంది. ప్రపంచంలో యెవ్వనికినీ తానొక్కడుగానే వుండాలను యిష్టంలేదు. బహురూపులు ధరించాలనే ప్రతివాని యిష్టం. సంసారులు బిడ్డలను కోర్తూన్నారు. సన్న్యాసులు శిష్యులను అపేక్షిస్తూన్నారు. ఆ సమష్టి సృష్టి సంకల్పమే వ్యష్టిగతంగా మనలో గోచరిస్తూంది.

సృష్టిసంకల్పంతోబాటు పరమాత్ముడు తన స్వరూపాన్ని త్యాగం చేశాడు. వి త్తనం తన స్వరూపాన్ని త్యాగంచేసి వృక్షమైతుంది. తన ఏకస్వరూపాన్ని త్యాగంచేసి ఆయన బహురూపాలు ధరించాడు. ఆ త్యాగమునే విసర్గమనినారు. ఈశ్వరుని సృష్టిసంకల్పమే ప్రపంచానికి ఆదిబీజం. ఆ సంకల్పం వుండేవరకూ యీ ప్రవాహం సాగిపోతూనే

వుంటుంది. ఈ యీశ్వరసంకల్పమే మొదటి యజ్ఞం. దీనినే కర్మ ప్రవాహమంటారు. ఈ కర్మప్రవాహానికి వెనుకతట్టు వుండే పరమాత్మ భావమే కర్మాతీతస్థితి. ఈ కర్మచక్రం మనం ఆపితే ఆగేదికాదు. మనం చేసినా చేయకున్నా యీ కర్మ — యీ జగన్నాథుని రథం సాగుతూనే వుంటుంది. మనంచేసే కర్మలన్నీ యీ మహాప్రవాహంలోని అంతర్భాగాలే. ఆ యీశ్వరుని సృష్టిసంకల్పరూపమైన కర్మే సమస్తభూతాల సృష్టికీ స్థితికీ కారణమైవుంది. కర్మ అంటే వేరుకాదు. పరమాత్ముని స్వరూపమే యిది. పరమాత్ముడే తన సంకల్పప్రభావంతో మారి కర్మ రూపంతో గోచరిస్తూన్నాడు.

ఈశ్వరసంకల్పమే మొదటి యజ్ఞమని అన్నాం. ఆ మొదటి యజ్ఞాన్ని ఆదర్శంగా పెట్టుకొని లౌకికయజ్ఞాలు బయలుదేరాయి. ఆ యజ్ఞాలలో చరుపురోడాశాలను సమర్పించుటనుకూడా విసర్గమంటారు. చరువంటే అన్నం. పురోడాశమంటే వరిపిండితో చేసిన పదార్థం. యజ్ఞంలో వ్రేల్చిన ఆహుతులు సూర్యుని చేర్తవి. సూర్యునివలన వృష్టి కల్గుతుంది. వర్షంద్వారా భూతముల సృష్టిస్థితులు సంభవిస్తవి. కావున విసర్గలక్షణమైన యజ్ఞమే కర్మమని కొందరంటారు. యజ్ఞమనునది కర్మలన్నిటికి ఉపలక్షణమని కొందరి అభిప్రాయం. ఇదొక్క అర్థం. యాగము హోమము దానము మొదలగు త్యాగములే కర్మ అనిపించుకొనునుగాని తక్కినవన్నీ 'కర్మ' అనబడుటకు వీలుగాదని కొందరంటారు. జ్ఞానాంగాలగు శ్రవణమననాదులే 'కర్మ' అని కొందరి అభిప్రాయం. మనం ప్రస్తుతప్రసంగంలో యీశ్వరుని సృష్టిసంకల్పాన్నే కర్మ అని చెప్పుకున్నాం.

బ్రహ్మమంటే యేదో, ఆధ్యాత్మమంటే యేదో కర్మ అన్నా అదే. ఇవి వేరువేరుకాదు. ఈ అఖండతత్త్వాన్ని తెలుసుకున్నవాడే జన్మ జరామరణ విముక్తిని సాధింపగల్గుతాడు.

"పార్థా! అధిభూతమనగా యేమనికదా నీవడుగుట? విను. 'అధిభూతం క్షరోభావః' — క్షరభావమనగా నశించే స్వభావం కలవి. నశించే స్వభావం కల నామరూపాలన్నిటీ అధిభూతాలంటారు. క్షరమంటే నశిం

మట; భావమంటే పుట్టుట. పుట్టి నశించే స్వభావంకలవి అధిభూతాలు. సృష్టిస్థితివినాశాలకు లోబడిన వస్తువులన్నీ అధిభూతాలు"

ఏడవ అధ్యాయంలో, పరాప్రకృతి అపరాప్రకృతి అని ప్రకృతిని రెండు రకాలుగా చెప్పినారు. పరాప్రకృతిని అధ్యాత్మమనవచ్చు. అపరా ప్రకృతిని అధిభూతమనవచ్చు. మొత్తం యీ స్థూలశరీరాలు అధిభూతాలనబడ్డవి. అధిభూతాలనబడే యీ స్థూలశరీరాలు సైతం పరమాత్మని కంటె భిన్నంకావు. విచారణద్వారా యీ విషయాన్ని నిరూపించుకొందాం.

ఈ స్థూలశరీరానికి కారణమేది? ఇది యెచ్చటినుండి ఉత్పత్తి అయింది. తల్లిదండ్రులు తిన్న అన్నమే యీ శరీరానికి కారణం. మొదట్లో యీ శరీరం అన్నరూపమై వుండింది. అప్పుడు యీ దేహాన్ని యేజాతి అని చెప్పాలె? అన్నానికి జాతి యేది? ఏజాతీలేదు. ఈ జాతులు-కులాలు తర్వాత కల్పించుకున్నవే. సరే. ఆ అన్నం యెచ్చటినుండి వచ్చింది? పృథివి నుండి. పృథివియే అన్నరూపంలో పరిణమించింది. ఆ అన్నమే శరీరరూపం ధరించింది. పృథివి యెచ్చటినుండి వచ్చింది? జలంనుండి. జలంనుండి పృథ్వి; పృథ్వినుండి అన్నం; అన్నంనుండి శరీరం. ఈ శరీరం మొట్టమొదట్లో జలరూపంగా వుండింది. ఇంకా సాగిపోదాం. ఆ జలం యెచ్చటినుండి వచ్చింది? అగ్నినుండి. 'అగ్నేరాపః' అనిగదా శ్రుతి. అగ్నినుండి జలం, జలంనుండి పృథ్వి, పృథ్వినుండి అన్నం, అన్నంద్వారా శరీరం. ఈ శరీరం మొదట్లో అగ్నిరూపంగా వుండింది. మారిమారి యీ రూపానికి వచ్చింది. అగ్నికి కారణమేది? వాయువు. వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలం, జలంనుండి పృథ్వి, పృథ్వినుండి అన్నం, అన్నంతో శరీరం. ఈ శరీరానికి మూలస్వరూపం వాయువు. వాయువునకు ఉత్పత్తిస్థానమేది? ఆకాశం. ఆకాశంనుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలం, జలం నుండి పృథ్వి, పృథ్వినుండి అన్నం, అన్నంతో శరీరం. ఈ శరీరానికి మూలస్వరూపం ఆకాశం అయింది. మరి ఆ ఆకాశానికి కారణమేది? ఆ విషయం మనకు తెలియదు. అది బుద్ధికి తెలియనిచోటు. దాన్నే మాయ అనినాము. మాయనుండి ఆకాశం కల్గింది. ఆకాశంనుండి వాయువు,

వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలం, జలంనుండి పృథ్వి, పృథ్వినుండి అన్నం, అన్నంతో శరీరం యేర్పడింది. ఈ శరీరానికి మూలం మాయ. మాయకు పరమాత్మ ఆధారం. కాబట్టి మన శరీరాలన్నిటికీ మొదట్లో పరమాత్మే కారణం. కార్యంలో కారణానికంటే అన్యవస్తువు లేదనేది ఒక నియమం. ఈ కార్యకారణ నియమాన్ని బట్టి మొదటికి విచారిస్తూ పోతే అధిభూతమని చెప్పబడే ఈ శరీరాలు పరమాత్మస్వరూపాలే. బ్రహ్మ మనినా అధ్యాత్మమనినా కర్మ అనినా అధిభూతమనినా ఒక్కే ఒక అఖండపరమాత్మే. ఈ అఖండభావం పొందినవాడు జన్మజరామరణ విముక్తినొంది భగవత్పదవి నందగల్గుతాడు.

"కిరీటీ! అధిదైవమంటే యేమనిగదా నీవడిగావు. విను. 'పురుషశ్చాధిదైవతం' హిరణ్యగర్భపురుషుడే అధిదైవతం. ఆదిత్య మండలంలో, దానికి అభిమానదేవుడొక్కడున్నాడని, అతడు సర్వదేవ మయుడనీ, అతని శక్తివిశేషాలే సర్వదేవతలనీ వైదికుల విశ్వాసం. పురుషుడే అధిదైవము. వ్యష్టి సమష్టి పురాలన్నిటిలో పూర్ణంగావుండే వాడు పురుషుడు. పురుషశబ్దం బలాన్ని-శక్తిని సూచిస్తుంది. ఆ పురుషుడే హిరణ్యగర్భుడు".

దేవతలంటే చాలకశక్తులు. వారు భగవంతునికి ప్రధానో ద్యోగులు. మనకంటికి సూర్యుడు అధిదేవత. ఆ సూర్యుడు హిరణ్య గర్భపురుషునికి ఒక యింద్రియం మాత్రం. సూర్యునిలోనిశక్తి సొంతం సూర్యునిదికాదు, హిరణ్యగర్భునిశక్తితో సూర్యుడు ప్రకాశిస్తూ న్నాడు. చెవికి అధిదేవతలు దిక్కులు. చేతికి యింద్రుడు అధిదేవత. మనకు యింద్రియాలవలె, హిరణ్యగర్భునికి యీ అధిదేవతలు యింద్రి యాలు. సర్వదేవతామయుడైన హిరణ్యగర్భుని మూలాననే సాధకుడు పరమగతిని పొందవలసి వుంటుంది. కాబట్టి ఆ అధిదైవతాన్ని పురుషు డన్నారు. ఆ హిరణ్యగర్భుడుకూడ పరమాత్మునికంటె భిన్నంకాదు. పరబ్రహ్మమే స్థూలసూక్ష్మోపాధులతోకూడి హిరణ్యగర్భుడనిపించు కున్నాడు. కాబట్టి ముందు చెప్పిన బ్రహ్మం—అధ్యాత్మం—కర్మం—అధి భూతం—అధిదైవమన్నవి ఒక్కేస్వరూపమే కాని భిన్నభిన్నంకాదు.

"దేహధారులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఇచ్చట యీ దేహమునందు అధియజ్ఞుడును నేనే."

అధియజ్ఞుడనగా యెవ్వడని అర్జునుడు ప్రశ్నించినాడు. మనం చేసే సమస్తకర్మఫలాలను అనుభవించే మహాభోక్తయెవడు? అతిథికి పట్టెడు అన్నం పెట్టావు. కుక్కకు ఒకరొట్టెముక్క వేస్తావు. దాన్ని ఆరగించి సంతృప్తి పొందేవారెవ్వరు? తిని తృప్తిపడేది శరీరమేనా? నేనొక రోజు మీ యింటికి భిక్షార్థం వచ్చినాను. పంక్తిలో అందరమూ కూర్చున్నాము. విస్తళ్లలో అన్నం సిద్ధంగా వడ్డించినారు. తీరా భోజనం చేయవలసిన సమయం. హఠాత్తుగా నేను చనిపోయాను. ఈ శరీరమిక్కడే వుంది. భుజించకూడదా? లేదు. ఈ శరీరంలోవుండి ఆహారాన్ని స్వీకరించే భోక్త యెవడు? భగవద్గీత పదునైదవాధ్యాయం పద్నాల్గవశ్లోకంలో-

"అహం వైశ్వానరో భూత్వా - ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః - పచామ్యన్నం చతుర్విధమ్ ॥

అని భగవంతుడే సెలవిచ్చినాడు. చతుర్విధభూతాలశరీరాలలో నివసించి చతుర్విధాహారాలను ఆరగించే యజ్ఞభోక్త, వైశ్వానరరూపపరమాత్ముడేనని దాని అర్థం.

అదొక్కసమయం. గోపాలకృష్ణుడు గోపబాలురతో కలసి అడవిలో గోవులను మేపుతూన్నాడు. ప్రొద్దెక్కి పోయింది. శ్రీకృష్ణునికి ఆకలివేస్తూంది. తోడిగొల్లపిల్లలతో అన్నాడు. "మిత్రులారా! అల్లదిగో అది మునిపల్లె. అందులోని బ్రాహ్మణులు యజ్ఞం చేస్తూన్నారు. హోమధూమం మిన్నుముట్టుతూంది. చూడండి. అక్కడికివెళ్లి అడగండి. శ్రీకృష్ణుడు ఆకలిగొన్నాడు. కాస్త అన్నం అడిగితెమ్మన్నాడు. పెట్టండంటూ అడగండి." గోపాలకులు వెళ్లినారు. బ్రాహ్మణులు ఆడంబరపూర్ణంగా యజ్ఞం చేస్తున్నారు. గగనం పగిలేటట్టు వేదఘోషచేస్తూన్నారు. వారు గొల్లపిల్లలు చెప్పినమాటలు విన్నారు. "పోపొండి-వల్లగాదు-వెళ్లండి. యజ్ఞవిధి పూర్తికాలేదు. నైవేద్యం పెట్టలేదు. మా భోజనం కాలేదు. గొల్లవానికి పెట్టడ మెలా వీలౌతుంది?" — నిరాకరించి పంపివేశారు. వల్లవబాలురు వుసూరని పాపం - వెనక్కు వెళ్లి

నారు. యావద్వృత్తాంతం శ్రీకృష్ణునికి నివేదించినారు. ఆయన అన్నాడు. "అరే! ఎంత వెర్రివాళ్లు. ఆకలిసంగతి అమ్మగారికి తెలుసుకాని అయ్యగారికేమి తెలుసు. ఈ పర్యాయం వెనుకదారినవెళ్లి అమ్మగారినడగండి."

శ్రీకృష్ణునికి ఆకలి. అన్నం కావాలట. ఆ మాట వినే సరికి విప్రకాంతలు తమ్ముతాము మరిచారు. పరవశలైనారు. వారికి యజ్ఞవిధితో పనిలేదు. నైవేద్యంతో పనిలేదు. తాము తినడంతో అసలేపనిలేదు. అయస్కాంతపర్వతం లాగిన సూదులలాగా, పల్లానికి ప్రవహించే నీళ్లలాగా, భర్తలు వలదన్నా, వారిపరుగే పరుగు. చేతులు కాళ్ళు కరిపించుకొని జీవం పోసుకొని మూర్తీభవించిన, యజ్ఞేశ్వరుడు - యజ్ఞ ఫలభోక్త స్వయంగా వారి ఆహారాన్ని ఆరగించాడు. సంతృప్తుడైనాడు. సిద్ధి యెదురుగావుంటే దాన్ని నిరసించి సాధనలలోనే పడి అఘోరించే మూఢత్వం వారికిలేదు. వారి యజ్ఞం వెయ్యిరెట్లు పండిపోయింది.

"విప్రాః పశ్చిమబుద్ధయః" - ఉర్వీసురులకు పెడతలనుండు బుద్ధి—అన్నమాటను బ్రాహ్మణులు సార్థకం చేసుకొన్నారు. తాము చేసిన పనికి తర్వాత పశ్చాత్తాపం చెందినారు. చేతులు కాలినాక ఆకులకు తడుముకున్నారు. "కటకట మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధిలే"దని చెంపలు వేసుకున్నారు. ఏం లాభం? యజ్ఞాలేమో చేస్తూన్నారు. యజ్ఞ ఫలభోక్త యెవ్వడనే జ్ఞానం వారికిలేదు.

మనం చేసే క్రియలు కర్మలు — అన్నిటిభోక్త ఆ పరమాత్మే. కంటితో రూపాన్ని అనుభవించేదెవరు? చెవితో శబ్దాన్ని వినేదెవరు? నాలుకతో రుచిని ఆస్వాదించే వారెవరు? 'భోక్తాదేవో మహేశ్వరః' మహాభోక్త మహేశ్వరుడు. కావుననే శ్రీ శంకరాచార్యులవారు అననే అన్నారు. "యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్"— ప్రభూ! నా యింద్రియాలే పుష్పాలు. నేను చేసే ప్రతిపనీ నీ పూజే.

శ్రీకృష్ణుడే అధియజ్ఞుడు. అధియజ్ఞుడు యెవ్వడనే మాటకు సమాధానం వచ్చింది. కాని అతడెట్లున్నాడను ప్రశ్నకు ఉత్తరం కావాలె. అధియజ్ఞుడు యీ దేహంలో యిచ్చట వున్నాడంటూ శ్లోకంలో చెప్ప

బడిందే కాని 'అధియజ్ఞోఽహమేవాత్ర దేహే'—యింతకు మించిన వివరం లేదు. భాష్యకారులు - వ్యాఖ్యానకర్తలూ ఒక సమన్వయమైన అర్థాన్ని వ్యక్తం చేసినారు.

"దేహధారులలో శ్రేష్ఠుడవైన అర్జునా! అధియజ్ఞుడను నేనే. ఈ దేహంలో అతడు అంతర్యామియై వున్నాడు." అధియజ్ఞుడు దేహమందంతర్యామియై వుండి — సమస్త కర్మఫలవిధాతయై కర్మఫల మహాభోక్తగానూ వున్నాడు. ఈ అధియజ్ఞుడుకూడా పైన చెప్పిన బ్రహ్మంకంటె భిన్నంకాదు. బ్రహ్మమని అధ్యాత్మమని కర్మ అని అధిభూతమని అధిదైవమని యేది చెప్పబడిందో — అదే అధియజ్ఞంకూడా. ఈ అఖండతత్త్వాన్ని తెలుసుకున్నవాడు జన్మజరామరణాలనుండి విముక్తి నొంది బ్రహ్మభావం పొందగల్గుతాడు.

'అధియజ్ఞుడను నేనే' — అని వ్రాదిచెప్పడంలో, "ముందు చెప్పిన బ్రహ్మము — అధ్యాత్మము — కర్మము — అధిభూతము — అధిదైవము మాత్రమేగాక, యీ అధియజ్ఞుడుకూడా నేనే" అనే ఆంతర్యభావం అఖండభావం గోచరిస్తూంది. దేహధారులలో శ్రేష్ఠుడా అని అర్జునుని సంబోధించుటలోకూడా ఒక స్వారస్యం వుంది. అధియజ్ఞుడు శ్రీకృష్ణుడే కాబట్టి, 'దేహధారిననుకొను నీ స్వరూపం నా స్వరూపమే సుమా' అని శ్రీకృష్ణుడు అర్జునునికి అద్వైతబోధ చేసినాడు. ఈజ్ఞానాన్ని పొందుటే దేహమును ధరించినందుకు ఫలమన్నమాట. అంతేకాని ధనం సంపాదించుట — యుద్ధాలలో గెల్చుట — పేరు ప్రతిష్ఠలు సంపాదించడంతో దేహధారులలో శ్రేష్ఠుడు కాలేడు. ఈ అర్థం ఆ సంబోధనలో వ్యక్తమైతూంది.

అర్జును డడిగిన యేడు ప్రశ్నలలో భగవంతుడు ఆరు ప్రశ్నలకు ముక్తసరిగా సమాధానం చెప్పివేశాడు. ఇక మిగిలింది యేడవప్రశ్న. ఇది చివరిప్రశ్న. మరణసంబంధమైన ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానంగా భగవంతుడు మొత్తం మొత్తం అధ్యాయం చెబుతూన్నాడు. అర్జునునికి కావలసిన ప్రస్తుతసమస్యకూడా యిదే.

ప్రియమైన ఆత్మబంధువులారా!

భగవద్గీతలోని యెనిమిదవ అధ్యాయం ముఖ్యంగా మరణవిద్యను గురించి బోధిస్తుంది. మానవునికి అన్నీ తెలుసు-కాని ఏ విధంగా మరణించాలో మాత్రం తెలియదు. మనుష్యుడై పుట్టి, కుక్కవలె నక్కవలె మరణిస్తూన్నాడు. మానవయోగ్యమైన మరణాన్ని వాడు పొందడంలేదు. నిజానికి మనుష్యుడు యెట్లా బ్రతకాలో కాదు నేర్చుకోవలసింది. ఎట్లా చావాలో నేర్చుకోవాలె. పుట్టినవాడు యేలాగో ఓలాగు బ్రతుకనే బ్రతుకుతాడు. ఆయుస్సే అన్నం పెడ్తుంది. ప్రారబ్ధమే దేహాన్ని పోషిస్తుంది. కాని మానవుడు ప్రయత్నించి బంగారువంటి మరణాన్ని తాను మలచుకోవాలె. పశుపక్ష్యాదులవలె మాటిమాటికి సిగ్గుబిడియంలేక పుట్టూ పుట్టూ చస్తూ చస్తూవుండే దుర్గతి-దురవస్థ మానవునికి శోభాకరం కాదు. మరణం కట్టకడ మరణం కావాలె; చిట్టచివరి మరణం కావాలె. మనుష్యుడు పుట్టేటపుడు యేడుస్తూ పుట్టాడు; కాని చచ్చేటప్పుడు యేడుస్తూ చావరాదు. మానవజీవి 'కోఽహం కోఽహం' అంటూ జన్మించాడు. 'సోఽహం సోఽహం' అంటూ మరణించాలె. అదే వానికి బంగారువంటి మరణం.

మానవుడు యెందుకు పుట్టాడు? మళ్ళీపుట్టకుండా వుండేకోసం. మానవుడు యెందుకు చస్తాడు? మళ్ళీ చావకుండా వుండేకోసం. మాటిమాటికి పుట్టూ పుట్టూ చస్తూ చస్తూండడం మానవజన్మాన్ని దురుపయోగం చేసినట్లు. మరణవిద్యను పురస్కరించుకొని కఠోపనిషత్తు బయలుదేరింది. మరణవిచారంతో సిద్ధార్థుడు బుద్ధుడైనాడు. మరణసమస్యే రమణమహర్షిని సృష్టించింది. మరణమొక వరప్రదానంవంటిదని మత కర్తలందరూ అన్నారు.

రామబాణంతో వాలికి ప్రాణోత్క్రమణం జరుగబోతూంది. ఎదుటికి వచ్చిన శ్రీరామచంద్రుని చూచి వాలి మరణవేదనతో నోరారా తూలనాడ్తూన్నాడు. రామమూర్తి అన్నాడు: "వాలీ! ఎందు కాక్రోశిస్తావ్? కావలసి వస్తే కోరుకో. నీకు జీవితప్రదానం చేస్తాను. బ్రతికిస్తాను.

బ్రతుకుదువుకాని మరికొన్నాళ్లు". శ్రీరామచంద్రుని ముఖాముఖి సంద ర్శనంతో వాలికి అజ్ఞానావరణం తొలగింది. జ్ఞాననేత్రం వికసించింది. గుక్కత్రిప్పుకొన్నాడు. "ప్రభూ! అజ్ఞానిని. క్షమించు. తెలివి కల్గింది. నాకు జీవితంతో పనిలేదు. ఎన్నాళ్లు జీవించినా, యేదో ఒకరోజు మరణిం చడం తప్పదు గదా! ఈనాటి మరణం నాపాలికి బంగారువంటి మరణం. ప్రాణపతివైన నిన్ను దర్శిస్తూ, ప్రాణం వదిలే సౌభాగ్యవంతమైన యీ మరణమే నాకు చాలు. మీదట మరణమంటూ వుంటుంది, కాని ఆ మరణంతోపాటు నీ దర్శనమంటూవుండదు. స్వామీ! దౌర్భాగ్యమైన ఆ మరణం నాకు పనిలేదు."

మరణమంటే ఏమి? ఈ శరీరంతో అనుభవించవలసిన కర్మముగిసి, మరోశరీరంతో అనుభవించవలసిన కర్మ యింకా వుత్పన్నం కానటువంటి సంధిసమయం. ఆ సంధిసమయమే భగవంతుని స్మరించేటందుకు యోగ్య మైన సమయం. అట్టిదానినే సంధ్యావందనమంటారు. సంధిలో వందనం చేయుట సంధ్యావందనం.

"అంతకాలే చ మామేవ - స్మరన్ముక్త్వా కళేబరం।
యః ప్రయాతి స మద్భావం - యాతి నాస్త్యత్ర సంశయః॥"

"సవ్యసాచీ! అంత్యకాలంలోకూడా నన్నే స్మరిస్తూ శరీరాన్నివదలి యెవ్వడు ప్రయాణం చేస్తూన్నాడో, వాడు నా భావాన్ని పొందుతూ న్నాడు. ఈ విషయంలో సందేహంలేదు."

ప్రయాణకాలం విషయం అర్జునుడడిగాడు. భగవంతుడు అంత్య కాలవిషయాన్ని చెబుతూన్నాడు. యుద్ధరంగంలో వచ్చి నిలిచినవానికి, యే క్షణంలో మృత్యువు గల్గుతుందో చెప్పలేమ్. ఏక్షణానికి ఆక్షణమే అంత్యకాలం. అర్జునుని మాటేకాదు, ప్రతిమనుష్యునికీ యిది సంబంధించే మాటే. నశ్వరశరీరానికి ప్రతిక్షణమూ అంత్యకాలమే. 'అంత్యకాలంలో కూడా' — అన్న భగవంతుని మాటలో ఒక అర్థం వుంది. మరణం జీవి తానికి ప్రభావోపేతమైన ఘట్టం. ఆ సమయంలో యెట్టిభావముంటుందో, తర్వాతిజన్మ - తర్వాతి పరిస్థితి దాని కనుకూలంగా వుంటుంది. ఫోటో గ్రాపరు ఒకటి రెండు మూడు అని నిలిపేసరికి నీవేపోజులో వుంటావో,

ఆ రూపంలో ఫోటో యేర్పడుతుంది. మనయిప్పటి సాధనలూ - ప్రయత్నా లన్నీ మరణకాలాన్ని సంస్కరించ గల్గినవిగా వుండాలె.

నీవొక చిలుకను సాకినావు. అల్లారుముద్దుగా దాన్ని పెంచు తూన్నావు. పాలుత్రాపుతావు. పండుపెట్తావు. దానికి 'రామ-రామ' అని పల్కడి నేర్పినావు. అది అడపా దడపా చీటికి మాటికి యెవ్వరు వచ్చినా, యెవ్వరు పోయినా 'రామ రామ' అంటుంది. బాగుంది. కాని పిల్లివచ్చి తోకపట్టినపుడుమాత్రం 'రామ రామ' అనదు. కీచు కీచు మంటుంది. 'రామ – రామ' స్మరణ యేదేశానికి పోయిందో తెలియదు. మీ పిల్ల వానికి 'నారాయణ – నారాయణ' అనడం నేర్పినావు. వాడు యెల్ల ప్పుడూ 'నారాయణ – నారాయణ' అని పల్కుతూనే వుంటాడు. కాని రాయి త్రొల్లుకొని క్రిందపడినపుడు మాత్రం 'అమ్మా' అనివేస్తాడు. నారాయణ స్మరణ యెక్కడ వెళ్లిందో తెలియదు. మన విద్యలూ అంతే. కమ్మగతిని చల్లగవున్నంతకూ అన్ని కబుర్లూ చెబుతాం. మృత్యువు రానక్కరలేదు – చావుపేరు చెప్పితేచాలు – భక్తిలేదు – వేదాంతం లేదు. ఇవన్నీ 'శీఘ్రబుద్ధిః పలాయనం' – యెక్కడికి పలాయనం చిత్తగిస్తవో తెలియదు. భీష్ముడు అంపశయ్యపై పరుండి శాంతిని బోధించాడు. శాంతిపర్వం బోధించాడు. పండుకొన్నది శరతల్పం మీద - బోధించింది శాంతిపర్వం. సెభాష్ - ఆయనకే చెల్లింది. కాబట్టే ఇక్కడ భగవంతుడు అంత్యకాలాన్ని జ్ఞాపకంచేసి మనలను హెచ్చరిస్తూన్నాడు.

ఈ అధ్యాయం ఉపాసనాప్రధానమైన అధ్యాయం. ఉపాసన సోపాధికబ్రహ్మమునందే – సగుణబ్రహ్మమునందే సంభవిస్తుంది. అంత్య కాలంలో భగవద్భావనను అపేక్షించువారు ఉపాసకులేగాని జ్ఞానులు కాదు. జ్ఞానులకు జ్ఞానం కల్గినపుడే అజ్ఞానం నివర్తించి ముక్తి సిద్ధించింది. వారికి అంత్యభావనాపేక్ష లేదు; జ్ఞానులకు ప్రయాణమూలేదు. దేహం వదలిన తర్వాత ముక్తి అనే మాటాలేదు. దేహంతో వున్నప్పుడూ వారు ముక్తులే. అంత్యకాలంలో భగవద్భావనను అపేక్షించి సాధనచేసే ఉపాసకులు, దేహంవదలి ప్రయాణంచేసి శుక్లమార్గం గుండా బ్రహ్మ లోకంచేరి అచ్చట బ్రహ్మదేవునిద్వారా జ్ఞానంపొంది పరమాత్మప్రాప్తి

పొందగల్గుతారు. వీరు జీవితకాలంలో నిత్యనిరంతరం సోపాధికబ్రహ్మాన్ని — సగుణబ్రహ్మాన్ని — ప్రణవస్వరూప పరమాత్మను ఉపాసిస్తూ, ఆ భావ నను అంత్యకాలంలో సైతం పొందగల్గుతారు.

ప్రయాణకాలమంటే యెప్పుడో కాదు. ఎప్పటికప్పుడే ప్రయాణ కాలం. మనుష్యుడు పుట్టినప్పటినుండీ, మృత్యువు దగ్గరకు ప్రయాణం చేస్తూనే వున్నాడు. నీవు బెంగుళూరు వెళ్లాలని అనంతపురంచేరి రైలు యెక్కినావు. ఫస్టుక్లాసు టిక్కెట్టు తీసుకున్నావు. హాయిగా విశ్రాంతిగా వుంది. కొంతసేపు పత్రిక చదివావు. కొంతసేపు సిగరెట్టు త్రాగావు. కొంతసేపు నిద్రపోయావు. కొంతసేపు చీట్లపేక ఆడినావు. నీవు యేమి చేసుకుంటూన్నా, బండి త్రూగా క్షణక్షణం బెంగుళూరు దగ్గరికి చేరవేస్తూంది. మనకు దానిపై నిగాలేదు. మనం ఆయుస్సనే టిక్కెట్టు తీసుకొని జన్మానికి వచ్చాము. ఆటలు ఆడ్తూన్నాం. పాటలు పాడ్తూన్నాం. పెండ్లిండ్లు చేసుకొంటూన్నాం. బిడ్డలు కంటూన్నాం. డబ్బు సంపా దిస్తూన్నాం. బండి హోరాహోరి సరాసరి స్మశానానికి చేరబోతూంది. మనకా ధోరణేలేదు. ప్రత్యేక క్షణమూ ప్రయాణకాలమే. ప్రయాణ కాలమేకాదు; ప్రత్యేకక్షణమూ అంత్యకాలమే. ఈ ఆక్సిడెంట్ల యుగంలో యీ హెచ్చరిక మరింతా ముఖ్యం. బస్సుల అపఘాతాలు-రైళ్ల అప ఘాతాలు- విమానాల అపఘాతాలు, ప్రపంచాన్ని కలవరపరుస్తూన్నవి. ఆటంబాంబుల హైడ్రోజన్ బాంబుల యీ యుగంలో సామూహిక మృత్యువు యే క్షణంలో విరిగిపడ్తుందో వూహింపలేం. ఇది ప్రయాణ కాలం — ఇకముందెప్పుడో అంత్యకాలం వస్తుందని వాయిదావేసుకుని మోసపోరాదు. ఆ సూచనకోసం ప్రయాణకాలమే అంత్యకాలమని చెప్పబడింది.

అంత్యకాలంలో నన్నే స్మరించుమంటూ భగవంతు డాదే శించాడు. ఏదో ఒకటి స్మరించడం మనుష్యుని స్వభావం. ఆ స్మరణలు నిన్ను ఉద్ధరించలేవు. "న హి న హి రక్షతి డుకృఞ్ కరణే". ఒకా యన తీరాచనిపోయేసమయం. చుట్టాలు పక్కాలు ఆలూ బిడ్డలు అతని చుట్టూమూగి "అయ్యో! తండ్రీ! వెళ్లిపోతూన్నావే! ఇక మాగతేమి?

మాగతేమి?" అంటూ విలపిస్తూన్నారు. ఆ బుద్ధిమంతుడన్నాడట; "నేను సంపాదించిన ఆస్తులు పాస్తులు మొత్తం మీకే దిగవిడిచి పోతూన్నా. నేనొక్కటీ తీసుకపోడం లేదు. నాకొక్కరూ తోడురాడం లేదు. నాగతి చెప్పండి" — అని. ఆ మాటకు వారు వూరకై పోయినారు. పెండ్లాము బిడ్డలు ఇండ్లు వాకిండ్లు ఆస్తులు పాస్తులు నిన్ను కాపాడలేవు. ఆ అన్య స్మరణలు మానుకొని భగవంతుడైన నన్నే స్మరించమన్నాడు. నన్నంటే లీలామానుషవిగ్రహుడైన శ్రీకృష్ణుని అయినా, సర్వజ్ఞ సర్వేశ్వర సగుణ పరమాత్మనైనా, అహంపద లక్ష్యార్థమైన ప్రత్యగభిన్న పర బ్రహ్మమునైనా, యేవిధంగానైనా అనుకోండి.

మహాప్రయాణకాలంలో పరమాత్ముని స్మరణ లభించాలంటే — ఆత్మచింతన సంభవించాలంటే రెండు ప్రతిబంధాలుండరాదు. లోపల ప్రాపంచిక వస్తుస్మరణ వుండరాదు. వెలుపల ఆలుబిడ్డల చుట్టాల పక్కాల యేడ్పులు పెడబొబ్బ లుండరాదు. చస్తే యేడ్వాలనే ఆచారాన్ని మనవాళ్లు పెట్టుకున్నారు. ఇది యే శాస్త్రంలో వుందో కాని నాకుమాత్రం అగమ్యగోచరం. వేదాంతం పుట్టిన మనదేశానికి యిదొక్క అవమానం. అపచారం. మార్వాడీ దేశంలో చచ్చినవాళ్లదగ్గర యేడ్చే కూలీల ముఠాలున్నవి. పెండ్లికి మేళగాండ్రను వచ్చినట్లు ఇంట్లో యెవరైనా చస్తే యీ ముఠా హాజరైతుంది. వారు పడిపడి యేడ్చి యేడ్చి పని ముగుస్తూనే కూలీ తీసుకొని కళ్లుతుడుచుకుని చక్కా వెళ్లిపోతారు. భగవంతుడు చెబుతూన్నాడు:

"అర్జునా! అంత్యకాలంలోకూడా నన్నే స్మరిస్తూ, శరీరాన్ని వదలి యెవడు ప్రయాణంచేస్తాడో వాడు నా స్వరూపాన్ని పొందగల్గుతాడు."

వదలవలసింది శరీరం. గ్రహించవలసింది పరమాత్మస్వరూపం. దేన్ని దేన్ని వదలుతున్నామో, అది అది మన స్వరూపంకాదు. మన స్వరూపాన్ని మనం వదలిపెట్టడమంటూ వుండదు. శరీరము వదలిపెట్ట వలసిందని భగవంతుడు చెప్పడంతో అది నీ స్వరూపం కాదని చెప్పినట్లే అయింది. భగవంతుడు నీ స్వరూపమే కాబట్టి ఆయన్ను పొందడం

జరుగుతూవుంది. భగవద్భావం పొందుట అంటే భగవంతున్ని అపరోక్షంగా తెలుసుకొనుట అని అర్థం. శరీరాన్ని వదలిపోవుట ప్రయాణం చేయుటవంటిదని స్వామి చెప్పినాడు. ఈ యింటినుండి ఆ యింటికి పోయినట్లు, యీ వూరినుండి ఆవూరికి పోయినట్లు జీవుడు యీ శరీరాన్ని వదలి ప్రయాణం చేస్తూన్నాడు. ఈ శ్లోకంలో భగవంతుడు 'ప్రయాతి' అనే పదాన్ని ప్రయోగించినాడు. 'యాతి' అనినా 'ప్రయాతి' అనినా ఒకటే అర్థం. కానీ 'ప్రయాతి' అని 'ప్ర' అనే ఉపసర్గను యెక్కువగా యిక్కడ వాడినారు. దీని స్వారస్యమేమి? తక్కిన ప్రయాణాలలో తిరిగి రావడమంటూ వుంటుంది. భగవంతుని స్మరిస్తూ ప్రయాణంచేస్తే తిరిగి రావలసిన పని వుండదు. ఈ స్వారస్యమే ఆ పదంలో సూచింపబడింది. భగవంతుడు యీ శ్లోకంలో "యః ప్రయాతి" — అంటూ యచ్ఛబ్ద ప్రయోగంచేసి భగవత్ ప్రాప్తికి జాతి మత కుల లింగభేదాలతో పని లేదంటూ సూచించాడు. మనుష్యుడై తేసరి — అర్హత ఒకటే కావలసింది — ప్రతివాడూ భగవత్ప్రాప్తి నొందవచ్చునంటూ ఫలితార్థం. 'ప్రయాతి' — ప్రయాణం చేస్తాడనేమాట ఉపాసకునికి చెల్లుతుంది కాని జ్ఞానికి చెల్లదు. జ్ఞాని యెక్కడా పోవలసిన పనిలేదు. 'అత్ర బ్రహ్మ సమశ్నుతే' — అతడు వున్నచోటే ముక్తిని బొందుతాడు. ఉపాసకుడు పొందేది క్రమముక్తి కాబట్టి, అతనికి ప్రయాణమంటూవుంది. అయితే జ్ఞానిపరంలో యీ మాటను యెలా అన్వయించుకోవాలె? ప్రయాణం చేస్తాడనే మాట లోకదృష్టి ననుసరించి చెప్పినమాట. జ్ఞానిదృష్టిలో చెప్పిన మాట కాదు.

"అయ్యా! అర్జునా! మరణకాలంలో ఈశ్వరచింతన చేసినవాడు భగవత్స్వరూపం పొందునో పొందడో అనే సంశయంతో పని లేదు. సంశయగ్రస్తుడు చెడిపోతాడు. కాబట్టి నామాటలో సంశయం పెట్టుకోవద్దు" అంటూ భగవంతుడు వూది చెప్పినాడు. శాస్త్రవాక్యాలలో — భగవద్వాక్యాలలో సంశయం పనికిరాదు. ఆంధ్రప్రభ — ఆంధ్రపత్రిక అంటే మనకు పరమప్రమాణం. పత్రిక యీ రోజు న్యూస్ పేపరు. రేపు వేస్టుపేపరు. అది మనపాలికి సత్యం సత్యం పునస్సత్యం భగవంతుని మాటలపై విశ్వాసం కల్గదు. ఎంతెంత దౌర్భాగ్యం!

"కుంతీకుమారా! ఉపాసకుడు అంత్యకాలంలో పరమాత్మను స్మరిస్తూ పరమాత్మస్వరూపాన్ని పొందిపోతాడు. ఈ నియమం ఒక్క భగవంతుని విషయంలోనేకాదు. సర్వత్రా అన్వయిస్తుంది. మనుష్యుడు జీవితంయొక్క చివరిక్షణంలో దేన్ని స్మరిస్తూ ప్రాణాలను వదల్తాడో, వాడా స్వరూపాన్ని పొందిపోతాడు."

భ్రమరం కీటకాన్ని తెచ్చి మట్టిగూటిలో పెడ్తుంది. గూటిచుట్టూ తిరిగి ఝుంకారం చేస్తుంది. ఆ గూటికి సన్నని ద్వారంమాత్రముంటుంది. లోపలి పురుగును భ్రమరం తన ముక్కుతో ఆ ద్వారంగుండా పొడుస్తుంది. మళ్లీ ఝుంకారం చేస్తుంది. అడపా దడపా యిలా చేస్తూపోతే భయయోగంతో కీటకం భ్రమరరూపంగా మారిపోతుందని ప్రతీతి. ఆలాగానే మనుష్యుడు దేన్నిదేన్ని నిరంతరభావన చేస్తాడో ఆ భావనా దార్ఢ్యంతో వాడు ధ్యేయవస్తుస్వరూపాన్ని పొందిపోతాడు. భ్రమరకీటకన్యాయపద్ధతిలో కీటకం జీవించివుండగానే ధ్యేయవస్తుసారూప్యస్థితిని పొందిందంటే దేహం వదలిన తర్వాత మానవుడు పొందుననుటలో సందేహించపనిలేదు. మహాదేవుని స్మరిస్తూ స్మరిస్తూ నందికేశ్వరుడు ఆ జన్మలోనే శివుని సారూప్యస్థితిని పొందినాడని శివపురాణం చెబుతుంది. భరతుడు మరణకాలంలో జింకను స్మరిస్తూ మరుజన్మలో జింకే అయి పుట్టినాడు. జాగ్రత్త. చచ్చేటపుడు 'డబ్బు డబ్బు' అని స్మరణచేస్తూ చస్తే యినుపపెట్టెలై పుడ్తారు. 'మతి యెంతో గతి అంత'. మరణకాలంలో యెట్టిభావన వుంటుందో దానికి తగిన సిద్ధి లభిస్తుంది. 'అంతే మతిస్సా గతిః'. జీవితకాలంలో అంతఃకరణవృత్తి మార్తూండుటబట్టి స్మరణకూడా మారిమారి పోతూంటుంది. మరణకాలంలో దేహవియోగం సంభవించేటపుడు వృత్తి స్తంభిస్తుంది. ఆ సమయంలో స్మరణకూడా స్థిరమై తనకు అనుకూలమైన తర్వాతిజన్మాన్ని యిచ్చేందుకు సమర్థమైతుంది.

కన్నడభాషలో ఒక కథవుంది. ఒక ధనవంతుడు తీరామరణిస్తూన్నాడు. ఇంద్రియాలు విహ్వలాలై పోయాయి. నోటమాట సరిగా రాలేదు. 'కకక' అంటూ కలవరిస్తూన్నాడు. అదేమిటో! ఏమి చెబు

తూన్నాడో! తెలుసుకోవాలంటూ కుమాళ్లకు యోచనకల్గింది. డాక్టర్లతో యింజెక్షన్‌లు యిప్పించారు. ఆ ఒక్కమాటా కూడా మాట్లాడి మరుక్షణం చచ్చినాసరే. అదెంత విలువైనమాటోనని వారి తహతహ. మందుమహిమతో శక్తి పులకరించింది. "కరు కసబరి కెయన్ను కడియుత్తదే"— అని వాడు అన్నాడు. 'కకక' అన్నందుకు అది అంతరార్థం. దూడ చీపురును కొరుకుతూంది అని అర్థం. వానికి యెదురుగా ఆవు దూడ మొద్దు చీపురుకట్టను నమిలివేస్తూంది. అర్ధణా చీపురు (పరకకట్ట) పాడైపోతూందే అని ఆ చచ్చేవానికి తాపత్రయం. ఒట్టుమొత్తం వదలిపెట్టిపోతూన్నా మనుష్యునికి చీపురుకట్టపై భ్రాంతి. ఒక బ్రాహ్మణ సంన్యాసి అంత్యకాలంలో చెప్పులను స్మరిస్తూ రోహిదాసు అనే చండాలభక్తుడై జన్మించాడని కథ చెబుతుంది.

మనుష్యుడు పుట్టేటపుడు ఒకడూపుట్టాడు. చచ్చేటపుడు ఒకడూ చస్తాడు. తనవెంట ఒక చీపురుపుల్ల తేలేదు. తనవెంట ఒక చీపురుపుల్ల తీసుకపోలేదు. మొత్తం మొత్తం దిగవిడిచి పోవలసిందే. వస్తువును తానైనా వదలిపెట్టి పోవాలె. వస్తువు తననైనా వదలిపెట్టి పోతుంది. ఈ నియమంపై యెగ్రగీతగీసేవాడింతవరకు పుట్టలేదు. మనస్ఫూర్తిగా వదలక పోతే ప్రకృతి బలవంతంగా వదిలిస్తుంది. ఏడుస్తూ అయినా వదలవలసిందే. నవ్వుతూ అయినా వదలవలసిందే. ప్రకృతియొక్క ఉక్కుపిడికిలితో మొట్టికాయలు తినకముందే వివేకి వదలి కూర్చుంటాడు.

అలెగ్జాండరు చక్రవర్తి దండయాత్రలపై దండయాత్రలు చేస్తూ తనివిలేకుండా దేశదేశాలను కొల్లగొడ్తూన్నాడు. ఇల్లువాకిలి ఆలుబిడ్డల చింతలేకుండా ఒకటేరంధిలో పడిపోయిన రాజుతో సేనలు వేగించలేక పోయాయి. వారు తిరుగుబాటు చేసినారు. విధిలేక చక్రవర్తి వెనుకకు — స్వదేశానికి ప్రయాణం సాగించినాడు. స్వదేశం చేరకముందే మార్గమధ్యంలోనే ఆయనకు మరణం తటస్థించింది. మహారాజు మరణించబోతూన్నాము. బ్రహ్మాండమైన మిల్‌టరీ చుట్టూవుంది. కాని లాభం లేదు. ఈ మిల్‌టరీ బ్రతికినవాళ్లను చంపే మిల్‌టరే కానీ చచ్చేవాళ్లను బ్రతికించేదికాదు. తీరా అవసానకాలంలో మంత్రులను పిలిచి చక్రవర్తి

అన్నాడు: "మరణానంతరం యీ శరీరాన్ని స్మశానానికి తీసుకువెళ్లు తారుగదా! శవాన్ని అంతా మొత్తం మూసినప్పటికి రెండు చేతులను మాత్రం వెల్లడిగా బటాబయలుగా బట్టబయట అందరూ చూచేటట్లు పెట్టి శ్మశానానికి తీసుక వెళ్లండి. ఎందు కంటారా? వినండి. దేశదేశా లను కొల్లగొట్టి రత్నాలను రాశులకు రాశులకు పోసుకున్న అలెగ్జాండరు చక్రవర్తి పోయేటప్పుడు వట్టిచేతులతో పోయినాడంటూ ప్రపంచమంతా చూడనీ!"

జీవుడు చేసుకున్న కర్మమూ — ధర్మమే వానివెంట వెళ్ళేది. తక్కినది యే ఒక్కటీ వానివెంటరాదు. ఇట్టి అనిత్యమైన — తుచ్ఛ మైన వస్తువుల స్మరణ మరణకాలంలో రానీరాదు. పరమాత్మను స్మరించి జన్మము ధన్యం చేసుకోవాలె. మహారాష్ట్రంలో 'పీష్వా' వంశీయుడైన 'మాధవరావు'కు మరణకాలం ఆసన్నమైంది. కఫాధిక్యంతో కంఠం అడ్డగింపబడింది. డాక్టర్లు చెప్పినారు: "కఫాన్ని నివారిస్తే అతిసారం కల్గుతుంది. అతిసారాన్ని నివారిస్తే కఫం కల్గుతుంది. దేనితోనైనా మరణం తప్పదు." మరణం నిశ్చయమని తెలుసుకున్నాడు. "అతి సారంతో చచ్చినాసరే — కఫాన్ని నివారించండి — భగవన్నామం ఉచ్ఛ రిస్తూ ప్రాణాలను వదుల్తాను" — అని ఆయన అన్నాడు.

కొందరు తమజీవితంలో సత్కార్యాలు - పుణ్యకార్యాలు - భగవ చ్చింతన కల్గివుంటారు. మరణకాలంలో ధాతుదోషప్రకోపంతో వారికి స్మృతి తప్పిపోవచ్చు. బాహ్యదృష్టికి వారు భగవంతుని జ్ఞప్తిలేనివారుగా తోచవచ్చు. వారు ముందు చేసిన కృత్యాలు విఫలమైనట్లేనా? ఎంత మాత్రంకాదు. కర్మసిద్ధాంతంబట్టి తర్వాతిజన్మకు ఆ ఫలం అవశ్యంవుండే తీర్తుంది. "న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి" - మంచి చేసినవాడెప్పుడూ చెడిపోడని గీతాచార్యుడే అభయమిచ్చివున్నాడు.

ఆత్మజ్ఞాని జ్ఞానంపొందినపుడే ముక్తుడైనాడు. కాబట్టి అతనికి మరణదోషప్రభావం పట్టదు. విప్రగృహంలోకాని చండాలుని యింటిలో కాని నవ్వుతూకాని యేడుస్తూకాని అతడేవిధంగా మరణించినా అతని ముక్తికి లోటులేదు; అతడు ముక్తుడే ముక్తుడు.

భగవంతుడీశ్లోకంలో అర్జునుని 'కుంతీకుమారా' అని సంబోధిం చాడు. కుంతి పరమభక్తురాలు. మరణసమయంలో కృష్ణుని స్మరిస్తూ దేహం వదలిన పుణ్యాత్మురాలు. అట్టి తల్లికి కలిగిన కొడుకు అర్జునుడు. అంత్యకాలంలో భగవంతుని స్మరణ నీబోటివానికి దుర్లభం కాదంటూ ఆశ్వాసించే కోసం యీ సంబోధన చెప్పబడింది.

"పార్థా! మరొక్కమాట. అజామిళుడువలె మరణకాలంలో నారాయణస్మరణ చేస్తే సరిపోతుందిగదా! ఇప్పటినుండి యెందుకు ముప్పుతిప్పలు పడాలె? ఆనాడు చూచుకోవచ్చునని వాయిదా వేస్తా వేమో! మరణసమయంలో వుట్టిపడినట్లు ఆత్మజ్ఞప్తి - భగవత్‌స్మరణ రావాలంటే అది అంత తేరకు రాదుసుమా! అయ్యా! అస్త్రవిద్యను నిరంతరం నీవెందుకు అభ్యసిస్తూండాలె? యుద్ధంనాడు కదా కావలసింది! అయినా, అభ్యాసం లేకపోతే హఠాత్తుగా యుద్ధంలో జ్ఞప్తికి రాక పోవచ్చు. అందుకోసమేగదా - నీవు శస్త్రాస్త్రమంత్రవిద్యను ప్రయోగోప సంహారాలతో నిత్యమూ జపిస్తూంటావు. ఈ విషయమూ అంతే. బ్రతికినదినాలు తింటూ తిరుగుతూ, స్వేచ్ఛగా కాలం గడపి ముహూర్తం చూచుకొని సరిగ్గా పైముకు దిగిరమ్మంటే అంతతేలికగా భగవత్‌స్మరణ రాదు. అందులో మరణకాలం అత్యంత భయంకరమైంది. ఇంద్రియాలు పరవశమైతవి. బుద్ధి వికలమైపోతుంది. వానిచిత్తం వానికి స్వాధీనముండదు. పరిస్థితి అట్లుండును కదా! మరి - చేయవలసిన కర్తవ్యమేమంటావా? విను.

"తస్మాత్సర్వేషు కాలేషు - మామనుస్మర యుద్ధ్య చ।
మయ్యర్పితమనోబుద్ధిః - మామేవైష్యస్యసంశయః॥"

ఇది యెనిమిదో అధ్యాయంలోని యేడవశ్లోకం. అర్జునుని నిమిత్తంగా పెట్టుకొని యావత్ప్రపంచమానవకోటికి భగవంతుడు సందేశమిస్తూన్నాడు. 'తస్మాత్' అనే పదప్రయోగంద్వారా యిక్కడికి కొక ప్రకరణం ముగి సింది. అయిదు — ఆరు — ఏడు శ్లోకాలుకలిసి ఒక ప్రకరణం.

"అర్జునా! ఈ కారణమువలన నీవు సర్వకాల సర్వావస్థలలోను నన్నే అనుస్మరిస్తూ నీ కర్తవ్యమగు యుద్ధాన్ని ఆచరించు. నీ మనో బుద్ధులను నాకే సమర్పించు. నన్ను చేరగలవు. సంశయం లేదు."

ఇంతకు ముందు చెప్పిన రెండు శ్లోకాలనుబట్టి అంత్యకాలంలో పరమాత్ముని స్మరణ అనివార్యమగు ఆవశ్యకమని తెలిసింది. అది ఆ సమయంలో సిద్ధించాలంటే, యిప్పటినుండి జీవించివున్నంతకు ఆత్మ చింతన _ పరమాత్ముని స్మరణ ఆచరింపవలసివుంటుంది. పరీక్షలో విద్యార్థి నెగ్గాలంటే తక్కిన రోజులలో సైతం శ్రద్ధగా పఠించవలసి వుంటుంది. పరీక్షసమయంలో చూచుకోవచ్చు లెమ్మంటూ, తక్కిన దినాలలో తాత్సారంగా సినిమాలకు తిరుగుతూండే విద్యార్థి పరీక్షలో ఉత్తీర్ణుడు కాలేడు. అట్లే మరణకాలంలో ఆత్మజ్ఞప్తి- భగవత్ స్మరణ కల్గాలంటే అనుదినం - అహరహం, సాధనచేయాలె. మొత్తం జీవితంలో యే సంస్కారం బలిష్ఠంగా వుంటుందో, అదే మరణకాలంలో వచ్చి యెదురుగా నిలుస్తుంది. మరణసమయం పరీక్షాఘట్టం. బ్రతికినదినాలు చదువుకొనేరోజులు. ఓపికతో చదువుకునే విద్యార్థికూడా ఒక్కొక్క పర్యాయం పరీక్షలో తప్పిపోతూంటే, చదువుజోలికిపోని సోమరివిషయం చెప్పేపనేలేదు. బాగా యీతవచ్చినవాడే ఒక్కొక్కసారి కంగారుతో మునిగిపోతాడు; యీత రానివాని విషయం మరెందుకు చెప్పాలె! ఎంతకైనా మానవునికి పూర్వసిద్ధత వుండాలె. కాబట్టే భగవంతుడన్నాడు — సర్వకాలం నన్నే స్మరిస్తూ యుద్ధం చేయుమన్నాడు. కురుక్షేత్రంలో యుద్ధం జరిగింది పద్దెనిమిది రోజులేకదా! ఆ పద్దెనిమిది రోజులూ నన్ను స్మరించుమని చెప్పలేదే. సర్వకాలమూ స్మరించాలె; సర్వకాలమూ యుద్ధం చేయాలె. ఈ యుద్ధం కురుక్షేత్రంలోని యుద్ధం కాదు. మానవుడు ప్రకృతితో సాగించే నిత్యపోరాటం. మన సంసారమే కురుక్షేత్రం; మన హృదయమే కురుక్షేత్రం. ఇందులో యెప్పుడూ యుద్ధం జరుగుతూనే వుంది. వెయ్యేల! మనంచేసే పనిపాటలన్నీ యుద్ధాలే. ఇవి జీవితమంతా జరిగే యుద్ధాలు. ఇవి చేస్తూ భగవంతుని అనుస్మరిస్తూండాలె. స్మరించుట అనలేదు. అనుస్మరిస్తూ అనినారు. స్మరించుట అంటే యేదో ఒక సమయంలో, ఉదయం సాయంకాలం, స్మరించుట మాత్రం. అనుస్మరించుట అంటే, కంటూ వింటూ తింటూ తిరుగుతూ సర్వకాల సర్వావస్థలలో అఖండ బ్రహ్మాకారవృత్తి - భగవదాకారవృత్తి, యెడబాయకుండా వుండడం. దేహేంద్రియాదులతో బైటపనులూ

జరగాలె. లోపల అంతఃకరణంతో ఆత్మానుసంధానం — యీశ్వర చింతనమూ జరగాలె. గోపికలు కామంతో కంసుడు భయంతో శిశుపాలాదులు వైరంతో యాదవులు బంధుభావంతో పాండవులు ప్రేమతో నారదాదులు భక్తితో బ్రహ్మజ్ఞానులైన మునులు ఆత్మ భావంతో భగవంతుని స్మరించి ధన్యులైనారు. ఏదోవిధంగా నిరంతర స్మరణ జరిగిందంటే మానవుడు కృతార్థుడైపోతాడు. నిరంతరస్మరణం జరగాలంటే చిత్తశుద్ధి తప్పనిసరి అవసరం. ఆ చిత్తశుద్ధి సిద్ధించేకోసం స్వధర్మపరిపాలనం — కర్తవ్యాచరణం సూచింపబడింది. యుద్ధమని చెప్పింది ఆ కర్తవ్యపాలనంగూర్చే.

లోభి ధనాన్ని స్మరిస్తూన్నట్లు, కాముకుడు కామినిని తలపోస్తూ న్నట్లు, సాధకుడు యే యే పనులు చేస్తూన్నా తన ధ్యేయవస్తువును చింతిస్తూనే వుండాలె. పతివ్రతాంగన తాను ఆయా గృహకృత్యాలు చేస్తూనే పతిని స్మరిస్తూ వుంటుంది- తన పతిభక్తికి తాను చేసేపనులు అడ్డంరావు. పనుల పాలిటికి పనులూ జరుగుతూంటవి. పతిభక్తీ జరిగి పోతూంటుంది. అట్లుకాదని, పనులు పాటలు మానుకొని ఆవిడ స్నానం చేసి మడిగట్టుకొని తావళం తీసుకొని 'పతి పతి పతి' అని జపం మొదలు పెట్టితే అది పతిభక్తి అంటామా? పిచ్చి పట్టిందని బెంగుళూరు ఆస్పత్రికి పంపిస్తాం. మరోదృష్టాంతం చెబుతాను వినండి. ఒక గృహిణి వూరిబైటి బావికి మంచినీటికై బయలుదేరింది. ఇంట్లో మరెవ్వరూలేరు. ఒక చంటి బిడ్డ మాత్రమున్నాడు. వానిని తొట్లల్లో పడవేసి నిద్రబుచ్చింది. తాను బావికి బయలుదేరింది. దూరం నీళ్లుకాబట్టి ఒకేదఫా తేవచ్చునని మూడు పాత్రలు తీసుకొంది. చేత్రాడు తీసుకొని వెళ్లింది. నూతినుండి నీరు చేదుకొంది. రెండుపాత్రలు తలపై ఒకదానిపై నొకటి పెట్టుకొంది. సందిట ఒకపాత్ర వేసుకొనింది. ఒకచేతితో త్రాడు పట్టుకొనింది. దారి వెంట నడుస్తూ మనస్సులో పిల్లవానిని స్మరిస్తూంది. 'వాడు లేచినా డేమో! ఏడుస్తూన్నాడేమో!' అంటూ అంటూ ఆమె నడచివస్తూనే వుంది. పిల్లవాని స్మరణా జరుగుతూనేవుంది. నడచిరావడమూ జరుగు తూనేవుంది. పిల్లవాన్ని స్మరించాలంటే, పాత్రలను క్రింద బెట్టి నడవడం

మానుకొని ఒకచోట కూర్చొనవలసివచ్చిందా మరి. లేదు. అట్లే మనమూ రూఢిపడ్డామంటే అర్జునునిలాగా ఒకేసారిగా యుద్ధమూ చేయవచ్చు; ఈశ్వరస్మరణా చేయవచ్చు అయితే యిప్పటి మన పరిస్థితి దీనికి భిన్నంగావుంది. పనులు చేసుకుంటూంటే భగవంతుని మరచిపోతాము — భగవంతుని స్మరించుకుంటే పనులను మరచిపోతాం. మన అవస్థ యిలావుంది. ఈ విషయంలో ఒక దృష్టాంతం చెబుతాను.

ఒకగ్రామంలో ఒకదేవాలయంవుంది. ఆ ఆలయం పూజారి హఠాత్తుగా మరణించాడు. అవసరానికి ఒక క్రొత్తవాన్ని తెచ్చి పూజారిగా అతికించినారు. అతనికి యెన్నడూ యీ పూజావగైరా తెలిసినవికాదు. క్రొత్తవైష్ణవం. పూజాసమయంలో హారతి యిచ్చేటపుడు గంట వాయించాలె. హారతి త్రిప్పితే గంటవాగదు. గంట వాగితే హారతి తిరగదు. ఒకేసారి రెండుచేతులు తిరిగే అలవాటు వానికిలేదు. పదిరోజులు అలవాటుపడిందంటే గబగబ హారతి త్రిప్పుతాడు, గణగణ గంటా మ్రోగిస్తాడు.

మన పరిస్థితీ అంతే. కర్మం ధర్మం— పనీపాటా, చేసుకుంటూంటే భగవత్‌స్మరణ మరచిపోతాం. భగవంతుని స్మరణ ప్రారంభిస్తిమా, అవన్నీ ఆగిపోతవి. కానీ యీ పరిస్థితి ఆరంభదశలోమాత్రం. అలవాటు పడిపోయిందా—రెండూజోడై నడుస్తాయి. అప్పుడు మేళం తాళం కలిసిన సంగీతంలాగా జీవితం దివ్యంగా శోభిస్తుంది.

మనోబుద్ధులు నాకు సమర్పించుమంటూ భగవంతుడాదేశిస్తున్నాడు. పూలు పుష్పాలు — పండ్లు టెంకాయలు సమర్పించడంకాదు గొప్ప. చెట్లకు పూసినపూలు చెట్లకు కాసినకాయలు గిల్లితెచ్చి దేవునికి సమర్పించి, నాకు పుణ్యం రావాలంటూ కోర్తావు. పుణ్యం చెట్లకు రావాలె. మధ్యలో నీకెందుకని వస్తుంది? నీకు పుణ్యం రావడానికి నీవస్తువేమిచ్చావు? కాబట్టి మనోబుద్ధులను సమర్పించుమంటూ భగవంతు

డంటూన్నాడు. జీవునికీ దేవునికీ భేదం కల్పించినవి యీ మనోబుద్ధులే. ఈ మనోబుద్ధుల ఆటంకం తొలగితే జీవుడే దేవుడు. ఇదంవృత్తి మనస్సు, అహంవృత్తి బుద్ధి. ఈ రెంటికీ విషయంగా భగవంతుని చేసుకో. అహంవృత్తికి లక్ష్యమైన తానూ భగవంతుడే — ఇదంవృత్తికి గోచరించే జగత్తూ భగవంతుడే. ఈ అఖండభావన కల్గిందంటే మనోబుద్ధులు భగవంతునికి సమర్పించినట్లే. విమర్శించేది మనస్సు. నిశ్చయించేది బుద్ధి. ఈ రెంటికీ భగవంతుడే విషయం కావలసివుంటుంది. భగవంతుని గురించే విమర్శ. భగవంతుని గురించే నిశ్చయం. అప్పుడు మనోబుద్ధులను భగవంతునికి సమర్పించినట్లే. అట్టివానికి యిహంలో భగవంతుని నిష్ఠ; పరంలో భగవత్ప్రాప్తి. సంశయం వద్దంటూ మరొక్కసారి గీతాచార్యుడు మనలను హెచ్చరించినాడు.



"Death is most important event of life. Birth is also so. But it happens in full ignorance. Man has sufficient time to know how to die."

(ఒక ఆంగ్లగ్రంథంనుండి)



ఆత్మీయ ప్రియబంధువులారా!

భగవద్గీత - ఎనిమిదవ అధ్యాయం-పేరు అక్షరపరబ్రహ్మయోగం- మీారు వింటున్నారు. అర్జునుని నిమిత్తం చేసుకొని భగవంతుడు యావత్ప్రపంచానికి ఈ సందేశమిస్తూన్నాడు. "పార్థా! మనస్సును అభ్యాస యోగయుక్తం చేసి యితరచింతలను వదలించి, నిరంతరం చింతిస్తూ ఉపాసకుడు పరమదివ్యపురుషుని ప్రాపిస్తాడు."

మరణసమయంలో భగవంతుని స్మరణ కావాలంటే రెండు సాధనలను అవలంబించాలె. మనస్సు అభ్యాసయోగయుక్తం కావాలె; అన్యచింతలను వదలాలె. అభ్యాసమొక యోగం. అసలు యీ అధ్యాయానికి అభ్యాసయోగమనే పేరుంది. అభ్యాసంతో సాధింపరాని పనులు లేవు. 'సాధనమున పనులు సమకూరుఉ'. అభ్యాసబలంతో సముద్రాలలో మునగవచ్చు; హిమవత్పర్వతము నెక్కవచ్చు, సర్కసులో చూస్తుంటాము కదా! ఆడమనిషి సన్ననితీగపై గబగబనడచి వెళ్లుతుంది. పులులు మొదలైన వన్యమృగాలు చెప్పినట్లుపనిచేస్తవి. భారతంలో ఒక కథవుంది. అర్జునుడొకనాడు రాత్రిపూట భోజనము చేస్తూన్నాడు. ఉన్నట్టుండి దీపమారిపోయింది. చిమ్మచీకటి క్రమ్ముకొంది. ఆ సమయంలో ఆతనికొక యోచన తట్టింది. "ఇంత చీకటిగా వున్నా నా చేయి సరిగ్గా నోటివద్దకే పోతుందే! ఇది అభ్యాసబలం కదా! చీకట్లో అన్నం తినకల్గినపుడు బాణాలను మాత్రం యెందుకు ప్రయోగించరాదు?" అని ఆతడు ప్రయత్నించి సాధనచేసి చీకటిలో అస్త్రప్రయోగం చేయుటసైతం నేర్చుకున్నాడు.

అభ్యాసమంటే ప్రాణం బిగబట్టడంకాదు; తల్లక్రిందులు తపస్సు చేయుటకాదు. తన ధ్యేయవస్తువును సదా సర్వదా చింతించుటే అభ్యాసం.

"తచ్చింతనం తత్కథనం — అన్యోన్యం తత్ ప్రబోధనం।
ఏతదేకపరత్వం చ — బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥"

అని విద్యారణ్యస్వాములవారు చెప్పినారు. తత్పదవాచ్యమగు పరమాత్ముని చింతనచేయాలె. లేచినా కూర్చున్నా తినినా తిరిగినా, బ్రహ్మచింతనం

లోనే కాలం గడపాలె. సోఽహం శివోఽహం అహం బ్రహ్మాస్మి తత్త్వమసి, మహావాక్యాలను మననం చేస్తూండాలె. అయిదో అధ్యాయంలో "పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్" అని చెప్పినట్లు ఆత్మచింతన — పరమాత్మచింతన ఒకపిచ్చిలాగా పట్టిపోవాలె. వినినా అదే - చెప్పినా అదే. దానినే బ్రహ్మాభ్యాసమంటారు. నాటకంలో పురుషుడు స్త్రీవేషంవేసినా స్త్రీవలె ఆడ్తూ పాడ్తూ పలుకుతూ కులుకుతూన్నా, తాను పురుషుడననే భావం యెలా మరువడో, అట్లే మీరందరూ జగన్నాటకరంగంపై వానివానిపాత్రకు అనుకూలంగా వ్యవహారం చేస్తూ వ్యాపారంచేస్తూ వ్యవసాయం చేస్తూ ఉద్యోగం చేస్తూ ఉపన్యాసం చేస్తూ తాను బ్రహ్మస్వరూపమనే విషయాన్ని మరువరాదు.

మొదట్లో మొదట యీ అభ్యాసం మనస్సుకు కొంత కష్టంగా వున్నా క్రమేణ సులభంకాగలదు. దీనివల్లకలిగే ప్రయోజనమేమంటారా? చిత్తం తనంతకు తానే యితరచింతలనుండి వెనుక్కు మళ్లుతుంది. మనస్సు దొంగగొడ్డు లాంటిది. ఉండుమన్నచోట పట్టుమని పదినిముషాలుండదు. బహిర్ముఖమై పారిపోవుటే దానిపని. బైటికివెళ్ళిన చిత్తం వూరక కొంప చేరదు. దొంగమేత మేసి వస్తూ యింటికి తంటాలు తగాదాలు తెచ్చి పడవేస్తుంది. లేనిపోని విషయవాసనాసంస్కారాలను తెచ్చి మనపాలిట వేస్తుంది. అలవాటుపడిన గొడ్డు అంతంతతో తన స్వభావం మానడం కష్టం. అది తన స్వభావం మార్చుకొనేవరకూ సాధకుడు తన సాధన మానరాదు. పాతసంస్కారం మాసిపోయేవరకూ క్రొత్తసంస్కారాలు అలవరుస్తూ రావాలె.

ఏనుగు తొండం బహుచపలమైంది. తనకేది యెదురైతే దాన్ని పట్టుకొంటుంది. దేనినో ఒకదాన్ని పట్టుకొనుట దానికి అలవాటు. అట్లే వూరక వదలిపెట్టితే ప్రక్క ప్రక్కనుండు మనుష్యులకు అపాయం కల్గించవచ్చు. కాబట్టి మావటివాండ్లు యేనుగు తొండానికి బరువైన గొలుసును పట్టిస్తారు. దాని బెడద అంతటితో తీరింది. మనస్సు విషయమూ అంతే. సోమరిపోతు మనస్సులో దయ్యాలు నివసిస్తాయనే సామెతవుంది. మరోదృష్టాంతం చెబుతాను — వినండి.

ఒక వ్యక్తి భగవంతునిగూర్చి తపస్సు చేసినాడు. భగవంతుడు సాక్షాత్కారమై యేమి కావాలో కోరుకొమ్మన్నాడు. "స్వామీ! చెప్పినట్లు యెప్పుడూ పనిచేసే నౌకరు నాకు కావాలె. దయచేయండి" — అని వాడు కోరాడు. భగవంతుడు "సరే-యిచ్చినాను. కానీ ఒక మాట. వానికి నీవు యెప్పుడూ పని చెబుతూండాలె. అతడు పనిలేక క్షణం వుండడు. పని చెప్పకపోతె నీ ప్రాణం తీసేస్తాడు"-అని చెప్పి వెళ్లిపోయాడు.

సంవత్సరాల తరబడి చేయవలసిన పనులు గంటలలో అయిపోయినా— మంత్రమహిమతో జరిగినట్లు ఊహలోని ప్లానులన్నీ ముగిసిపోయినవి. పని - పని - పని, ఒకటేపోరు. అది దేవతకాదు; వానిపాలిటికి భూతమైంది. "ఈ తద్దినం యెందుకు కొనితెస్తిరా - దేవుడా!" అని వాడు అంగలార్చుస్తూన్నాడు. అంతలో బుద్ధిమంతుడగు మిత్రుడొకడు వచ్చి వాని సంగతి సందర్భాలు తెలుసుకున్నాడు. ఆ భూతంతోనే యింటి కెదురుగా ఒక పొడుగాటి గుంజను నాటించాడు. దానితో అన్నాడు: "ఇదో! అబ్బాయ్! విను. మా మిత్రుడు పని చెప్పినపుడు ఆ పని చేయ్. తక్కిన సమయాలలో, చీటికి మాటికి పని-పని అంటూ అడుగనలసింది లేదు. ఈ గుంజను యెక్కుతూ దిగుతూండు. ఇదే పని". తంటా తీరిపోయింది.

అవివేకికి మనస్సే భూతం. వివేకికి మనస్సే దేవత. అది పని చేయక ఒక్కనిముషం వూరకోదు. సోమరి మనస్సు లేనిపోని ఉపద్రవాలను తెచ్చిపెట్టుంది. దానికొక సాధన — అభ్యాసం పట్టించాలె. దృష్టాంతంలో, భూతం గుంజను యెక్కుతూ దిగుతూండడం యజమానికి లాభమేమీ లేదు, నష్టం తప్పింది. కాని దార్ష్టాంతంలో, మనస్సుకు అభ్యాసం పట్టించడం ద్వారా నష్టం తప్పుటే కాదు, లాభంకూడా వుంది.

మనస్సు చెడిపోతే మనుష్యుడే చెడినట్లు. మనస్సును సంస్కరించే కోసమయ్యే మతాలు — ధర్మాలు — శాస్త్రాలు — సాధనలు ఆవిర్భవించాయి. మనస్సును సంస్కరించేందుకు మార్గాలు అనేకం. వాని వాని అభిరుచికి — అనుకూలతకు తగినట్లు మార్గాన్ని అవలంబించాలె. మరో విషయం చెబుతాను వినండి. నేను సుమారు పాతికేండ్లక్రితం బొంబాయి

వెళ్లినాను. బొంబాయిలో ఒకచోట చిన్నగుట్టమీద బాబులేశ్వర మందిరమనే దేవాలయం వుంది. పట్టణవాసులు వచ్చిపోయేందుకు అను కూలమైన ప్రదేశం. పారాయణ చేసేందుకు భగవద్గీతలు — జపానికి తావ ళాలు — క్రింద వేసుకునే దర్భాసనాలు — కావలసినన్ని అక్కడే వున్నవి. సాధకులు వాటిని ఉపయోగించుకొని తమ తమ అనుష్ఠానాలను చేసుకొని పోవచ్చు. సాయంకాలం ఆ ప్రాంతంలోని భక్తకోటి అక్కడ సమావేశ మైతూంటారు. ఆ మందిరంలోనే వుండే స్వామివారొకరు ప్రతిరోజూ సాయంకాలం ఉపన్యాసం చెబుతూంటారు. నేనూ వెళ్లినాను. వింటూ న్నాను, వారు చెబుతూన్నారు. "ఓ గృహస్థులారా! వినండి. మీరు సులువుగా తరించిపోవాలంటే మీకొక యుక్తిని బోధిస్తూన్నాను వినండి. రెండు మాటలు యెప్పుడూ జ్ఞప్తిలో పెట్టుకోండి. రెండు మాటలు యెప్పుడూ మరచిపోతూండండి. సులభంగా మీరు కడతేరిపోతారు. జ్ఞాపకం పెట్టుకోవలసిన రెండూ యేమంటే, ఒకటి — మృత్యువు; రెండు— భగవంతుడు. మృత్యువును జ్ఞప్తి పెట్టుకుంటే పాపాలలోకి జారిపోడం వుండదు. భగవంతుని జ్ఞప్తి పెట్టుకొంటే ముక్తి లభిస్తుంది. ఇక మరచి పోవలసిన రెండూ యేమంటారా? ఒకటి — తాను పరునికి చేసిన ఉప కారం; రెండు — తనకు యితరుడు చేసిన అపకారం. తానితరులకుచేసిన ఉపకారం యెప్పటికప్పుడు మరచిపోవాలె. అందరికీ ఉపకారం చేసేవాడు భగవంతుడు. తానెంతమాత్రం? అట్లుగాక తాను చేశానని జ్ఞాపకం పెట్టు కుంటే అహంకారం కల్గుతుంది. తనకు యితరుడు చేసిన అపకారాన్ని మరచిపోవాలె. కష్టసుఖాలకు వాని వాని కర్మే కారణం కాని మనుష్య మాత్రు డెంతమాత్రం? అటుగాక యితరుడు చేసిన అపకారాన్ని జ్ఞప్తిలో పెట్టుకుంటే ద్వేషం కల్గుతుంది." చూచారా? ఆ స్వామివారు సామాన్య సంసారులునైతం తరించేటట్లు సులువైన సాధనను చెప్పివేశారు. మన స్సును జయించేటందుకు అనేకమార్గాలు. ఆయన చెప్పిన మాటలు నాకిప్పటికీ జ్ఞప్తిలో వున్నాయి.

విజాతీయ ప్రత్యయనిరాకరణపూర్వకంగా చిత్తము సజాతీయ ప్రత్యయప్రవాహం సాగించిందంటే దానిని అభ్యాసమంటారు. అదే యోగం. యోగమంటే యుక్తి. ఆ అభ్యాసమే ము ని సాధించుటకు

యుక్తిగా వుంటుంది. ఆ అభ్యాసయోగంతో చిత్తం యేకాగ్రమగుట అభ్యాసయోగయుక్తమంటారు.

"పృథాకుమారా! అభ్యాసయోగంతోకూడి అన్యత్రా భ్రమించని చిత్తంతో అనుచింతనం చేస్తూ సర్వాతిశయమైన దివ్యపురుషుని సాధకుడు ప్రాపిస్తాడు."

పృథ అనగా కుంతీదేవి. ఆమె కుమారుడు పార్థుడు. ఇది అర్జునుని పేరు. మరొక్క అర్థమేమంటే — పృథివిలో పుట్టినవారందరూ పార్థులే. భగవద్గీతోపదేశం ఒక్క అర్జునునికేకాదు. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" — అర్జునుడు యుద్ధానికే కాదు, గీతోపదేశానికి కూడా నిమిత్తమాత్రమే. ఇది సర్వమానవకోటికి బోధించిన బోధ. ఇచ్చట 'అనుచింతనం చేయా'లని అన్నారు. పరమాత్ముని చింతనము స్వేచ్ఛగా తన యిష్టానుసారం చేయరాదు. గురుశాస్త్రోపదేశాల ననుసరించి చేయాలె. ఆ పరమపురుషుని యేవిధంగా చింతించాలో ఆ స్వరూపవర్ణనం మీాదటి తొమ్మిదవ శ్లోకంలో భగవంతు డాదేశిస్తూన్నాడు.

"కవి — పురాణుడు — అనుశాసకుడు — సూక్ష్మాతిసూక్ష్ముడు — సర్వాధారుడు - అచింత్యరూపుడు - ఆదిత్యవర్ణుడు - తమస్సుకు పరుడని పరమపురుషుని అనుస్మరిస్తూ సాధకుడు తత్ప్రాప్తిని పొందుతాడు."

ఉపాసకులు పరమాత్ముని స్వరూపాన్ని మూడు విధాలుగా వర్ణించి ఉపాసిస్తారు. ఒకటి — నిర్గుణ నిరాకారస్వరూపం. రెండవది — సగుణనిరాకారస్వరూపం. మూడవది — సగుణసాకారస్వరూపం. జ్ఞానులు నిర్గుణనిరాకారాన్ని భావిస్తారు. రెండవదైన సగుణనిరాకారస్వరూపాన్ని భగవంతుడిచ్చట పేర్కొంటూన్నాడు. భగవంతుని ఉపాసించేవాడు — స్మరించేవాడు, ఆయన లక్షణాలను కొన్నిటిని హృదయంగమం చేసుకొని స్మరించాలె. కావున పరమాత్మునికి సంబంధించిన లక్షణాలు యీ శ్లోకంలో చెప్పబడ్తూన్నవి.

మొదటి లక్షణం 'కవి' అన్నారు. భగవంతుడు కవి. ఆయన కవిత్వమే యీ సృష్టి. కవి అంటే పద్యాలు వ్రాసేవాడనికాదు. 'కవిః సర్వజ్ఞః, కవిః క్రాంతదర్శీ' అని వ్యుత్పత్తి. రవి చూడనిచోటు కవి

చూస్తాడంటూ తులసీదాసు చెప్పినాడు. భగవంతుడు సర్వజ్ఞుడు. ఆయన త్రికాలదర్శి. దేశకాల వ్యవధానాలు ఆయనకు ఆటంకంకాదు. ప్రతివాని హృదయంలో క్రాంతి గల్గించేది ఆయనే. ఆయన అక్షరకవి. ఆయన కావ్యం అమృతకావ్యం. భగవంతున్ని రాముడని కృష్ణుడని శివుడని కేశవుడని దేవిఅని అల్లాఅని ఆయాపేర్లతో వ్యవహరిస్తారు. అవి సర్వమాన్యమైన పేర్లుకావు. శివుడంటే వైష్ణవులకు పట్టదు. విష్ణువంటే శైవులకు సరిపోదు. ఇవేవీ ఇస్లాం క్రైస్తవులకు పట్టవు. కానీ సర్వజ్ఞుడనే నామధేయాన్ని ప్రతివాడూ అంగీకరిస్తాడు. తమ దేవుడు సర్వజ్ఞుడని ప్రతిమతస్థుడూ తలపోస్తాడేకాని అల్పజ్ఞుడని యెవ్వడూ భావించడు.

విరాట్పురుషుని హిరణ్యగర్భుని సర్వజ్ఞత్వం సాపేక్షికమైంది. అనగా ఒక పరిమితమైందని అర్థం. ఈశ్వరుని సర్వజ్ఞత్వం నిరపేక్షికమైంది అతనిని మించిన సర్వజ్ఞత్వం కలవాడెవ్వడూలేడని అర్థం. స్థూల సూక్ష్మకారణప్రపంచంలో ఆయనకు తెలియునిదంటూ ఒకటీలేదు.

వినండి. మన కళ్లయెదుట ఒక విశాలవిశ్వబ్రహ్మాండం కాన వస్తూంది. ఇది కార్యరూపం కాబట్టి దీనికి కర్తఅంటూ ఒకడుండాలె. కార్యాన్ని చూచి కర్తను వూహించుట అనుమానప్రమాణం అంటారు. దీనినే తర్కశాస్త్ర మందురు. ఈ శాస్త్రానికి గౌతముడు ఋషి. ఆయన అనుమానప్రమాణంతోనే యీశ్వరుని అస్తిత్వాన్ని నిరూపిస్తాడు. ఇదో యిది గడియారం. ఇది సృష్టవస్తువు. అనగా, సృష్టిఅయిన కార్య వస్తువు. దీనిని తయారుచేసినవాడు యెవడో ఒకడు, యెక్కడో ఒక చోట వుండేతీరాలె. వాడు హిందువో ముస్లిమో స్త్రీయో పురుషుడో-యేమైనా కానీ గడయారానికి కర్తఒకడు వుండేతీరాలె. అతడు యెట్టివాడుగా వుండాలె? గడియారానికి సంబంధించిన పరిజ్ఞానం సంపూర్ణంగా కలవాడై వుండాలె. అల్ప స్వల్ప జ్ఞానంకలవాడు గడియారాన్ని తయారుచేస్తే పట్టుమని పదికాలాలపాటు అది బ్రతుకదు. ప్రపంచాన్ని సృష్టించిన పరమాత్మకూడ విశాల విశ్వబ్రహ్మాండానికి సంబంధించిన పరిజ్ఞానం సమగ్రంగా కలవాడై వుండాలె. సృష్టిచక్రంయొక్క నియమబద్ధతను తిలకిస్తే, సృష్టికర్తయొక్క జ్ఞానం సమగ్రమంటూ ఒప్పుకోక తప్పదు. ఒక యింటిలో యేభై మంది యేకకుటుంబంగా

వున్నారు. ఇంటిలోనివారంతా వారి వారి పనులలో క్రమబద్ధంగా ప్రవర్తిస్తూంటే మన మేమనుకుంటాం? ఆ ఇంటియజమాని యెంత బుద్ధిమంతుడో అని ప్రశంసిస్తామా లేదా! సృష్టిలో సూర్యుడు చంద్రుడు వాయువు భూమి మేఘాలు సముద్రాలు వాటి వాటి నియమాన్ని అవంతైనా దాటడంలేదు. ఎంత కట్టుదిట్టం! ఎంత క్రమశిక్షణ! కావుననే పరమాత్ముడు సర్వజ్ఞుడని చెప్పడం.

ఒక మనుష్యుడు యెక్కడో పొరుగూరికి ప్రయాణమై పోతూ న్నాడు. కాలిదారి కాబట్టి నడిచే వెళ్లుతూన్నాడు. అది వేసవికాలం. వసంతఋతువు. నడిచి నడిచి అలసిపోయాడు. పెద్ద మామిడిమ్రాను అగపడింది. బడలిక తీర్చుకునేకోసం దానిక్రిందికిపోయి కూర్చున్నాడు కాసేపటికి అలత తీరింది. తలెత్తి పైకిచూచినాడు. చెట్టు తెగకాసింది. పట్టెడు పట్టెడు కాయలు. ఎదురుగా పారజూచాడు. పొలంలో ఒక గుమ్మడిచెట్టు కుప్పలుగా కాసింది. మోసేటంతకాయలు. అటూ యిటూ రెండువైపులా చూచినాడు. 'దేవునికి బుద్ధిలే'దని ఒకేతీర్పు చెప్పి వేశాడు. 'సృష్టి చేసి చేసి దేవుడు ముసలివాడై పోయాడు. ఆయనకు తల చెడిపోయింది. ఇంత విషమసృష్టి? పలచటి తీగెకు మోసేటంత పెద్దపెద్దకాయలు. కొండంత చెట్టుకు పిడికెడు పిడికెడు కాయలు. సృష్టికర్తయొక్క స్థానే నన్నే నిలిపితే, దీనికాయలు దానికి,దానికాయలు దీనికి అమరిస్తును. ఎంత శోభాయమానంగా వుండేది'' — అంటూ అంటూ ఆ పెద్దమనిషి తన వూహాప్రపంచంలో మునిగివున్నాడు. చెట్టుపైనుండే పిట్ట ఒకటి ఒకకాయను తెగి పడేటట్లు కొరికింది. అతని బోడితలమీద గురిపెట్టినట్లు ఆ కాయ విరిగిపడింది. అది క్రాపులయుగం కాదు. బోడినెత్తి మాత్రం. అదిరిపడ్డాడు. ఆ దెబ్బకు దేవళాలు తిరిగాయి. ''అబ్బో! దేవుడు మహాబుద్ధిమంతుడు. గుమ్మడికాయే నెత్తిన పడివుంటే, అన్యాయంగా తలపచ్చడి కావలసింది. దేవుడా! బ్రతికిపోయాను''.

ఆయన సర్వజ్ఞుడు. ఏది యెట్లుండాలో — యేది ఎక్కడుండాలో ఆయనకు తెలుసు. కావుననే భగవంతుని 'కవి' అన్నారు. భగవంతుడు సర్వజ్ఞుడంటూ భావిస్తూ భక్తుడు చింతనం చేయాలె.

రెండోలక్షణం పురాణుడు. పరమాత్మ పురాణుడు. ప్రాతవాడు. ప్రాతవాడు అని అంటే కారణంలేనివాడని అర్థం. 'కారణం కారణానాం'. ఆది లేనివాడు. పురాణపురుషుడు. 'పురా నవమితి పురాణం' — ఎంత ప్రాతవాడైనప్పటికీ ఆయన అంతంత క్రొత్తవాడు. సనాతనుడు అని అర్థం. సనాతనుడనగా నిత్యనూతనుడు. ఎప్పటి కప్పుడు క్రొత్తవాడు.

మరోలక్షణం చెబుతూన్నారు. భగవంతుడు అనుశాసిత. అనగా అందరిపైన శాసనం చలామణి చేసేవాడు. ఆయన ప్రజాసత్తాక రాజ్యానికి ప్రభువుకాడు. సర్వతంత్రస్వతంత్రప్రభువు. అతని భయానికి గాలి వీచుతుంది. సూర్యుడుదయిస్తాడు. మృత్యువు నిద్రలేక పనిచేస్తుంది. ప్రపంచంలోని మహామహా శక్తులకు ఆయన శాసకుడు. ప్రభుత్వం ప్రజలను శాసిస్తుంది. కాని యీ శాసనం బయటవుండి శాసించడం. పరమాత్ముడు అంతర్యామియై శాసిస్తాడు. ఒకడు నేరంచేసి ఖైదులో పడ్డాడు. జైలులోవేసి పెద్దతాళం వేసినారు. పోలీసు కాపలా కాస్తూ న్నాడు. దేహం జైలులోవున్నా వాని మనస్సు స్వేచ్ఛగా యింటికి వెళ్లింది. ప్రభుత్వశాసనం దేహంపై మాత్రమే చలామణి అయిందికాని, మనస్సును యేమీ చేసుకోలేకపోయింది. భగవంతుడు మన మనస్సును కూడా కనిపెట్టేవాడు. ఆతని శాసనం మనస్సుపైకూడ చలామణి ఔతుంది. కారణమేమంటారా — అతడు అంతర్యామి.

అన్నిటికంటె భగవంతుడు సూక్ష్మమైనవాడు. కాబట్టే స్థూల పదార్థాలనన్నిటిని శాసించగల్గుతూన్నాడు. ఇది నాల్గోలక్షణం. సూక్ష్మ మైనవాడంటే సన్ననివాడని కాదు; నిర్గుణుడని అర్థం. కాబట్టే తెలిసి కొనుటకు — యింద్రియ మనోబుద్ధులతో గ్రహించుటకు — వీలుకాని వాడని అర్థం. భూమికి శబ్ద స్పర్శ రూప రస గంధాలంటూ అయిదు గుణాలున్నవి. కాబట్టే యిది అన్నిటికంటే స్థూలమైపోయింది. జలానికి నాల్గే గుణాలు. గంధమనే గుణం లోపించింది. ఒక్కగుణం లోపించేసరికి, జలం భూమికంటే సూక్ష్మమైంది; వ్యాపకమూ అయింది. అగ్ని తత్త్వా నికి శబ్దస్పర్శరూపాలని మూడేగుణాలు. రెండుగుణాలు లోపించేసరికి అగ్ని, భూమికంటె జలానికంటె సూక్ష్మమూ వ్యాపకమూ అయింది. గుణాలు తగ్గేకొద్దీ వస్తువు సూక్ష్మమైతుంది. వాయువుకు రెండేగుణాలు.

శబ్దమూ స్పర్శమూ. పై వాటికంటె యిది సూక్ష్మము; వ్యాపకము కూడా. ఆకాశానికి శబ్ద మొకేగుణమే. ఇది అన్నిటికంటె సూక్ష్మం. అన్నిటికంటే వ్యాపకం. ఇక పరమాత్మ గుణాతీతుడు; కాబట్టే సూక్ష్మాతిసూక్ష్ముడని చెప్పబడింది. సాధకుడు ఆ విధంగా భగవంతుని చింతించాలె.

పరమాత్మ సర్వాధారుడు. ఇది అయిదో లక్షణం. సర్వానికి ఆధారుడు భగవంతుడు. దేహానికి భూమి ఆధారం. భూమికి జలం ఆధారం. జలానికి తేజస్సు ఆధారం. తేజస్సుకు వాయువు ఆధారం. వాయువుకు ఆకాశం ఆధారం. ఆకాశానికి పరమాత్మ ఆధారం. మొత్తం మొత్తం అన్నిటికీ ఆయనే ఆధారం. గడియారాన్ని మెత్తి నేను మీకు చూపుతూన్నాను. ఇదేమిటని మిమ్మ అడుగుతాను. మీరు గడియారమని చెబుతారు. చూచారా ! నేను మీకు రెండు వస్తువులను చూపాను. చేతినీ — గడియారాన్నీ. చేయి పెద్దది. గడియారం చిన్నది. చేయి ఆధారం. గడియారం ఆధేయం. అయినా, మానవుడు ఆధేయమైన గడియారాన్నే చూస్తాడు కాని, ఆధారమైన చేతిని గమనించడు. పరమాత్మ సర్వాధారుడు. ఆయన ఆధారంతోనే జీవులు తమ తమ కర్మల కనుగుణ్యంగా ఫలితాలను పొందుతూంటారు. కాని అజ్ఞాని కావిషయం తెలియదు.

'అచింత్యరూపం' — ఇది ఆరో లక్షణం. పరమాత్మ మనస్సుతో చింతింపను వీలుకానివాడు. మనస్సు క్షణికం; జడపదార్థం. నిత్యవస్తువూ చైతన్యఘనమూనైన పరమాత్మను మనస్సు యెలా చింతింపగల్గుతుంది. చింతన చేయుటకు వీలులేదన్నచో సాధకుల గతేమి అని అడుగవచ్చు. అచింత్యరూపుడనియే చింతించాలె. అట్లే మననం చేయాలె. ఆయన అనుగ్రహంతో సాక్షాత్కారం లభిస్తుంది.

'ఆదిత్యవర్ణం' — ఇది యేడవ లక్షణం. భగవంతుడు సూర్యునివలె స్వయంప్రకాశకుడు. సూర్యుడు ప్రపంచంలో స్వయంప్రకాశకుడు. పరమాత్మ సూర్యునికికూడా సూర్యుడు. సూర్యునిలోని ప్రకాశంకూడా ఆయనదే.

'తమస్సుకు పరుడు' — అజ్ఞానమునకు సాక్షి. అజ్ఞానదోషాలకూ తత్కార్యదోషాలకూ అంటనివాడని అర్థం. మాయకు అతీతుడు. ఇది యెనిమిదవ లక్షణం. కళ్లు మూసుకోండి. ఏమున్నది? చీకటి అని అంటారు. చీకటిని చూచే ప్రకాశం నీ నీవే చీకటి అయితే దానినెట్లు చూడగల్గుతావు? దానికి సాక్షివి. మానవుడు 'నేను అజ్ఞానిని — నేను అజ్ఞానిని' అని అంటాడు. నీవు అజ్ఞానివి కాదు. అజ్ఞానమును తెలుసుకునే జ్ఞానివి. అజ్ఞానివైతే 'అజ్ఞానివి' అని తెలుసుకునే జ్ఞానం నీకెట్లు కల్గింది? అజ్ఞానం నీకు దృశ్యం. దాన్ని చూచే సాక్షివి నీవు. దానికి అతీతుడవు.

ఈ లక్షణాలతో పరమాత్మని చింతించుమంటూ స్వరూపాన్ని చెప్పి, యిక ఆయనను చేరుటకు తగిన సాధనమార్గాన్నీ ఫలాన్నీ చెబుతూన్నారు.

"అర్జునా! దేహావసానసమయం సమీపించినప్పుడు యోగి, నిశ్చలమగు మనస్సుతోనూ భక్తితోనూ యోగబలంతోనూ కూడి ప్రాణాలను భ్రూమధ్యంలో లెస్సగా స్థాపించి, కవింపురాణమని యిదివరకు చెప్పిన దివ్యస్వరూప పరమపురుషుని అతడు పొందుతూన్నాడు".

మనస్సు చలనము తొలగి ఒకే వస్తువును పట్టివుండవలెనని, ఆ వస్తువుపై భక్తి — ప్రీతి మనస్సుకు అనివార్యంగా వుండాలె. ఆ వస్తువు విషయపదార్థంగాక భగవంతుడై వుండాలె. ఇట్లు భగవంతునిపై భక్తి-మనోనిశ్చలమూ రెండూ వున్నా ఒక్కొక్క పర్యాయం యీ రెండు కూడా చాలకపోవచ్చు. అట్టి కాలంలో అభ్యాసయోగాన్ని ఆశ్రయించాలె. అభ్యాసయోగము బహుకాలంనుండి రూఢి చెందిందై వుండాలె. వాయువును నిరోధించి కనుబొమలనడుమ నిల్పాలె. ఇంతజేసినా ధ్యేయవస్తువు క్షుద్రదేవతైనచో పునర్జన్మం తప్పదు. కాబట్టి ధ్యేయవస్తువు కవింపురాణమను శ్లోకంలో చెప్పిన పరమపురుషుడుగా వుండాలె.

పరమాత్మునిపై గల పరమప్రేమే భక్తి అని నారదులు సెలవిచ్చారు. ప్రతివానికి యేదో ఒక వస్తువుపై ప్రేమ వుండనె వుంది. కాని అది పవిత్రమైన భక్తి కాబోదు. భార్యయందుండే ప్రేమను మోహమంటారు. బిడ్డలపైని ప్రేమను వాత్సల్యమంటారు. భగవంతునిపై గురువుపై గల ప్రేమను భక్తి అని అంటారు. మనప్రేమ ప్రాపంచిక

అనిత్యపదార్థాలపై పడిపడి వ్యర్థమైపోతూంది. దాని ముఖాన్ని మళ్లించి భగవదభిముఖం చేయాలె. తుంగభద్రాజలం వ్యర్థంగా సముద్రంలో కలిసిపోతూవచ్చింది. సర్కారువారు హొస్పేటవద్ద ఆనకట్టకట్టి కాల్వలు త్రవ్వినారు. సముద్రంలో వృథాగా పడిపోయేనీరు కాల్వలగుండాపారి భూమిని సస్యశ్యామలం చేసేస్తూంది. అట్లే మన ప్రేమప్రవాహంకూడా.

వృత్తికి స్వవిషయాకారతాపత్తి భక్తి అని కొందరు ఆచార్యులన్నారు. తన ధ్యేయవస్తువుతో చిత్తవృత్తి తదాకారము చెందిపోవుటే భక్తి. ప్రాణప్రయాణసమయంలో యీ స్థితి రావాలంటే యోగబలం కూడా తోడై వుండాలె. మనుష్యుడేదో ఒక మహాబలాన్ని ఆశ్రయించి వున్నప్పుడే సంకటాలనుండి బైటపడ్తాడు. యోగమనగా అభ్యాసయోగం. ఆ అభ్యాసయోగంతో సాధకునికి ఒక శక్తి కల్గుతుంది, ప్రాణసంచాలనంపై — ప్రాణ నిరోధంపై వానికి అధికారం యేర్పడ్తుంది. దానినే యోగబలమంటారు. ఈ యోగబలం సమాధికి విఘ్నకారకాలైన వ్యుత్థానసంస్కారాలను — బహిర్ముఖప్రవృత్తిని నశింపజేస్తుంది. అట్టి యోగి భూమిజయ ఆసనజయ యింద్రియజయ ప్రాణజయ మనోజయాది భూమికాజయక్రమంతో అనాహతచక్రస్థానమగు హృదయపుండరీకాన్ని చేరి ప్రాణాలను అచ్చట నిల్పుతాడు. అటనుండి సుషుమ్నా నాడీమార్గంగా భ్రూమధ్యంలో ప్రాణాలను సావధానంగా స్థాపిస్తాడు. ఆ భ్రూమధ్యాన్ని ఆజ్ఞాచక్రమని ద్విదళమని త్రికూటమని అంటారు. అక్కడి నుండి బ్రహ్మరంధ్రం ద్వారా యోగి ప్రాణోత్క్రమణం సాగిస్తాడు. ఈ విషయాలు విస్తారంగా ఆత్మపురాణం యేకాదశాధ్యాయంలో చెప్పబడినవి. అంతు యీ విషయం సాధనసాపేక్షమైంది. పుస్తకాలు చూచి అభ్యసించేదికాదు; అలాచేస్తే లాభానికి బదులు నష్టం సంభవింపవచ్చు.

ఆజ్ఞాచక్రసమీపంలో సప్తకోశాలున్నవి. ఇందు బోధినీ — నాద - అర్ధచంద్రికా - మహానాద - కలా - ఉన్మనీ, అంటూ వీటిపేర్లు. జీవుడు ప్రాణసహితంగా ఉన్మనీ కోశంలో ప్రవేశించినప్పుడు పరమపురుషుని పొందిపోతాడు. భ్రూమధ్యమొక సంధిప్రదేశం. దానికి క్రింది దేశం ప్రకృతికి చెందింది. పైది పరమాత్మునికి చెందింది. భ్రూమధ్యం గడప

లాంటిది. అక్కడ చేరుటే కష్టం. తర్వాత పరమాత్మసాక్షాత్కారానికి ఆయాసమూ - ఆలస్యమూ వుండదు. ఏదైనా ఒక విషయం జ్ఞప్తికి రాని పక్షంలో మనం భ్రూమధ్యస్థానాన్ని నొక్కి ఆ చోట ఆఘాతం కల్గిస్తాం. భ్రూమధ్యదృష్టిని అలవాటు చేసుకున్నవారు అచ్చట ప్రకాశ పుంజాన్ని దర్శిస్తారు. ఆవలవుండే పరమాత్మప్రకాశాన్ని భ్రూమధ్యమనే గడపదగ్గరినుంచే మనం చూడవచ్చునన్న మాట.

ఈ శ్లోకంలో చెప్పిన 'యోగబలంతో కనుబొమ్మల నడుమ ప్రాణాలను లెస్సగా ప్రవేశపెట్టవలె' నను విషయం యోగాభ్యాసానికి సంబంధించింది. భ్రూమధ్యంలో ప్రాణాలను చేర్చుట అంటే యెట్లు? ఈ శంక పలువురికి కల్గుతుంది. ప్రాణమనిన శ్వాస అని, దానిని కను బొమల మధ్య పెట్టవలెనని అర్థం చెప్పుకోడంతో యీ శంకకు స్థానం యేర్పడింది. సూక్ష్మశరీరంయొక్క క్రియాశక్తిని ప్రాణమనియు, జ్ఞాన శక్తిని ప్రజ్ఞయనియు వైదికవాఙ్మయం వ్యవహరించింది. ప్రాణం ప్రజ్ఞతో జతకూడియే వుండి వెళ్లునపుడు ప్రజ్ఞతో కూడియే శరీరాన్ని వదలిపోతుంది. కాబట్టి యిచ్చట ప్రాణమును ప్రవేశపెట్టుట అనినను చిత్తమును ప్రవేశపెట్టుట అనినను ఒక్కటే. చిత్తమును ఆయా స్థానా లలో సంయమం చేస్తే ఆయా ప్రత్యేకసిద్ధులు లభిస్తవని యోగులమాట. కాని యిక్కడ, పరమేశ్వరునే చింతిస్తూ అన్యచింతలను మానుమని చెప్ప బడింది. ఇది ధ్యానరూపమగు ధారణాయోగం. ఈ ఉపాసకులకు చిత్తం వశీకృతమై వుండడంబట్టి వీరు సుషుమ్నానాడీ మూలంగానే ఉత్క్రమణం చేస్తారు. ఉపాసకులుకానీ కాకపోనీ, ప్రాణప్రయాణసమయంలో యింద్రియవ్యాపారాలు స్తంభించుట యిద్దరికీ సమానమే. కాని ఉపాస కులు కానివారు కర్మవశులై నేత్రము మొదలగు అధోద్వారాల గుండా ప్రాణాన్ని వదలి మరలి జన్మాంతరం పొందుతారు. ఉపాసకులలో హృద యాగ్రమందలి ప్రకాశాన్ని సహాయంగా పొంది మోక్షనాడిద్వారా ముందుకు పయనిస్తారు. అట్టివారు ఒక్కొక్కభూమికను జయిస్తూ పైకి పైకి పోవుమార్గం సూచిస్తూ యిచ్చట, భ్రూమధ్యంలో ప్రాణాలను ప్రవేశపెట్టవలెననుమాట చెప్పబడింది.

ప్రియమైన ఆత్మబంధువులారా!

భగవద్గీత యెనిమిదవ అధ్యాయం పదవ శ్లోకంవరకూ మీరు విన్నారు. భగవంతుడింతవరకూ మరణకాలంలో భగవద్భావన కల్గి వుండాలంటూ ఆ పద్ధతిప్రకారాలను విశదీకరించాడు. కాని తంత్రంతో పాటు మంత్రమూవుండాలె. భగవంతుని యే నామంతో యే మంత్రంతో చింతించాలె? ఈ శంక వుండనేవుంది. భగవంతునికి అనేకనామాలు. రామ కృష్ణ శివ శంకర-మరి యే నామంతో భగవంతుని స్మరించాలె? ఈ నామాలన్నీ భగవంతుని యేకదేశీయస్వరూపాన్ని సూచించేవి. కాబట్టి వీటినన్నిటిని ప్రస్తావించక భగవంతుడు అర్జునునికి ప్రణవాన్ని ఉపదేశిస్తూ న్నాడు. ఓంకారమని చెప్పబడే ప్రణవం, పరమాత్ముని సమగ్రస్వరూ పాన్ని సూచిస్తుంది. 'ఓం'కారం పరమాత్ముని వాచకమూ-ప్రతీకమూ కూడా. పరమేశ్వరునిలోగల అన్నిశక్తులను ప్రణవం ప్రదర్శించ గల్గు తుంది. శ్రీరామునికి రూపం వేరు. 'రామ' అనే రెండు అక్షరాలుగల మంత్రం వేరు. రూపాన్ని ప్రతీక మంటారు. మంత్రాన్ని వాచకమం టారు. విష్ణువుకు సాలగ్రామం ప్రతీకం. వాచకం 'విష్ణు'వనే శబ్దం. ప్రతిచోటా ప్రతీకం వాచకం భిన్నభిన్నంగా వుంటవి. ప్రతీకం ధ్యానానికీ, వాచకం జపానికీ ఉపకరిస్తవి. ఇచ్చట ఓంకారం మాత్రం వాచకమూ అదే. ప్రతీకమూ అదే. దానినే జపించవచ్చు; దానినే ధ్యానమూ చేయవచ్చు. "తస్య వాచకః ప్రణవః" — అని పతంజలిమహర్షి, ప్రణ వాన్ని పరమేశ్వరునికి వాచకంగా పేర్కొన్నాడు.

కొందరు యీ శ్లోకంనుండి వేరేప్రకరణం ప్రారంభమైందంటూ చెబుతారు. వారు చెప్పే ధోరణి యెలాగంటే - యీ అధ్యాయంలోని అయిదు ఆరు యేడు శ్లోకాలు అంత్యకాలంలో పరమాత్ముని భావన తప్పనిసరి వుండాలంటూ ప్రబోధించాయి. ఆ శ్లోకాలకు నిర్గుణపరంగా గాని సగుణపరంగాగాని యెలాగైనా అధికారిభేదాన్నిబట్టి అర్థం చెప్పుకోవచ్చు. అదొక్క ప్రకరణం. తర్వాత యెనిమిది తొమ్మిది పదవ శ్లోకాలు అధియజ్ఞుడని అంతర్యామియని చెప్పబడే సగుణ నిరాకార పర మాత్మయొక్క చింతనాన్ని తత్స్వరూపాన్నీ వర్ణించాయి. పదకొండో

శ్లోకం నుండి జ్ఞానయోగులకు సంబంధించిన నిర్గుణ నిరాకారోపాసన చెప్ప బడ్తూంది. పదకొండు పన్రెండు పదమూడు శ్లోకాలు కలిసి ఒక ప్రక రణం. ఈ విధంగా కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. కాని అందరి సమ్మతంకాదు. మొత్తం చాలమట్టుకు యీ అధ్యాయం సగుణబ్రహ్మో పాసననే — ధ్యేయబ్రహ్మోపాసననే చెప్పింది. సగుణబ్రహ్మోపాసకులకు సాక్షాన్ముక్తి లేదు కాబట్టి, వారికి లభించేది క్రమముక్తి కాబట్టి, క్రమ ముక్తిమార్గమైన అర్చిరాదిమార్గాన్నికూడా తర్వాత తర్వాత యీ అధ్యాయంలో చెప్పవలసిన అగత్యం యేర్పడింది. అర్చిరాదిమార్గాన్ని చెబుతూ తద్భిన్నమై పునరావృత్తి శీలమైన ధూమాదిమార్గాన్ని సైతం ప్రసంగవశాత్తు - సందర్భోచితంగా చెప్పివున్నారు. స్వామిబోధిస్తూన్నారు. వినండి.

> "యదక్షరం వేదవిదో వదంతి
> విశంతి యద్యతయో వీతరాగాః।
> యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
> తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥"

ఇదే శ్లోకం పూర్వార్ధం అర్థతః, ఉత్తరార్ధం శబ్దశః కఠోపనిషత్తులో వచ్చింది. అసలు భగవద్గీత ఉపనిషత్ సారమే గదా! ఈ శ్లోకంలోని నాల్గుచరణాలలో మొదటి చరణంలోని 'అక్షర' శబ్దం, చివరిచరణంలోని 'పదం' అనేశబ్దం, ప్రణవమూ పరబ్రహ్మమూ యీ రెంటికీ అర్థాన్నిచ్చే శబ్దాలు.

వేదవేత్తలగు జ్ఞానులు ఆ పరబ్రహ్మాన్ని అక్షరమని చెబుతూ న్నారు. అక్షరమనగా అవినాశి-నశించనిదని అర్థం. అణువని స్థూల మని యెట్టి విశేషాలూలేని బ్రహ్మమునకు అక్షరమని పేరు. వేదవేత్తలు అలా చెబుతారు. వేదవేత్తలంటే వేదమును పఠించినవారనికాని — వేద మనబడే జ్ఞానమును సంపాదించినవారనికాని — వేదప్రతిపాద్యమైన బ్రహ్మ మును తెలిసినవారనికాని అర్థాలు చెప్పుకోవచ్చు. బ్రహ్మమును గురించి చెప్పేయోగ్యత వేదవేత్తలకుమాత్రమేవుందని యీ మాటలోని ఆంతర్యం. ఈ విషయం చెప్పే యోగ్యత ప్రతివానికీ లేదు. 'వాచా బ్రహ్మంబు

పల్కవద్దుర వేమా!' అన్నాడు మహానుభావుడు వేమన్న. దీనిని అనుభవజ్ఞులైన పెద్దలుమాత్రమే చెప్పగల్గుతారు. కేవలం చెప్పడం మాత్రమేకాదు; విరాగులై యత్నశీలురైన సన్యాసులు ప్రవేశించేస్థానం కూడా ఆ పరబ్రహ్మమే. ప్రవేశించుట అంటే మీరు యింటినుండి బయలుదేరి హోటల్లో ప్రవేశించినట్లు ప్రవేశించడంకాదు. పాము పుట్టలో ప్రవేశించినట్లు ప్రవేశించుటకాదు. పరబ్రహ్మం తన స్వరూపానికంటె భిన్నంకాదని స్వాత్మరూపంగా తెలుసుకునుటే ప్రవేశించుట. దీనిని ప్రాప్త రూపప్రాప్తి అంటారు. పరబ్రహ్మం మొదటినుండి ప్రాప్తించే వుంది. అజ్ఞానంతో దూరమైంది. పరోక్షంగా వుండిపోయింది. వైరాగ్యంతో కూడి సాధన చేస్తూ రాగారాగా ప్రతిబంధాలు తొలగి అజ్ఞానం — భ్రాంతి నివారించేసరికి పరబ్రహ్మానికంటె తాను భిన్నంకాదనే అభేదజ్ఞానం కల్గి పోయింది. ఇదే ప్రవేశించుట. ఈ స్థితి రావాలంటే నిరంతర ప్రయత్న శీలత వుండాలె. దానికి తోడు వైరాగ్యం వుండాలె. వైరాగ్యమంటే రాగం లేకుండుట; ఏ వస్తువునందూ ఆసక్తి లేకుండుట. రాగం చిత్త మాలిన్యం. వైరాగ్యం చిత్తశుద్ధి. సంన్యాసులంటే కేవలం కావిగుడ్డలు కట్టినవారనికాదు. వైరాగ్యమూ యత్నశీలతా వుండేవా రెవరైనా సంన్యాసులే. అసలు భగవద్గీతకు కర్మసంన్యాసంకంటే కామనాసంన్యా సంపై పక్షపాతం మెండు. ఆ పరబ్రహ్మాన్ని సంన్యాసులు పొందుతూన్నా రని చెప్పడంమాత్రమే కాదండీ! ప్రతి ముముక్షువూ చేరవలసిన గమ్యం కూడా అదే. ముముక్షువులు బ్రహ్మచర్యవ్రతాన్ని ధరించి ఆ పరబ్రహ్మ మును తెలుసుకునుటకు వాంఛిస్తూంటారు. బ్రహ్మచర్యమనేమాటకు విశాలమైన అర్థం — బ్రహ్మమునందు చరించుట లేదా బ్రహ్మప్రాప్తి సాధనలో చరించుట. అయినా వీర్యరక్షణమనే బ్రహ్మచర్యంకూడా ఉపేక్షణీయంకాదు. బ్రహ్మచర్యమనేమాట ఒక్క వీర్యరక్షణానికేగాక, సమస్తేంద్రియసంయమానికీ ఆ శబ్దాన్ని ఉపలక్షణంగా గ్రహించవచ్చు. ప్రతి ఆశ్రమంలోనివారూ యథాయోగ్యంగా బ్రహ్మచర్యాన్ని అవలం బించాలె. గృహస్థులైతే మాత్రం, విచ్చలవిడి విషయభోగాల ననుభవిం చుటకు వారికి 'లైసన్సు' దొరికి వుండలేదు. గృహస్థాశ్రమం కామ తృప్తికై కాదు; కామశోధనకై యేర్పడింది. నూనె వత్తిగుండా పైకి

పోతే తేజస్సైనతుంది; క్రిందికి జారితే గలీజైతుంది. వీర్యం పూర్ధ్వముఖమైతే జ్ఞానతేజస్సుగా పరిణమిస్తుంది. ముముక్షువులు బ్రహ్మచర్యవ్రతధారులై గురుకులాశ్రమంలో శ్రవణ మనన నిదిధ్యాసాలద్వారా పరబ్రహ్మపదాన్ని పొందుతారు. అట్టి బ్రహ్మవస్తువును సంగ్రహంగా ప్రవచిస్తానంటూ భగవంతుడర్జునునితో అంటూన్నాడు. ఆ బ్రహ్మాన్ని తద్వాచకమైన ప్రణవంద్వారా యెలా వుపాసించాలో ఆ విధానం చెబుతూన్నానంటూన్నాడు. పరబ్రహ్మప్రాప్తికి వేదాలను పఠించుట - ఆసక్తులను గెలుచుట — బ్రహ్మచర్యము నాచరించుట, కావలసిన సాధనలని యీ శ్లోకంద్వారా మనం తెలుసుకోవాలె. చెబుతానంటూ ప్రతిజ్ఞచేసిన విషయాన్ని సాధనసహితంగా భగవంతుడు ముందటి రెండు శ్లోకాలతో ప్రారంభిస్తూన్నాడు:

"అర్జునా! ఇంద్రియద్వారాలను అన్నింటిని సంయమంచేసి మనస్సును హృదయస్థానంలో నిరోధించి ప్రాణాన్ని శీర్షస్థానంలో స్థాపించి, ఆత్మ సంబంధమగు యోగధారణను అవలంబించినవాడై, యోగి ప్రాణప్రయాణసమయంలో 'ఓం' అనెడి యేకాక్షరబ్రహ్మాన్ని ఉచ్చరిస్తూ, తదర్థభూతమగు పరబ్రహ్మాన్ని చింతిస్తూ శరీరాన్ని వదలి ప్రయాణం చేస్తాడు. అట్టివాడు పరమగతిని ప్రాపిస్తాడు."

ఈ అధ్యాయంలోని పండ్రెండు పదుమూడు శ్లోకాలుకలిసి ఒకే అన్వయం. అనగా రెంటినికలిపి ఒకటిగా చదువుకోవాలె. పైన ఆ విధంగానే చెప్పబడింది. ఇంద్రియాలను ద్వారాలని చెప్పినారు. సర్వేంద్రియాలని చెప్పినపుడు అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు వెరశి దశేంద్రియాలను చెప్పినట్లు జ్ఞానేంద్రియాలు బైటివిషయాలను లోపలికి తీసుకొంటవి. కర్మేంద్రియాలు లోనిసంగతులను బైటికి వదలుతవి. రావలసినవి వచ్చేందుకు పోవలసినవి పోయేందుకు మార్గాలు కాబట్టి వీటిని ద్వారాలన్నారు. ఇంద్రియాలతోబాటు యింద్రియ గోళకాలను సహా ద్వారాలని చెప్పవచ్చు. మనయింటికి ద్వారాలు పెట్టుకొంటాం. వాటిగుండా రావలసినవాటిని రానిస్తాం; పోవలసినవాటిని పోనిస్తాం. కాని అడ్డదిడ్డంగా పందులను బర్రెగొడ్లను రానిస్తామా? లేదు. ఈ యింద్రియ

ద్వారాల విషయమో — అదుపూ ఆజ్ఞా లేకుండా పోయింది. అడ్డ దిడ్డంగా అన్నీ దూరడమే అలవాటై పోయింది. కాబట్టే 'యింటిలోని పోరు యింతింత కాదయా'— అని యేడ్వవలసి వచ్చింది. ఈ ద్వారాల నన్నిటీ సంయమం చేయుమన్నారు. కొన్నిటి సంయమంచేసి కొన్నిటిని నల్లుగా వదిత్తే లాభంలేదు. ఇచ్చట సంయమం చేయుమన్నారేకాని నిగ్రహిమ్మని చెప్పలేదు. నిగ్రహమంటే బిగబట్టి ఉగ్గబట్టి వాటిని బొత్తుగా నిర్వ్యాపారం చేసివెయ్యడం. సంయమ మంటే వానిని మనస్వాధీనంలో పెట్టుకొని నడపడం. నిగ్రహం ప్రాథమికసాధనం. తర్వాతిది సంయమం. ఒకనికి యిష్టానుసారం వాగే దురలవాటుంది. ఆ వాక్చాపల్యాన్ని నివారించేకోసం అతడు మౌనమంటూ నియమం పెట్టుకొని నిగ్రహం సాధిస్తాడు. ఎప్పుడూ నిగ్రహం పనికిరాదు. అలాచేస్తే భగవంతుడిచ్చిన వాక్కే— వ్యర్థమైపోతుంది. డాక్టరు మందు తూచియిచ్చినట్లు, ఆచి తూచి తగినట్లు మాట్లాడగల్గితే వాక్సంయమం వానికి చేకూరిందన్న మాట. ప్రపంచంలో మట్టుమర్యాదలేకుండా అతిగా మాట్లాడేవారూ వున్నారు. బిర్రబిగించుకొని బొత్తుగా మాట్లాడకుండా వుండేవారూ వున్నారు. ఆచినట్లు తూచినట్లు మితంగా హితంగా మాట్లాడగల్గే మహనీయులుమాత్రం మరింతా విరళం. సంయమమనే మాటకు యిదీ అర్థం. దీనినే యోగశాస్త్రంలో ప్రత్యాహారమంటారు. అన్ని ఆహారాలలో ప్రత్యాహారం శ్రేష్ఠమైన ఆహారం. ఇంద్రియాలు వాటివాటి విషయాలలో ప్రవర్తించకుండా విషయాలలోని దోషాలను నిరూపిస్తూ వాటిని సంయమం చేయాలె. పైటి యింద్రియాలను లోబరుచుకొని లోపలి మనస్సుతో విషయచింతనం చేస్తే లాభంలేదు. వాడు మిథ్యాచారి అవుతాడు. కాబట్టి ఆ దోషం వుండరాదని భగవంతుడు అభ్యాస వైరాగ్యాలద్వారా మనస్సును హృదయంలో నిరోధించుమంటున్నాడు. హృదయం ప్రాణానికీ మనస్సుకూ నివాసస్థానం. మనస్సు ఆ చోటచేర్తే తన చలనాన్ని ఉడుగుతుంది. మనస్సు విషయచింతనంచేయక ఆత్మ చింతనం - దైవచింతనం చేస్తూంటే మనస్సు హృదయంలో చేరిందంటూ మనం భావించాలె. హృదయంలో చేరినప్పుడు మనస్సు విశేషవృత్తి శూన్యమైతుంది. ఈ విధంగా బాహ్యద్వారాలైన యింద్రియాలనూ,

అంతర్ద్వారమైన మనస్సునూ నియమించి, తర్వాత క్రియాద్వారమైన ప్రాణాన్ని ముందుచెప్పిన సుషుమ్నానాడీమూలంగా ఒక్కొక్క భూమికను దాటిస్తూ భ్రూమధ్యంనుండి మస్తకానికి చేర్చాలె. ప్రాణాలతో సహా మనస్సుకూడా ఆ చోట నిశ్చలమై నిలుస్తుంది. అనంతరం ఆత్మ సంబంధమగు యోగధారణను అవలంబించాలె. తాను అవలంబించే యోగధారణ ఆత్మకు — పరమాత్మకు సంబంధించిందై వుండాలె; కాని క్షుద్రదేవతలకు సంబంధించి — భౌతికసిద్ధులకు సంబంధించిందై వుండరాదని అర్థం.

'ఓం' అనే ఏకాక్షర బ్రహ్మాన్ని ఉపాసకుడు ఉచ్చరించాలె. ఏకాక్షరమనుమాట ఓంకారానికీ విశేషణమైతుంది; పరబ్రహ్మానికీ విశేషణమైతుంది. ఏకాక్షరం అంటే, ఒకే అక్షరమంటూ ఓంకారానికి చెప్పే అర్థం. ఒకే అక్షరమని చెప్పుటలో, అనాయాసంగా ఉచ్చరించుటకు సౌలభ్యం కలదని సూచింపబడింది. ఒకే అక్షరం కదా యెంత సులభం? అని చెప్పినట్లు. పరబ్రహ్మపరంగా ఏకమూ అక్షరమూ అని అర్థం. ఓంకారం పరబ్రహ్మానికి శ్రేష్ఠమైన వాచకం కాబట్టి పరబ్రహ్మప్రాప్తికి ఉత్తమమైన సాధనంకూడా. సాధనాన్ని యిచ్చుట సాధనమాత్రంగా చెప్పక, అదే సాధ్యంగా చెప్పివేశారు. వాచకానికి వాచ్యానికి, నామానికి నామికి అభేదం చెప్పబడింది. 'ఆయుర్వైఘృతం' — ఆయుస్సే ఘృతం — అని వేదం చెప్పింది. ఘృతం ఆయుస్సును కల్గించేది అని చెప్పక, ఘృతమే ఆయుస్సని చెప్పినట్లు, వాచకమైన ఓంకారమే సాక్షాత్తు వాచ్యమైన బ్రహ్మమంటూ చెప్పబడింది.

ఇంద్రియాలు నిరోధింపబడివుండగా ఓంకారోచ్చారణం యెలా జరుగుతుందని సందేహం చెందవచ్చు. ఉచ్చారణం వాక్కుతో కాదు, మనస్సుతోనే ఉచ్చారణం జరుగుతుంది. 'జపతో నాస్తి పాతకం' — వట్టి జపం చేస్తే పాపంమాత్రం పోతుంది. పరమాత్మప్రాప్తి యెలా సంభవిస్తుంది? అందుకయ్యే, ఉచ్చారణతో బాటు అర్థానుసంధానం కూడా భగవంతుడు సెలవిచ్చాడు. ఓంకారంతో చెప్పబడే పరమాత్మను అనుస్మరించాలె. 'తజ్జపస్తదర్థభావనం' — ఓంకారమును జపించవలెను;

దాని అర్థాన్ని భావన చేయాలంటూ పతంజలి తన యోగసూత్రాలలో చెప్పినాడు. ఓంకారాన్ని జపిస్తూ ఆ మంత్రార్థమైన పరమాత్ముని భావనచేయుట, ఈ రెండు పనులూ ఒకేసారి యెలా చేయుట అని కొందరు శంకించవచ్చు. కాని అభ్యాసబలంతో మనస్సు ఆ రెంటినీ చేయగల్గుతుంది. మంత్రార్థాన్ని భావనకు తెచ్చుకోడం, మంత్రజపానికి మరింత సహాయకం కాగలదుకూడ.

మంత్రజపంతో మాంసమయశరీరం మంత్రమయమైతుంది. ఈ మాంసమయశరీరం మంత్రమయంకానిదే పరమార్థానికి పనికిరాదు. పచ్చికుండ ఉపయోగానికి పనికిరాదు; కాలిన తర్వాతనే పనికివస్తుంది. పచ్చికుండ పగిలితే ఆ మట్టితో మరొక్కకుండను తయారుచేయవచ్చును. కాలితే వల్లగాదు. ఆలాగే మాంసమయశరీరం పునరుత్పత్తి కల్గిస్తుంది. మంత్రమయశరీరానికి పునరుత్పత్తిలేదు. సాధకుడు జపసాధనతో మంత్రమూర్తియై తరిస్తాడు.

"ఉపాసకుడు శరీరాన్నివదలి ప్రయాణం చేస్తాడు" — భగవంతుడు చెప్పిన యీ మాటలో ఉపాసకుల దేహత్యాగం అంత అవలీలగా అనాయాసంగా వుందన్నమాట. సామాన్యజనులకు దేహాభిమానం బలంగా వుండడంబట్టి, పోలీసువాడు దొంగను బలవంతంగా బైటికి లాగినట్లు, కాలకర్మపాశంతో సంకటపడ్తూ బయటికి ప్రయాణం చేస్తారు. ఉపాసకులు యీ యింటిలోనుండి ఆ యింటిలోనికి వెళ్లినట్లు సుఖంగా ప్రయాణంచేసి పరమగతిని పొందిపోతారు. ముక్తిని పొందుతారు.

ఓంకారాన్ని ఉచ్చరిస్తూ పరమేశ్వరుని స్మరిస్తూ దేహాన్ని వదలినవారు పరమగతిని ప్రాపిస్తారంటూ యింతవరకు చెప్పబడింది. ఉపనిషత్తులు ముక్తికి రెండు వుపాయాలు చెప్పినవి. జ్ఞానంతో అనాత్మసంబంధమైన అనర్థాలనుండి విడివడి యిచ్చటే ముక్తిని బొందుట ఒక మార్గం. ఉపాసనద్వారా ధ్యానంద్వారా శరీరాన్ని వదలిన తర్వాత బ్రహ్మలోకం వెళ్లి అచ్చట జ్ఞానం బొంది ముక్తి నొందుట రెండవమార్గం. మొదటిది సద్యోముక్తి. రెండవది క్రమముక్తి. రెండవ పద్ధతిలో యింద్రియాలను సంయమించి మనస్సును ఉపసంహరించి, బ్రహ్మరంధ్రానికిచేర్చి ఓంకారో

చ్చారణపూర్వకంగా పరమాత్మని స్మరిస్తూ శరీరపతనానంతరం సాధకుడు పరమాత్మను చేరగల్గుతాడు. అసలు కర్మయోగమే కష్టమైంది. ధ్యానయోగం మరింతా కష్టం. అయినా పరమాత్ముని అనుగ్రహంతో సాధకునికి సులభసాధ్యమైతుంది.

జీవితాన్ని వశవర్తిగా నడుపుకోగల్గినవారు మరణాన్ని సైతం వశవర్తిగా మలచుకోగల్గుతారు. జీవితానికొక ఆధారం, మరణానికొక స్మరణ వుంటే శాంతితో బ్రతికి శాంతితో మరణించి పరమాత్మనిలో వారు కలిసిపోతారు. "అనాయాసేన మరణం – వినా దైన్యేన జీవనం। దేహాంతే తవ సాయుజ్యం – దేహి మే జగదీశ్వర!" అంటూ ఒక భక్తుడిలా కోరనే కోరాడు.

"కృష్ణా! నీవేమో బ్రహ్మాండంగా చెప్పుకపోతూన్నావు. ప్రాణాన్ని బ్రహ్మరంధ్రంలో పెట్టమంటావ్. మనస్సును హృదయంలో చేర్చమంటావ్. సర్వద్వారాలను సంయమం చేయమంటావ్. తగుదునంటూ అంతటి సన్నాహాన్ని సమకూర్చుకుని చేసే అవకాశం నాకెక్కడిది? యుద్ధం చేస్తూ చేస్తూ యేక్షణం మృత్యుఘంట మ్రోగుతుందో యెలా చెప్పగల్గడం? స్వామీ! నామాటేకాదు. మీరు చెప్పిన పథకం ప్రపంచంలో యెంతమందికి అనుకూలిస్తుంది? పుణ్యాత్ములైన సుఖపురుషులకు అన్ని సౌకర్యాలు లభిస్తవి కాని – ప్రపంచంలో దరిద్రులున్నారు. విశ్రాంతిలేక బ్రతుకుకోసం పాటుపడే శ్రమజీవులూ వున్నారు. వారి గతేమి? వారిని యోగం చేయమంటే – పాపం! వారేమి చేస్తారు? యోగాభ్యాసికి ఆహారవిహారాలలో చక్కని వ్యవస్థ వుండాలె. ఏకాంత ప్రదేశం కావాలె. విక్షేపకారణాలంటూ వుండరాదు. రోగబాధ లుండరాదు. అబ్బో! దానికథ బోలెడు కంబరామాయణం. దేవా! జ్ఞానం - ఆత్మజ్ఞానం మాత్రం యేమంత సులభమా? కాదే! నూటికి కోటికొక్కడు ఆత్మజ్ఞానం పొందగలిగేది. తక్కినవారు తరించేమార్గం లేదా? నీ దర్బారులో దర్జామనుష్యులకేనా ప్రవేశం? దీనులను దిక్కులేనివారిని పల్కరించే పని లేదా!!"—

"సెభాష్! అర్జునా! భలే అడిగావు. నా ఆస్థానద్వారం యెప్పుడూ తెరువబడే వుంటుంది. కాని రావాలనే కోర్కెవుంటే చాలు

గొప్పవారినీ చేర్చుకుంటాను, తక్కువవారినీ చేర్చుకుంటాను. గొప్పవారు – వారు గొప్పవారు కాబట్టి చేర్చుకుంటాను. తక్కువవారు – వారు తక్కువవారు కాబట్టి, పాపం! వారినికూడా చేర్చుకుంటాను. భయపడ వలసిన పనేమీలేదు.

"అనన్యచేతాస్సతతం - యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ! - నిత్యయుక్తస్య యోగినః ॥"

ఇదో సులభోపాయం చెబుతూన్నావిను. అనన్యచిత్తంతో నిత్యయుక్తుడై సతతమూ నిత్యశః నన్ను స్మరించవలసి వుంటుంది. అట్టి యోగి ప్రాణా లను స్వాయత్తంగా వదలనీ – పరాయత్తంగా వదలనీ, ఊర్ధ్వద్వారం గుండా పోనీ మరోద్వారంగుండా పోనీ, వాడు నన్ను చేర్తాడు. అట్టివానికి నేను సులభంగా లభిస్తాను. నన్ను మరువనివాన్ని నేనూ మరువనయ్యా! నేనేమీ కోరడం లేదే. చిత్తాన్ని నాకిమ్మంటూన్నాను. నీకు శక్తిలేకుంటే పోనీ! యోగంవద్దు. జ్ఞానంవద్దు. కానీ, అనన్యచిత్తంతో నన్ను స్మరిం చేందుకు శక్తిలేదా! మనుష్యుడు తన చిత్తాన్ని యెవరికో ఒకరికి యిచ్చే వున్నాడు. కొందరు భార్యల కిచ్చినారు. కొందరు బిడ్డల కిచ్చినారు. కొందరు ధనాని కిచ్చినారు. కొందరు పేరు ప్రతిష్ఠల కిచ్చినారు. కొందరు సినిమాల కిచ్చినారు. ఏదో ఒక రకంగా యిచ్చేవున్నారు. భగవంతుని కివ్వాలంటేమాత్రం వచ్చింది పెద్దప్రళయం. తరించడమంటే తేరకు తోటకూరనుకున్నావా?"

పడవ యెట్లెట్లు తిరుగుతూన్నా దిక్సూచి ఉత్తరంవైపే చూపు తూంటుంది. శరీరేంద్రియాలు ఏ యే పనులు చేస్తున్నా భక్తుని చిత్తం భగవదాయత్తమయ్యే వుంటుంది. పతివ్రతాస్త్రీ అన్నిటినీ ప్రేమిస్తూన్నా అత్యంతం నిరతిశయప్రేమ పతిపైననే. అట్లే భక్తునికి ప్రేమింపదగిన వస్తువొక్క భగవంతుడే. భగవంతుని ప్రేమను సంపాదించాలంటే, మొత్తం మన ప్రేమను ఆయనకు సమర్పించాలె. కొంతప్రేమ భగవంతు నికీ కొంతప్రేమ ప్రపంచానికీ యిస్తామంటే - యీ బేరం సాగదు. రాము డేలే చిత్తంలో కాముడు లేడు. కాముడేలే చిత్తంలో రాముడుండడు. ఇద్దరికీ రాజీచేసేమాట కుదరదు. ఒక వ్యక్తి తన వంటమనిషిని పిలిచాడు.

"అరే! ఈ రోజు కోడిపెట్టను సగంకోసి కూరచేసి, తక్కిన సగం గ్రుడ్లు పెట్టేటందుకు వుంచమన్నా"డట. వంటవాడన్నాడు: "బాబూ! తిండి మీద ఆశవుంటే గ్రుడ్లమీద ఆశ మానుకోవాలె. గ్రుడ్లమీద ఆశవుంటే తిండిమీద ఆశ మానుకోవాలె. మీరు అవ్వా కావాలె బువ్వా కావాలంటారు. ఈ పప్పు వుడకదండీ!".

అనన్యచిత్తమనే మాటలో శ్రద్ధ సూచింపబడింది. 'సతతం' అనే మాటలో యెడబాటు వుండగూడదనే అర్థం చెప్పబడింది. 'నిత్యశః' అనే పదంలో, యిన్నిరోజులు యిన్ని నెలలు యిన్ని సంవత్సరాలు అనికాక జీవిత పర్యంతం అనుష్ఠించాలని దీర్ఘకాలాభ్యాసంపై దృష్టి పెట్టబడింది. ఇట్టి వాన్ని నిత్యయోగి అని భగవంతుడు పేర్కొంటూన్నాడు. "దీర్ఘకాల నైరంతర్యసత్కారసేవితో దృఢభూమిః". అభ్యాసం చిత్తంలో బలపడాలంటే, ఆదరపూర్వకంగా దీర్ఘకాలం — నిరంతరం సాధన చేయాలని పతంజలి చెప్పినాడు. అభ్యాసం చిత్తంలో బలపడేటందుకు అలాచెప్పితే, భగవంతుడు చిత్తంలో నిలబడేటందుకు అంత పరిశ్రమపనిలేదా అని. కాబట్టి భగవత్ స్మరణకూడా ఆదరపూర్వకంగా దీర్ఘకాల నిరంతరం అభ్యసించాలె.

భగవంతుడేమో సులభసాధన అని చెప్పినాడు. కాని దీన్ని అనుసరించేవారుమాత్రం దుర్లభంగానేవున్నారు. ఆ దుర్లభంగా వుండేవారికి యిది సులభమేనేమో! ఉండవచ్చు.

అనన్యచిత్తము - సతతము - నిత్యము - నిత్యయుక్తత, యిన్ని మాటలు సాధారణంగా ఒకేఅర్థాన్ని సూచించేవి. సాధకుడు సాధనలో యేమాత్రం విసుగు — వేసరపాటు చేరనీరాదనే అభిప్రాయంతో భగవంతుడీ పదాలను ప్రయోగించినాడు. "స్వామీ! పండ్రెండేండ్లనుండి నేను జపం చేస్తున్నాను. ఇంకా యెన్నాళ్ళు చేయా"లంటూ ఒకభక్తుడు రమణమహర్షిని అడిగాడట. "నేను జపం చేస్తున్నాననే భావన మరచిపోయేవరకూ చేయాలె" - అని ఆయన జవాబు చెప్పినారట. ఇంతకూ, సాధన సహజసాధనకావాలె. దేహభావన మరచిపోయేవరకూ చేయాలె. విసుగూ వేసరపాటూ వుండరాదు.

"అనన్యచిత్తంతో సదా సర్వదా నన్ను స్మరించు"మంటూ భగవంతుడన్నాడు. భగవంతుడు నాకు అన్యంగాలేడు. ఆత్మే పరమాత్మ. అహం బ్రహ్మాస్మి—సోఽహం శివోఽహం. ఈ అనుసంధానం నిత్యనిరంతరం జరుగుతూండాలె. దీనినే అనన్యభావన అంటారు; నిత్యాయుక్తత అంటారు. శ్వాసపై నిగాపెట్టి అనుసంధానం చేయుమంటూ గురువులు శిష్యులకు చెబుతారు. ఆ పద్ధతి ననుసరించి అజపాయోగం ద్వారా, అహంగ్రహోపాసన ద్వారా, ప్రత్యగభిన్నపరమాత్మను స్మరిస్తూ ప్రతివాడూ భగవత్ప్రాప్తిని సాధించనచ్చు. అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారాన్ని వారు పొందవచ్చు.

"అర్జునా! అనన్య చిత్తంతో నన్ను స్మరించేవారికి నేను సులభంగా లభిస్తానని చెప్పితిని కదా! నన్ను పొందిన ఆ మహాత్ములు పరమసంసిద్ధిని చేరినవారై, దుఃఖాలయమూ అశాశ్వతమూనైన జన్మానికిరారు".

గతశ్లోకంలో అనన్యచిత్తంతో స్మరణ చేసేవారికి తాను సులభుడనంటూ భగవంతుడు చెప్పినాడు. తాను సులభుడైతే వచ్చే లాభమేమి? ఈ ప్రశ్నకు సమాధానం యీ శ్లోకంలో చెప్పబడ్తూవుంది. భగవంతుడు సులభుడైనాడంటే వారికి భగవత్ప్రాప్తి లభించిందన్నమాట. భగవత్ప్రాప్తి నొందినవారిని మహాత్ములంటారు. వారికి అల్పమైన దేహాభావం-జీవభావం లేదు. బ్రహ్మభావం భగవద్భావం కలవారు, కాబట్టి వారిని మహాత్ములన్నారు. వారి ఆత్మ పరిచ్ఛిన్నమైందికాదు. అపరిచ్ఛిన్నమైంది. వారి అంతఃకరణంలో రజస్తమోరూప మాలిన్యం తొలిగింది. శుద్ధమైన అంతఃకరణం కలవారు కాబట్టి వారు మహాత్ములు. వారు పరమసంసిద్ధిని బొందినారు. మోక్షం అన్నిసిద్ధులకు పరమసిద్ధి. కాబట్టే దానిని సంసిద్ధి అన్నారు. సిద్ధి అంటే అణిమాది అష్టసిద్ధులు. వాటికంటె ప్రత్యేకత చూపేకోసం మోక్షాన్ని సంసిద్ధి అంటారు. తమ ఉపాసనాబలంతో దేవయానమార్గంగుండా వారు బ్రహ్మలోకం వెళ్లుతారు. ఈ బ్రహ్మలోకాన్నే వైష్ణవులు వైకుంఠమని, శైవులు కైలాసమని, శాక్తేయులు శ్రీపురమని అంటారు. ఆ బ్రహ్మలోకంలో దివ్యభోగాలనుభవించి తత్త్వజ్ఞానాన్నిబొంది కైవల్యముక్తిని అనుభవిస్తారు. వారికి పునర్జన్మ

మంటూ లేదు. పునర్జన్మ దుఃఖాలయమని అశాశ్వతమని భగవంతుడు గర్హించాడు. జన్మసంబంధమైన దుఃఖాలను గర్భోపనిషత్తు పేర్కొంది. ఆధ్యాత్మికదుఃఖం ఆధిభౌతికదుఃఖం ఆధిదైవికదుఃఖం, ఈ త్రివిధ దుఃఖాలు ప్రతి జన్మలోను వెన్నంటే వున్నాయి. ఈ శరీరంలోనే కల్గి అనుభవానికి వచ్చే దుఃఖాలను, జ్వరం తలనొప్పి గజ్జి మొదలైనవాటిని ఆధ్యాత్మిక దుఃఖాలంటారు. శరీరానికి వెలుపల యింద్రియాలకు గోచరించే భూతాలవలన — తేలు పాము రాళ్ళు ముళ్లు మొదలగువాటివలన కలిగేదుఃఖాలను ఆధిభౌతికదుఃఖాలంటారు. శరీరం వెలుపల యింద్రియ గోచరంకాని భూతాలద్వారా కలిగే — భూకంపం పిడుగుపాటు తుపాను అతివృష్టి, అనావృష్టి వీటిద్వారా కలిగేదుఃఖాలు ఆధిదైవిక దుఃఖాలంటారు. జన్మకల్గినతర్వాత యీ దుఃఖాలు తప్పేవికావు. భగవత్ప్రాప్తి కలిగేవరకు జీవునికి జన్మపరంపరలు తప్పవు. ఈ జన్మాన్ని వదిలితే మళ్లీ జన్మం సిద్ధం. కర్మపరవశుడై దేవతా మనుష్య పశు పక్షి క్రిమి కీటక వృక్ష లతాది జన్మలలో ఉద్భవిస్తాడు. దీన్నే పునర్జన్మ అంటారు. ఏ జన్మలోకాని దుఃఖం వుండనేవుంది. చక్రవర్తికానీ గాక — తలపై కిరీటమేగాని తల నిండా సంకటాలే. మనం సుఖాలనుకొన్నవికూడా సుఖాభాసాలేకాని నిక్కంగా సుఖాలుకావు. పరిణామదుఃఖ తాపదుఃఖ సంస్కారదుఃఖాలతోకూడిన ప్రపంచవిషయాలు మొత్తం వివేకులకు దుఃఖంగానే భాసిస్తవి. ప్రపంచం అశాశ్వతమని చాటి చెప్పేకోసం ప్రత్యక్షసాక్ష్యం మృత్యువు వుండనేవుంది. వస్తువులే అనిత్యాలైనపుడు వాటివల్ల వచ్చే సుఖంమాత్రం యెంతవరకు స్థిరంగా వుంటుంది? ఈ నాడు సుఖం కల్గించే వస్తువులు కలకాలం సుఖదాయకాలుగానే వుండబోవు. శరీరంకాని ప్రపంచంకాని వస్తువులుకాని, మారిపోయేది వాటి స్వభావం కాబట్టి మరొకనాటికి దుఃఖదాయకాలుగా కావచ్చు. వస్తువును వదలి తానైనా పోవాలె. తన్నువదలి వస్తువైనా పోతుంది. ఇది తప్పేదికాదు. కాబట్టి వస్తువియోగకాలంలో దుఃఖం తప్పదు. ప్రపంచంలో కొఱతలేని మానవుడంటూ లేడు. కొఱత కనపడ్తూండేవరకు దుఃఖం సతాయిస్తూనే వుంటుంది. పరమాత్మునితో పోల్చి చూచినపుడు ప్రపంచమూ ప్రపంచ సుఖాల్లూ అత్యంతతుచ్ఛమూ దుఃఖపూర్ణంగానూ గోచరిస్తవి.

భగవంతుని సందేశాన్ని మనం విన్నాం. భగవత్ప్రాప్తి చెందిన మహాత్ములుతప్ప తక్కిన జీవులందరూ జన్మసంసారదుఃఖానికి పాల్పడ వలసిందే. ఏతంబానలాగా క్రిందికి మీదికి తిరుగక తప్పదు. ఈ విష యాన్నే భగవంతుడు మరొక్కవిధంగా బోధిస్తూన్నాడు:

"అర్జునా! బ్రహ్మలోకపర్యంతం యేలోకానికి వెళ్లినా తిరిగి రావలసే వుంటుంది. కాని, కౌంతేయా! కాలాతీతుడనైన నన్ను చేరిన వారు మాత్రం పునర్జన్మ పొందవలసిన పనిలేదు."

భగవానుడీశ్లోకంలో అర్జునుని వుద్దేశించి రెండు సంబోధనలను వాడినాడు. 'అర్జునా' అను మాట స్వాభావికంగా నీవీ తత్త్వానికి అధికారివని సూచించుటకై వాడబడింది. 'కౌంతేయా' అనుమాట వంశక్రమాన్ని బట్టికూడ నీ యోగ్యత ఉత్తమమైనదని సూచించుటకై చెప్పబడింది. ఈ రెండు యోగ్యతలూకలవాడు కాబట్టే చెప్పిన బోధను స్వాయత్తం చేసుకునేశక్తి అర్జునునికి కల్గింది.

ఈ అధ్యాయంలో యిది పదారవశ్లోకం. దీనిలో 'ఆబ్రహ్మ భువనాల్లోకాః' అని ప్రయోగం జరిగింది. 'బ్రహ్మలోక పర్యంతమైన లోకాలు' అని దీనికి అర్థం. బ్రహ్మలోకంతోసహా అన్నిలోకాలు నశించి పోయేవే; పునరావృత్తి కలవే — అని ఒక అర్థం. బ్రహ్మలోకంవరకుగల లోకాలు పునరావర్తనం గలవి; బ్రహ్మలోకం మాత్రం అలాకాదు — అని ఒక అర్థం. బ్రహ్మలోకపర్యంతమను మాటకు యీ విధంగా రెండు విధాలైన అర్థాలను గ్రహించడం కద్దు. ఈ చోట శ్రీరామతీర్థ స్వాములవారి పట్టశిష్యులు శ్రీ నారాయణస్వాములవారు తాము వ్రాసిన 'భగవదాశయార్థదీపిక'లో క్రిందివిధంగా వెల్లడించినారు:

"ఆబ్రహ్మభువనాల్లోకాః" = బ్రహ్మలోకపర్యంతం అన్ని లోకాలు పునరావృత్తి కలవే. ఇక్కడ 'ఆబ్రహ్మభువనాత్' లోని 'ఆ' అనే శబ్దం రెండు అర్థాలను యిస్తుంది. 'సహితం' అని ఒక అర్థం. ఉదాహరణం: 'ఆబాలగోపాలం' = బాలకుల సహితంగా, అనినట్లు. 'వరకు' అని మరొక్కఅర్థం. 'ఆపర్వతం వృష్టిః'=పర్వతంవరకు వృష్టి. పర్వతంమీద లేదు. పర్వతంవరకే."

ఈ విధంగా రెండువిధాలైన అర్థాలున్నా, "ఆబ్రహ్మభువనా ల్లోకాః" అనుచోట "బ్రహ్మలోక సహితంగా" అనే అర్థాన్నే చాల మంది చెప్పినారు. శ్రీశంకరులవారు శ్రీ ఆనందగిరి శ్రీ మధుసూదనసర స్వతి శ్రీధరస్వామి శ్రీచిద్ఘనానందగిరి శ్రీజ్ఞానదేవుడు శ్రీలోకమాన్య తిలక్ ప్రభృతులీ అర్థాన్నే గ్రహించారు. ఒకరిద్దరు ద్వైతపండితులు, ఒకరిద్దరు ఆర్యసామాజికులుమాత్రం 'వరకు' అనే అర్థాన్ని చెప్పినారు. మొదటివారు 'బ్రహ్మలోక సహితం'గా అర్థం చెప్పినారు. రెండవవారు 'బ్రహ్మలోక రహితం'గా అర్థం చెప్పినారు. ఈ రెండు అర్థాలు పరస్పర విరోధాలు కావు. ఆయాసందర్భాలలో సత్యాలే.

బ్రహ్మలోకం వెళ్లినవారికి పునరావృత్తి లేదని ఉపనిషత్తులలో — బ్రహ్మసూత్రాలలో చెప్పబడింది. పునరావృత్తి యెవరికిలేదు? ఉప నిషత్తులలో ముక్తి రెండువిధాలుగ చెప్పబడింది. ఒకటి సద్యోముక్తి. రెండవది క్రమముక్తి. సద్యోముక్తినే కైవల్యముక్తి అంటారు. ఈ లోకంలోనే — యీ జన్మలోనే తత్త్వసాక్షాత్కారంద్వారా కైవల్య ముక్తిని — సద్యోముక్తిని పొందినవారు యేలోకానికీ పోవలసిన పని లేదు. వారు యిక్కడిక్కడే ముక్తులైనారు. ఇక్కడే తత్త్వజ్ఞానాన్ని పొందజాలనివారు సగుణబ్రహ్మోపాసనం చేసి అర్చిరాది మార్గంతో బ్రహ్మలోకం చేరి ఆ లోకాధ్యక్షుడగు బ్రహ్మదేవునిచే మహావాక్యోప దేశం పొంది ఆయనతోపాటు ముక్తులౌతారు.

ఈ రెండువిధాలుగాక మరొక్క సవికల్పముక్తివుంది. పంచాగ్ని విద్యద్వారా బ్రహ్మలోకం వెళ్లినవారు కల్పపర్యంతం అచ్చటే వుంటారు. మళ్లీ కల్పంవరకు వారు తిరిగిరారు. ఇదీ యిచ్చటి విశేషం. అంతేగాని బొత్తిగా తిరిగిరారనే మాటలేదు. ఇంద్రాగ్ని వరుణాది యితరలోకాలకు వెళ్లినవారు, ఒక కల్పంలోనే యెన్నోమార్లు పునరావృత్తి పొందవలసి వుంటుంది. బ్రహ్మలోకం వెళ్లినవారికీ దురవస్థలేదు. కోర్కెలతోకూడి కర్మలుచేసి పంచాగ్నివిద్యద్వారా బ్రహ్మలోకం వెళ్లినవారికి పునరా వృత్తి, చివరికి కల్పాదిలోనైనా తప్పడంలేదు కాబట్టి భగవంతుడు బ్రహ్మ లోకసహితంగా అన్నిలోకాలనూ పునరావృత్తికలవిగా సెలవిచ్చినాడు.

బ్రహ్మలోకప్రాప్తి రెండు విధాలుగ వుంటుంది. ఉపాసన ద్వారాను – కర్మలద్వారాను. ఉపాసనద్వారా బ్రహ్మలోకం పొందిన వారు బ్రహ్మతోబాటు ముక్తిని బొంది తిరిగిరారు. కాని కర్మలద్వారా బ్రహ్మలోకం పొందినవారికి తిరిగిరాడం తప్పదు. వీరి విషయమే యిచ్చట చెప్పబడింది. భగవత్ ప్రాప్తిమాత్రమే నిత్యమైన స్థితి. తక్కిన లోకాలన్నీ – చివరికి బ్రహ్మలోకం కానీగాక, అనిత్యమేనంటూ చెప్పడం జరిగింది. బ్రహ్మలోకమే అనిత్యమని చెప్పిన తర్వాత తక్కినలోకాల విషయం చెప్పాలే పనికాదు. అనిత్యమైన లోకాలపై – ఆ లోక భోగాలపై ఆసక్తినుంచుట తగదంటూ అభిప్రాయం.

నీ పుణ్యం వుండేవరకూ దివ్యలోకాలలో సుఖభోగాల ననుభవింప వచ్చు. ఆ పుణ్యం కాస్తా తరిగిపోయిందా, మళ్లీ వెనక్కు తిరిగిరావలసిందే. మీ కల్యాణదుర్గంలో వెయ్యి రూపాయలు సంపాదించుకొని జేబులో పెట్టుకొని బెంగుళూరు వెళ్లినావు. వెయ్యి రూపాయలు జేబులో వుండేవరకూ బెంగుళూరుమొత్తం నీదే. సినిమాలు హోటళ్లు వీధులు బజార్లు – అంతా నీదే సామ్రాజ్యం. కాని మణిపర్సు ఖాళీ అయిందా, చచ్చి గీపెట్టినా కప్పు కాఫీ యిచ్చే దిక్కుండదు. పుణ్యలోకాల పరిస్థితీ యింతే. పుణ్యసంపద వుండేవరకూ అక్కడివారు నీ అడుగులకు మడుగులొత్తుతారు. తర్వాత క్రిందికి నెట్టివేస్తారు. ఊర్ధ్వలోకాలలోకూడా క్షయ పతన సాతిశయాలనే దోషాలుండనే వుంటవి. క్షయమంటే తఱుగుబాటు. పతనమంటే నాశం. సాతిశయమంటే తనకంటె పైవానినిచూచి అసూయపడుట. ఈ మానవలోకంలోవలెనే అక్కడకూడా యీ దోషాలున్నాయి. ఒక వ్యక్తి యెన్నికలలో గెలిచి అదృష్టం కొద్దీ 'మినిస్టర్' అయ్యాడు. అతని ఆయుస్సు అయిదేండ్లు. ఒక యేడు గడిచిందా – యిక నాలుగేండ్లే. రెండేండ్లు గడిచాయా – ఇక మూడేండ్లే. ఇది క్షయదోషం. తనకంటె పైవాని చూచినపుడు కల్గే కడుపుమంట సాతిశయదోషం. అయిదేండ్లు ముగిసి కుర్చీదిగి యింటికి వచ్చాడా–యిది పతనం. ఇంతవరకూ అందరూ జోహారుకుములు చెల్లించినవారే. ఇక మార్కెట్టుకు పోవాలంటే దిక్కులేదు. ఊర్ధ్వలోకాల గతీ యింతే. కాబట్టి వాటిని నమ్ముకొని చెడిపోవద్దంటూ భగవంతుడు ఉపదేశిస్తూన్నాడు.

ఈ విషయంలో వ్యాసభగవంతుడొక దృష్టాంతం చెప్పినాడు. ఒక వ్యక్తి నేరంచేసి పట్టువడ్డాడు. న్యాయాధిపతి వానికి యిరవై యేండ్లు శిక్ష విధించాడు. బళ్లారి సెంట్రల్ జైలుకు పంపించారు. రెండేండ్లు గడిచేసరికి ఆ జైలు రిపేరి కావలసివచ్చింది. ఆ ఖైదీని వేరేజైలుకు మార్చాలె. వానివెంట యిద్దరు పోలీసులనుబెట్టి రాజమండ్రి జైలుకు పంపినారు. మరి రెండేండ్లకు ఆ జైలుకూడా మరమ్మతు కావలసివచ్చింది. పోలీసులను వెంటబెట్టి వానిని వేలూరుజైలుకు పంపినారు. శిక్ష మిగిలివుండేవరకూ జైళ్ళకు మార్పిడీ చేసేటపుడు వెంట పోలీసులుంటారు. శిక్ష ముగిసి యిరవై యేండ్లు నిండినాక వానిని యింటికిపంపాలె. ఇంటికి పంపేటపుడు పోలీసులు వెంటలేరు. వాడు స్వతంత్రుడు.

జీవుడు తప్పుచేసి జన్మబంధంలో పడినాడు. ఇది అనంతకాలశిక్ష. ఖైదీ జైళ్లను మార్చినట్లు జీవుడు దేహాలను మారుస్తూన్నాడు. పుణ్యాపాపకర్మలనే పోలీసులకు పరతంత్రుడై వున్నాడు. ఆత్మజ్ఞానం కల్గినపుడు, పరమాత్మసాక్షాత్కారం కల్గినపుడు వాడు స్వతంత్రుడైనాడు. వాడు తన యింటికి వెళ్ళినట్లు. భగవత్ ప్రాప్తి కల్గనంతవరకూ యే లోకాలకు వెళ్ళినా మళ్ళీ రావలసిందే; మళ్ళీ పోవలసిందే.

"అర్జునా! వెయ్యి యుగాలు బ్రహ్మకు పగలు. వెయ్యి యుగాలు ఆయనకు రాత్రి. బ్రహ్మదేవుని అహోరాత్రాలను తెలిసిన ఋషులీసంగతిని చెబుతూన్నారు".

బ్రహ్మలోకంకూడా అనిత్యమని యింతవరకు చెప్పబడింది. ఆ మాటను మరింత పోషించేకోసం యిప్పుడు బ్రహ్మదేవుని జీవిత పరిమితి చెప్పబడ్తూంది. ఆతని ఆయుస్సును లెక్కవేస్తూన్నారని అర్థం.

మనకు ఒక నెల పితృదేవతలకు ఒక రోజు. మన శుక్లపక్షంవారికి పగలు. మన కృష్ణపక్షంవారికి రాత్రి. మనసంవత్సరం దేవతలకు ఒకరోజు. మన ఉత్తరాయణం వారికి పగలు. మన దక్షిణాయనంవారికి రాత్రి. మన మున్నూట అరవై (360) సంవత్సరాలు దేవతలకు ఒక్క సంవత్సరం. దేవతల సంవత్సరాలను దివ్యవర్షాలంటారు.

మనలెక్కప్రకారం, కృతయుగానికి (1728000) పదేడులక్షలు యిరవైయెనిమిదివేలూ, త్రేతాయుగానికి (1296000) పన్రెండులక్షలు తొంభైఆరువేలూ, ద్వాపరయుగానికి (864000) యెనిమిదిలక్షలు అరవైనాల్గువేలూ, కలియుగానికి (432000) నాల్గులక్షలు ముప్పైరెండువేలు సంవత్సరాలు. కలియుగానికి రెట్టింపు సంఖ్య ద్వాపరయుగం. మూడు రెట్లు త్రేతాయుగం. నాల్గురెట్లు కృతయుగం. మొత్తం నాల్గుయుగాల సంఖ్య మనుష్యప్రమాణంలో (4320000) నలభైమూడులక్షలు యిరవై వేల సంవత్సరాలు. దేవతల ప్రమాణంలో (12000) పన్రెండువేలు దివ్యవర్షాలు.

నాల్గుయుగాల సంపుటిని మహాయుగమని దివ్యయుగమని అంటారు. "చతుర్యుగసహస్రం తు బ్రహ్మణో దినముచ్యతే" — అని పురాణోక్తి కలదు. వెయ్యి మహాయుగాలు బ్రహ్మకొకపగలు. బ్రహ్మదేవుని ఒక్కపగటిలో పదునాల్గుమంది మనువులు మారిపోతారు. ఒక మన్వంతరప్రమాణం $71\frac{6}{14}$ మహాయుగాలు; అనగా $857142\frac{12}{14}$ దివ్యవర్షాలు; లేదా $308571428\frac{8}{14}$ మానవీయ సంవత్సరాలు. ఇట్టివి పదునాల్గుకలిస్తే వెయ్యిమహాయుగాలు బ్రహ్మకుపగలు. అనగా (12000000) ఒకకోటి యిరవైలక్షల దివ్యవర్షాలు. లేదా, (4320000000) నాల్గు అర్బుదములు ముప్పైరెండుకోట్లు మానవీయసంవత్సరాలు. ఇన్ని సంవత్సరాలే ఆయన రాత్రికూడ. బ్రహ్మదేవుని పగటిని కల్పమంటారు. ఆయన రాత్రిని ప్రళయమంటారు. ఈప్రళయం కార్యప్రకృతికి సంబంధించిన ప్రళయం. అంతేకాని మూలప్రకృతికి సంబంధించిన ప్రళయంకాదు.

మనలెక్కలో (8640000000) ఎనిమిది అర్బుదములు అరవైనాల్గు కోటిసంవత్సరములు బ్రహ్మకొకరోజు. ఇట్టి పదిహేనురోజులాయన కొకపక్షం. రెండుపక్షాలొక నెల. పన్రెండు నెలలొక సంవత్సరం. మొదటి యాభైసంవత్సరాలు ప్రథమపరార్థం. రెండవ యాభైసంవత్సరాలు బ్రహ్మకు ద్వితీయపరార్థం. మొత్తం నూరుసంవత్సరాలు, అనగా మానవీయప్రమాణంతో 311040000000000 సంవత్సరాలు బ్రహ్మకు ఆయుస్సు.

బ్రహ్మదేవునికికూడా కాలపరిచ్ఛేదం వుండడంబట్టి బ్రహ్మలోకాన్ని అనిత్యమని చెప్పడం కల్గింది. ఈ విషయాలు మనుస్మృతిలోను మహాభారతం శాంతిపర్వంలోను చెప్పబడ్డాయి. మనదృష్టిలో యెంతదీర్ఘంగా వున్నా బ్రహ్మదేవుని జీవితంసైతం అనిత్యమేనని ఫలితార్థం.

బ్రహ్మదేవునికి పగలు ప్రారంభమైనపుడు సర్గాది అని కల్పాది అని అంటారు. కల్పాదిలో అవ్యక్తంగావున్న భూతకోట్లు వ్యక్తావస్థకు వస్తవి. సూక్ష్మరూపంగావున్న సృష్టి స్థూలరూపం ధరిస్తుంది. ఆయనకు రాత్రిరాగానే అనగా ప్రళయంలో వ్యక్తంనుంచి అవ్యక్తంలోకి భూతకోట్లు చేరిపోతవి. దీనిని దైనందినప్రళయమంటారు. ఈ ప్రళయంలో స్వర్గాదిలోకాలు – మూర్తద్రవ్యాలు నశిస్తవి. కాని పంచభూతాలు నశించవు. బ్రహ్మదేవునికి నూరేండ్లు ముగుస్తూనే మహాప్రళయం సంభవిస్తుంది. ఆ సమయంలో పంచభూతాలు – మూర్తామూర్త ద్రవ్యాలు, మూలప్రకృతిలో లయిస్తవి. దీనినే ప్రాకృతికప్రళయమంటారు. మోక్షదశలో ప్రకృతికూడ బాధింపబడ్తుంది. కాబట్టి ముక్తిని ఆత్యంతికప్రళయమంటారు. ఈ శ్లోకంలో బ్రహ్మదేవుని పగలును వ్యక్తమని, రాత్రిని అవ్యక్తమని చెప్పినారు. మీ నిద్రలో మీ చిన్నసంసారం లయించి, మీ జాగ్రత్తలో బైటికి వస్తూంది. అట్లే బ్రహ్మదేవుని సంసారం – ఆయన సృష్టి, ఆయన రాత్రిలో అవ్యక్తమై పగటిలో వ్యక్తమైతూంది.

"పార్థా! అవ్యక్తంనుండి వ్యక్తం కావడమంటే క్రొత్తగా రావడమంటూ యేమీలేదు. వెనుకటి కల్పంలోని జీవులు మళ్లీ సృష్టింపబడ్తూన్నారు. స్థూలశరీరాలు మారినా సూక్ష్మశరీరాలు అప్పటివే. వేషాలు మారినవికాని పాత్రలు ఒకటే. రంగులు మారినప్పటికీ వస్తువులు ఒక్కటే. మందు ప్రాతదేకాని సీసాలు క్రొత్తవి. ఈ నామరూపమాయావిలాసానికే ప్రపంచం భ్రమించిపోతూంది. ఆవిర్భావం చెందిన భూతసముదాయమే బ్రహ్మదేవుని నిద్రావస్థలో తిరోభావాన్ని చెందిపోతూంది. మళ్లీ అదే భూతకోటి బ్రహ్మయొక్క జాగ్రదవస్థలో ఆవిర్భవిస్తూంది. కర్మపాశానికి పరవశమై వుండేవరకూ జీవులకీ దురవస్థ తప్పింది కాదు."

లయమంటే నాశంకాదు. కంటికి కానరాని స్థితిని బొందుట లయ మంటారు. నీటిలో వుప్పువేసినపుడు అది లయించింది. నశించలేదు. అవ్యక్తమనగా కానరానిస్థితి. వ్యక్తమనగా కాన్పించుస్థితి. నీటి ఆవిరి ఆకాశంలో అవ్యక్తంగావుంది. వానవచ్చినపుడు వ్యక్తమైంది. ఎండ వేడిమితో మళ్లీ అవ్యక్తమైంది. నాశమూలేదు. ఉత్పత్తియూలేదు. స్థితి యొక్క వ్యత్యాసంమాత్రం. సృష్టిప్రళయాలూ యింతే. బ్రహ్మదేవుడు శూన్యంనుండి బ్రహ్మాండాలను సృష్టించడంలేదు. అవ్యక్తంనుండి సృష్టిస్తాడు. ప్రళయవిషయమూ అంతే.

మెడకు త్రాడు తగుల్కొని వుండేవరకు బావిలోవదలిన పాత్రకు పైకిరాడం క్రిందికిపోడం తప్పదు. దారానికి చిక్కివుండేవరకు గాలిపటం క్రిందికి రాడం పైకిపోడం తప్పదు. త్రాడు జారితే దారం తెగితే అవి స్వతంత్రాలయ్యాయి. అంతవరకూ పరతంత్రాలే. అట్లే అవిద్యాకామ కర్మలకు వశమై వుండేవరకూ ప్రాణులకు జన్మమరణబాధ తప్పదు. వెనుకటి కల్పంలోని భూతసముదాయమే మళ్లీ వ్యక్తమైతూందికాని క్రొత్తగా సృష్టి అంటూ యేమీలేదు. “సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వమకల్పయత్” — అని వేదం చెప్పింది.

భగవంతుడీ పందొమ్మిదవ శ్లోకంలో కర్మసిద్ధాంతాన్ని బలపరిచాడు. చేసుకున్న పుణ్యాపాపకర్మలకు అనుకూలంగా పునఃపునః జన్మలు లభిస్తవనేది కర్మవాదం. కర్మవాదాన్ని అంగీకరించకపోతే, పుణ్యాపాపాలకు — సుఖదుఃఖాలకు వ్యవస్థే లేకపోతుంది. కృతప్రణాశం అకృతాభ్యాగమమనే రెండు దోషాలు అపరిహార్యంగా నిలిచిపోతవి. కర్మసిద్ధాంతాన్ని ఒప్పుకోకపోతే యిప్పుడు మనంచేసే పుణ్యాపాపాలకు గతిలేక వ్యర్థమైనట్లేగదా! దీనినే కృతప్రణాశమంటారు. పుట్టిన ప్రాణులలో కొందరు సుఖాన్ని కొందరు దుఃఖాన్ని అనుభవిస్తూన్నారు. అందరూ సమానంగాలేరే! ఈ ప్రశ్నకు కారణం లేకపోతుంది. దీనినే అకృతాభ్యాగమదోషమంటారు. ఆ రెండుదోషాలను నివారిస్తూ కర్మసిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ భగవంతుడీ శ్లోకంలో అవే జీవులు పునఃపునః ఆవిర్భావతిరోభావాలను పొందునంటూ చెప్పివున్నారు.

భగవంతుడు పదారవశ్లోకంలో "లోకాల అనిత్యత్వాన్నీ, భగవత్ప్రాప్తియొక్క నిత్యత్వాన్నీ" చెప్పివున్నారు. దానిలో మొదటి మాటైన "లోకాల అనిత్యత్వాన్ని" వివరిస్తూ పదేడు పద్దెనిమిది పందొమ్మిది శ్లోకాలు చెప్పబడినవి. రెండవ మాటైన "భగవత్ప్రాప్తి యొక్క నిత్యత్వాన్ని" వివరిస్తూ ముందటి రెండుశ్లోకాలు చెప్పబడ్తున్నాయి.

"అర్జునా! కాలపరిచ్ఛిన్నాలు కాబట్టి, బ్రహ్మలోకపర్యంతం యే లోకానికి వెళ్లినా పునర్జన్మం తప్పదని వింటివిగదా! ఇక గతేమి? జన్మరాహిత్యానికి మార్గమేలేదా అని నీకు సందేహం కల్గివుండవచ్చు. విను. ఈ అనిత్యలోకాలకంటె విలక్షణమైన నిత్యస్థితి ఒకటి వుంది. ఇంతవరకు బ్రహ్మదేవుని పగటిని వ్యక్తమని, రాత్రిని అవ్యక్తమని చెప్పితినిగదా! ఆ వ్యక్తావ్యక్తాలకు విలక్షణమైన అవ్యక్తస్థితి ఒకటి వుంది. బ్రహ్మదేవుని రాత్రికాలం అవ్యక్తమని చెప్పబడింది. ఆ అవ్యక్తం సాపేక్షికమైంది. వ్యక్తమును దృష్టిలోపెట్టుకుని అది అవ్యక్తమైంది. కాబట్టే దానిని సాపేక్షిక అవ్యక్తమని అన్నాం. అంతేకాదు. స్థూల రూపాలు లేకపోయినా సూక్ష్మపంచభూతాలరూపంతో ఆ అవ్యక్తం వుంది. ఇది బ్రహ్మదేవుని నిద్రారూపమైన అజ్ఞానం; అనిత్యం. దీనికంటె విలక్షణమూ — ఉత్కృష్టమూనైన అవ్యక్తస్థితి వుంది. ఇది యింద్రియాలకు తెలియబడేదికాదు. బ్రహ్మదేవుని నిద్రావస్థే మనం తెలియ లేనంతటి సూక్ష్మమైంది. దానికి ఆధారమై మరీ పరమసూక్ష్మమైన పరమాత్మ యింద్రియాలకు యేలాగ వ్యక్తమైతాడు? కాబట్టే అవ్యక్త మనినారు. ఆ అవ్యక్తాన్ని అక్షరమని అంటారు. అది సనాతనమైన సత్తారూప బ్రహ్మవస్తువు. బ్రహ్మాదిస్తంబపర్యంతాలైన సమస్త పదార్థాలు నశించినా, అది నశించేదికాదు. దానిని పరమగతి అంటారు. పరమగతి అని యెందుకన్నారంటే, అక్కడికి వెళ్లినతర్వాత తిరిగిరావలసిన పనిలేదు. ప్రపంచంలో యెక్కడికిగాని యేలోకానికిగాని వెళ్లినామంటే మళ్లీ తిరిగిరావాలె. వెళ్లేటందుకు మార్గ ముందంటే వచ్చేటందుకూ వుంటుంది. కాని యీ పరమగతి విలక్షణమైంది. వెళ్లేటందుకేగాని వచ్చేమార్గం లేదు. అది నా పరమధామం. నా పరమధామమని అంటే

నేను వేరు—అది వేరుగా వున్నామనికాదు. నా స్వరూపమే నన్నమాట. రాహువుతల అనినట్లు నాధామమని చెప్పబడింది. రాహువుతల అని నపుడు తలే రాహువుకాని తలకు భిన్నంగా రాహువులేదు. రాహు గ్రహానికి మొండెం లేదుగదా! రాహువు, తలకంటె భిన్నం కానట్లు, ఆ పరంధామానికి భిన్నంగా నేను లేను. నేనే పరంధామం; పరంధామమే నేను. సర్వోత్కృష్టమూ సర్వోపాధిరహితమూ నైన నా వాస్తవ స్వరూపాన్ని చేరినవారు తిరిగి జన్మమరణరూప సంసారానికి పాల్పడరు. చేరుట అంటే అప్రాప్తరూప ప్రాప్తికాదు; ప్రాప్తరూప ప్రాప్తి అని గ్రహించాలె. ఆ సచ్చిదానందపరబ్రహ్మం తన స్వరూపమేనంటూ అభేదంగా తెలుసుకున్న అధికారులు పునర్జన్మాన్ని బొందరు. ఆ స్థితిని పొందేటందుకు సాధనమేదని అడుగుతావా? విను. ఈ విషయం యీవరకే చెప్పినాను. అయినా మరింత దృఢంగా మరొక్కసారి విను.

"పురుషస్స పరః పార్థ! - భక్త్యా లభ్యస్త్వనన్యయా।
యస్యాంతస్థాని భూతాని - యేన సర్వమిదం తతమ్ ॥ "

"పృథాకుమారా! పరమగతి అన్నా పరమధామమనినా పురుషు డనినా ఆ పరమాత్మునికి సంబంధించిన నామాలే. ఆతనియందే ఈ భూత కోట్లన్నీ కల్పింపబడి వున్నాయి. అలలకు సముద్రంవలె యీ నానా నామరూప కార్యపదార్థాలకు అతడే ఆధారం; అతడే అధిష్ఠానం. ఇదం వృత్తికి గోచరించే దృశ్యపదార్థాలన్నిటిలో ఆ పరమాత్మే వ్యాపించి వున్నాడు. ఆ నిరతిశయపరమపురుషుడు అనన్యభక్తితో మాత్రం లభ్యమైతాడు".

ఈ శ్లోకంలోని "యేన సర్వమిదం తతం" అనే చివరిచరణం భగవద్గీతలో మొత్తం మూడుచోట్ల ప్రయోగింపబడింది. గీతాచార్యుడు ముమ్మారుచ్చరించిన యీ మహావాక్యం యెంత ప్రభావోపేతమైందో వేరే చెప్ప పనిలేదు. రెండవ అధ్యాయం పదేడవ శ్లోకంలోనూ, యీ యెన్మిదవ అధ్యాయం యీ యిరవై రెండవశ్లోకంలోనూ, చివరి పదు నెన్మిదవ అధ్యాయంలో నల్వాది ఆరవశ్లోకంలోను చెప్పబడింది. ఈ మహా వాక్యంలో పరమాత్ముని అఖండస్వరూపం బోధింపబడింది. "ఎందెందు

వెదకి చూచిన నందందే గల”డన్న ప్రహ్లాదుని అనుభవమూ యిదే. ఇది హిందూమతం ప్రపంచాని కిచ్చిన మహాసందేశం. అస్తి భాతి ప్రియ రూపంతో — సచ్చిదానందరూపంతో పరమాత్ముడు అన్నివస్తువులలో వ్యాపించివున్నాడు. ఇదంవృత్తికి గోచరించే — యిది యిది అని మనకు తెలియబడే అన్నివస్తువులకు సత్తాస్ఫూర్తులను ప్రసాదిస్తూ ఆయనే వున్నాడు. నిజంగా వుండేది ఆయనే. ఒకప్పుడుండి ఒకప్పుడు లేకపోయే, మొదట్లోలేక చివరిలోలేక మధ్యలోమాత్రం గోచరించే నామరూప జగత్పదార్థాలను వున్నవని చెప్పడంకూడా పరమార్థదృష్ట్యా తగదు. త్రికాలాలలో వుండే నిత్యసత్యవస్తువు పరమాత్మే. కుండలలో మట్టివ్యాపకమై వున్నట్లు, ఆభరణాలలో బంగారు వ్యాపకమైవున్నట్లు పాలలో వెన్న వ్యాపకమై వున్నట్లు పరమాత్మ యీ అన్నిటిలో వ్యాపించివున్నాడు. కల్పితసర్పం అధిష్ఠానరజ్జువునందే వున్నట్లు, మాయాకల్పితభూతజాలం అధిష్ఠాన పరమాత్మునిలోనే వుంది. అట్టి పరమాత్ముడు అనన్యభక్తితో మాత్రం లభిస్తాడు. ఆ పరంధామాన్ని ఆ పరమగతిని ఆ పరమాత్మను పొందుటకు సాధనం అనన్యభక్తి. అన్యవస్తువులపై ప్రీతి వదలి పరమాత్ముని పైననే ప్రీతినుంచుట అనన్యభక్తి. ఇది స్థూలరూపం. అన్యం కానిది అనన్యం. పరమాత్ముడు తనకు అన్యంగా లేడని, పరమాత్ముడే తాను — తానే పరమాత్ముడననే అఖండభావనను పొందుట అనన్యభక్తి. ఇది ముఖ్యరూపమైన జ్ఞానలక్షణాత్మకమైన అనన్యభక్తి. వాని వాని అధికారి భేదాన్నిబట్టి యీ రెంటిలో దేనినైనా అవలంబించవచ్చు.



ప్రియమైన ఆత్మబంధువులారా!

భగవదనుగ్రహంతో చల్లగా మెల్లగా చివరిఘట్టానికి వచ్చి చేరుకున్నాం. ఈ అధ్యాయంలో యిది చివరి ప్రకరణం. ఇందలి విషయం క్లిష్టమైంది. జీవునికి కల్గే లోకాంతరగమనవిషయాలిందులో చెప్పబడ్డాయి. శాస్త్రగమ్యమైన విషయాలు కాబట్టి యివి శ్రద్ధపై ఆధారపడి వుంటాయి. శ్రుతులు చెప్పినవి; భగవంతుడు చెప్పినాడు; ఆప్తులైన మహర్షులు చెప్పినారు; కాబట్టి శ్రద్ధతో నమ్మాలె. అతీంద్రియమైన విషయాలు తర్కానికి అందవు.

ప్రపంచంలోని మొత్తం మానవకోట్లను నాల్గురకాలుగా విభజించవచ్చు. ఒకటి కర్మాతీతులు. రెండు నిష్కామకర్మయోగులు. మూడు సకామకర్మయోగులు. నాల్గు కర్మభ్రష్టులు. మొదటివారైన కర్మాతీతులు జీవన్ముక్తులు. నరరూపంతో కనబడే నారాయణులు. వారి కర్మలు జ్ఞానాగ్నిచే దగ్ధమైపోయాయి. వారు కృతకృత్యులు. వారికి విధి నిషేధాలులేవు. వారు చెప్పింది వేదం. నడిచింది శాస్త్రం. మునిగింది గంగ. ఉండింది కాశి. వారిప్రాణం బయటికి యెక్కడికో పోవలసిన పనిలేదు. దేహం వదుల్తూనే వారిప్రాణాలు అక్కడక్కడే బ్రహ్మత్వం చెందిపోయాయి. కాబట్టి వారికి లోకాంతరగమనమనే సమస్యే లేదు. వీరి విషయం తొమ్మిదవ అధ్యాయంలో విస్తారంగా చెప్పినారు. అక్కడ చూడవచ్చు. రెండవవారు నిష్కామకర్మయోగులు. వీరు ముముక్షువులు. మోక్షంకొరకు భగవత్ప్రాప్తికొరకు నిష్కామంగా సత్కర్మలు చేస్తారు! సగుణబ్రహ్మోపాసనం - ఓంకారోపాసనం చేస్తారు. వీరు చిత్తశుద్ధి గల్గివుండికూడా జీవితకాలంలో ముక్తిని పొందలేకపోతారు. వీరు మరణానంతరం దేవయానమార్గంగుండా బ్రహ్మలోకం వెళ్లుతారు. అచ్చట ప్రళయకాలపర్యంతం బ్రహ్మవిచారంలో కాలం గడుపుతూ ప్రళయసమయంలో చతుర్ముఖబ్రహ్మతో బాటు ముక్తినిబొంది అద్వయబ్రహ్మంతో ఐక్యం చెందుతారు. ఈ బ్రహ్మోపాసకులు తిరిగి జన్మకు రావలసిన పనిలేదు. మూడవవారు సకామకర్మయోగులు. కామ్య

బుద్ధితో ఫలాపేక్షతో వీరు కర్మలు చేస్తారు. పాపకర్మలు - నిషిద్ధ కర్మలు చేయరు. శాస్త్రవిహితకర్మలే చేస్తారు. సుఖాలు భోగాలు కావాలనే ఆసక్తితో చేస్తారు. వీరు దేహంవదలి పితృయాణమార్గం గుండా పితృలోకం చేర్తారు. ఈ పితృలోకాన్నే కొందరు స్వర్గమని కొందరు చంద్రలోకమని అన్నారు. ఆ లోకంలో తమ పుణ్యభాగ్యం వుండేవరకూ సుఖభోగాలు అనుభవించి వెనుక్కు పునర్జన్మానికి వస్తారు. ఇక నాల్గవవారు కర్మభ్రష్టులు. వీరిసంఖ్యే నేటిప్రపంచంలో విస్తారంగా వుంది. వీరు మనుష్యరూపంతో తిరిగే మృగాలు. నరరూపంతో వుండే వానరాలు. వీరికి కర్మంలేదు; ధర్మంలేదు. పుణ్యంలేదు; పాపంలేదు. శాస్త్రంలేదు; ఆచారంలేదు. స్వేచ్ఛాచారులు. వీరు చచ్చి యే లోకానికీ పోవలసిన పనిలేదు. తృణజలూకం లాగా యీ దేహాన్ని వదలి యిక్కడే మరొక్కదేహాన్ని పట్టుకుంటారు. తృణజలూకమంటే గడ్డి పురుగు. ఆ పురుగు గడ్డిపోచమీద ప్రాకుతూ ముందటి పోచను పట్టుకొని వెనుకటిపోచను వదుల్తుంది. వీరూ అంతే. ఈ శరీరాన్ని వదలగానే మరోదేహంలో — పశువో పక్షో క్రిమో కీటకమో — యేదో ఒక క్షుద్ర శరీరంలో ప్రవేశిస్తారు. వీరికీ లోకాంతరప్రయాణమంటూ లేదు.

లోకాంతరగమనం మధ్యలోని యిద్దరికే చెప్పబడింది. ఒకరిని ఉపాసకులని మరొకరిని కర్ములని శాస్త్రం వ్యవహరించింది. ఈ యిద్దరినీ భగవద్గీత యోగులనే పేరుతో చెప్పివుండడంచేత, మనం నిష్కామకర్మ యోగులని సకామకర్మయోగులని స్పష్టంచేసి విడివిడిగా పేర్కొన్నాము. వీరికి గల్గే లోకాంతరగతులను భగవద్గీత చెప్పాట కుపక్రమించింది. ఇంతకు ముందు ఓంకారోపాసకులకు క్రమముక్తి కల్గుతుందంటూ చెప్పబడింది. వారు తిరిగి జన్మానికి రారనికూడా చెప్పివున్నారు. పునరావృత్తి రహితమైన ఆ మార్గాన్ని యిక్కడ భగవంతుడు చెబుతూన్నాడు. దానినే దేవయానమార్గమంటారు. ఇది శ్రేష్ఠమైంది. ఇదిగాక పునరావృత్తి సహితమైన మరోమార్గమూ వుంది. దానిని పితృయాణ మార్గమంటారు. ఇది కనిష్ఠమైంది. క్రమంగా ప్రసంగోపాత్తంగా శ్రేష్ఠకనిష్ఠ నిరూపణ కొరకు భగవంతుడు రెండు మార్గాలనుకూడా బోధిస్తూన్నాడు. ఈ విషయాలు, ఛాందోగ్య బృహదారణ్యక ప్రశ్న కౌషీతకి ఉపనిషత్తులలోనూ

సూత్రభాష్యంలోనూ ఆత్మపురాణం ఆరవ అధ్యాయంలోను తెల్ప బడ్డాయి.

"భరతకుల శ్రేష్ఠుడవైన ఓ అర్జునా ! యోగులు యేకాలంలో ప్రయాణంచేస్తే తిరిగిరారో, యేకాలంలో ప్రయాణంచేస్తే తిరిగివస్తారో ఆ కాలాన్ని చెబుతూన్నాను. విను".

ఇది యిర్వది మూడవశ్లోకం. కాలమంటే కాలాభిమాన దేవతలు సూచించిన మార్గమంటూ భాష్యకారులన్నారు. ఉపాసకులు తిరిగిరాని మార్గంలో ప్రయాణం సాగిస్తారు. కర్ములు తిరిగివచ్చే మార్గంలో వెళ్లు తారు. ఈ యిద్దరినీ వుద్దేశించి యిక్కడ యోగులనే పదం ప్రయోగించ బడింది. ఈ గౌరవనామం ఉపాసకులకూ—కర్ములకూ యిద్దరికీ లభించింది. కాబట్టే, ఉపాసకులను నిష్కామకర్మయోగులని, కర్ములను సకామకర్మ యోగులని మేము వ్యవహరించామ్. ఈ విద్య యోగులకు సంబంధించిందే కాని సర్వసాధారణంగా మానవులందరికీ సంబంధించిందికాదు.

నీవు బొంబాయి వెళ్లాలనుకున్నావు. గుంతకల్లు వెళ్లి టిక్కెట్టు తీసికొని రైలు యెక్కావు. ఆయా స్టేషనులను గడుస్తూ గడుస్తూ బొంబాయి చేర్తావు. ఆలాగే ఉపాసకుడు బ్రహ్మలోకం వెళ్లాలె. సకామ కర్మి పితృలోకం చేరాలె. వారి ప్రయాణం యెక్కడినుండి ప్రారంభ మైతుంది. మధ్యమధ్యలో ఏ యే స్టేషన్‌లను గడచాలె. వారి మార్గ మెట్లు ? తెలిసికోవలసిన మాటే. భగవంతుడు రెండుశ్లోకాలద్వారా సంక్షేపంగా వర్ణిస్తూన్నాడు:

"అ షణ్మాసా ఉత్తరాయణం।
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥"

"అర్జునా ! బ్రహ్మోపాసకులయిన జనులు, అగ్ని - జ్యోతిస్సు - పగలు- శుక్లపక్షం - ఆరునెలల ఉత్తరాయణం కల మార్గంలో ప్రయాణంచేస్తూ బ్రహ్మమును ప్రాపిస్తారు".

ఇది ఉపాసకుడని నిష్కామకర్మయోగి అని చెప్పినవాడు ప్రయాణం చేసేమార్గం. ఈ శ్లోకం 'అగ్ని' అనే శబ్దంతో ఆరంభమైంది. ఈ మార్గంలో మొదటిస్టేషన్ అగ్ని. అగ్నిని వేదములలో 'అర్చి' అనినారు. కాబట్టి దీనిపేరు అర్చిరాదిమార్గం. దీనికి దేవయానమని ఉత్తరమార్గమని

శుక్లగతి అని పర్యాయనామాలు. ఈ మార్గం అగ్నితో ప్రారంభమైంది. అనగా ప్రకాశంతో ప్రారంభమైందన్నమాట. చివరివరకూ యీ మార్గంలో ప్రకాశమే ప్రకాశం. కావుననే యీ మార్గాన్ని శుక్లగతి అన్నారు. ఈ బాటసారి సుఖంగా ప్రయాణం చేస్తాడు. అగ్ని — జ్యోతి అనువాటిని విడివిడివస్తువులుగా కొందరు చెప్పినారు. కొందరు — జ్యోతిర్మయమైన అగ్ని అని ఒకేవస్తువుగా చెప్పినారు. జ్యోతిర్మయమైన అగ్ని అంటే ప్రకాశవంతమైన — పొగలేని అగ్ని అని అర్థం.

మన హృదయమొక నాడీకేంద్రం. సైకిల్ చక్రంలోని కడ్డీలన్నీ మధ్యలో ఒకచోట కలిసినట్లు నాడులన్నీ హృదయంలో కలుసుకుంటవి. అందులో ఒక సూక్ష్మనాడి వుంది. దానినే సుషుమ్న అని — బ్రహ్మనాడి అని అంటారు. అది ఊర్ధ్వగామి. దానికీ బ్రహ్మలోకానికీ సరాసరి సంబంధం వుంది. దేహాన్ని ఆపరేషన్ చేస్తే కానవచ్చేదికాదు. అది వస్తురూపంలో లేదు. శక్తిరూపంలో వుంది. ఉపాసకుని మహాప్రయాణ కాలంలో అది తెరువబడ్తుంది. తక్కినవారికి ఆ నాడి మూయబడే వుంటుంది. ఉపాసకుడు దేహం వదల్తూనే మొట్టమొదట ఆ నాడితో సంబంధపడ్తాడు. కాబట్టి అతని మార్గమంతా ప్రకాశమయం. అగ్నితో సంబంధమంటే తనలోపలి అగ్నితో సంబంధంకావాలె. మనవాళ్లు చచ్చిన తర్వాత శవాన్ని అగ్నిలోవేసి కపాలం పగిలేవరకుండి, అతడు బ్రహ్మలోకం వెళ్లినట్లు సంతోషిస్తారు. ఇది భౌతికమైన అగ్ని. ఉపాసకునికి సంబంధించేది అభౌతికమైన దివ్యాగ్ని. కొందరు మఠాధిపతులు మరణిస్తూనే శిష్యులు వారి కపాలాన్ని టెంకాయతో పగులకొట్టి, స్వాముల వారు సుషుమ్నానాడిగుండా బ్రహ్మరంధ్రాన్ని భేదించుకొని పోయినాడంటూ నటన చూపిస్తారు. ఈ కృత్రిమాలతో లాభం లేదు.

అగ్ని అంటే అగ్నిఅభిమానదేవత. జ్యోతి అంటే జ్యోతిరభిమానదేవత. పగలంటే పగటిఅభిమానదేవత. శుక్లపక్షమంటే శుక్లపక్షాభిమాన దేవత. ఉత్తరాయణమంటే ఉత్తరాయణాభిమానదేవత — అంటూ వీటి అర్థం అభిమానదేవతలుగా గ్రహించాలంటూ భాష్యకారులన్నారు. దేహం వదల్తూనే ఉపాసకుడు అగ్నిరభిమానదేవతను చేరు

కుంటాడు. అగ్నిదేవతతో ప్రప్రథమంగా సహజంగానే ఉపాసకునికి తన లోపలనే మరణకాలంలో సంబంధం కల్గుతుంది. ఆ దేవత వానిని జ్యోతిరభిమానదేవతకు అప్పగిస్తుంది. ఆ దేవత పగటిఅభిమానదేవతకు అప్పగిస్తుంది. ఆ దేవత శుక్లపక్షాభిమానదేవతకు సమర్పిస్తుంది. ఆ దేవత ఉత్తరాయణాభిమానదేవతకు అప్పగిస్తుంది. ఈ దేవతలను ఆతివాహిక దేవతలంటారు. ఈ అంచెలమీద ఉపాసకుడు క్రమంగా బ్రహ్మలోకం చేర్తాడు.

ఒక గవర్నరును సాగనంపేటపుడు ఆ జిల్లాధికారి తన సరిహద్దు వరకూ వెంటవెళ్లి మరొక జిల్లాధికారికి అప్పగిస్తాడు. అతడూ అంతే. ఈ విధంగానే ఉపాసకుని ప్రయాణమూ వుంటుంది. ఈ మజిలీలు ఉపనిషత్తులతో మరికొంత అధికంగా చెప్పబడ్డాయి. భగవద్గీత వాటిని సంక్షేపించి ఉపలక్షణాత్మకదృష్టితో చెప్పింది. ఈ శ్లోకంలో బ్రహ్మవిదులని చెప్పబడినవారు బ్రహ్మోపాసకులు. విచ్ఛబ్దం ఉపాసకార్థంలో ప్రయోగింపబడింది. లేదా. బ్రహ్మవిదులనగా బ్రహ్మమును పరోక్షంగా తెలిసినవారని అర్థం చెప్పుకోవచ్చు.

ఒక ఉపాసకుడు కృష్ణపక్షంలో మరణిస్తాడు. వాని విధానమెలాగు? అతడు పగటి అభిమాని దేవతవరకు సాగిపోయాడు. ఆ పగటి అభిమాని దేవత ఆ జీవుని తన వశంలో శుక్లపక్షం వచ్చేవరకూ పెట్టుకుని తర్వాత ఆ దేవతకు అప్పగిస్తుంది. రాత్రిలో మరణిస్తాడనుకొండి. అగ్నిదేవత పగలు వచ్చేవరకు తన వశంలో పెట్టుకొని తర్వాత ఆ అధిదేవతకు అప్పగిస్తుంది. ఈ విధంగా గ్రహించాలె.

"ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనం।
తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే॥"

"అర్జునా! సకామకర్మపరులైన యోగులు దేహాన్నివదలి ధూమము రాత్రి కృష్ణపక్షం ఆరునెలల దక్షిణాయనం — వీటితో కూడిన ధూమాది మార్గంలో ప్రయాణం చేసి చంద్రప్రకాశంవంటి స్వర్గలోకంచేరి భోగాలు అనుభవించి మళ్లీ పునర్జన్మకు వస్తారు."

ధూమాదిమార్గం. యీ శ్లోకంలో చెప్పబడింది. కాబట్టే 'ధూమ' శబ్దంతో శ్లోకం ప్రారంభమైంది. ఈ ధూమాది మార్గాన్ని పితృయాణమని దక్షిణాయనమార్గమని కృష్ణగతి అని కూడా చెప్పడంకద్దు. కామ్య బుద్ధితో యిష్టాపూర్తదత్తాదికర్మలను చేసినవారీమార్గంలో ప్రయాణం చేస్తారు. అగ్నిహోత్రాదులను యిష్టకర్మలంటారు. వాపీకూపతటాకాది నిర్మాణాన్ని పూర్తకర్మలంటారు. గోసువర్ణవస్త్రాదికాలను సత్పాత్రుల కొసగుట దత్తకర్మలంటారు. వీరినికూడా యోగులంటూ భగవద్గీత గౌరవంగా పిలిచింది. యోగులనగా చిత్తవృత్తులను నిరోధించినవారని కదా అర్థం. వీరూ కొంతమట్టుకు చిత్తవృత్తులను నిరోధించినవారు కాబట్టే, తమ డబ్బును సత్కార్యాలకు వినియోగించే త్యాగశక్తి కల్గింది. కామ్యబుద్ధితో కానీగాక, పుణ్యకార్యాలకు ధనాన్ని ఖర్చుపెట్టుట చిన్నమాటా మరి! వీరు దేహాన్ని వదలి మహాప్రయాణం చేసేటపుడు వీరికి మొదట లభించే స్టేషన్ 'ధూమం'. అనగా పొగ. వారికోర్కెలే వారిని పొగలాగా ఆవరించాయి. వీరికి పొడుగునా మార్గమంతా చీకటే చీకటి. కాబట్టే దీనిని కృష్ణగతి అన్నారు. చీకటి అంటే యిది ఫలానిది - యిదిఫలానిది అని వివేచించుటకు వీలుగాని అయోమయమూ అంధకారబంధురమూ నైన స్థితి. వీరికి మొట్టమొదట్లోనే సహజంగా ధూమాభిమానదేవతతో సంబంధం కల్గుతుంది. ఆ దేవత యీ జీవుని రాత్రిఅభిమానదేవతకు చేర్చుతుంది. ఆ దేవత క్రమంగా కృష్ణపక్షాభిమానదేవతకు అప్పగిస్తుంది. అటనుండి దక్షిణాయనాభిమానదేవతకు చేర్తాడు. అచ్చటనుండి చంద్రలోకం చేరి దివ్యసుఖాలు అనుభవించి పుణ్యం క్షీణిస్తూనే చంద్రలోకంనుండి మేఘమండలంలోనికి జార్తాడు. మేఘంనుండి వానగుండా ఆ జీవుడు భూమిపై పతనమై సస్యాలద్వారా ధాన్యంలో చేర్తాడు. ఆ ధాన్యాన్ని ఆ జీవుని కర్మానుకూలంగా వాడెవరి గర్భంలో పుట్టాలో, ఆ తలిదండ్రులే తింటారు. సరే! జన్మిస్తాడు. ఇదీ వానికథ. ఈ సకామకర్మి దక్షిణాయనంలో మరణించక ఉత్తరాయణంలో మరణిస్తే వాని విషయమేమని అడుగుతారా? కృష్ణపక్షాభిమాని దేవత యీ జీవున్ని దక్షిణాయనం వచ్చువరకు తన వద్దనే పెట్టుకొని తర్వాత ఆ అభిమానదేవతకు అప్పగిస్తుంది.

"పార్థా! ఈ శుక్లకృష్ణమార్గాలు రెండూ జగత్తులో శాశ్వతంగా వున్నాయి. ఇందులో ఒకటైన శుక్లమార్గంగుండా ఉపాసకుడు అనావృత్తిని బొందుతాడు. రెండవదైన కృష్ణమార్గంలో వెళ్ళినవాడు జన్మానికి వస్తాడు."

గడిచిన యిరవై మూడవ శ్లోకంలో 'కాలము' అని చెప్పి యిచ్చట 'మార్గము' అని చెప్పబడింది. 'అగ్ని జ్యోతి అహస్సు శుక్లపక్షం ఉత్తరాయణం' వీటిలో మొదటి రెండుతప్ప తక్కినవి మూడూ కాలసూచక శబ్దాలు. 'ధూమము - రాత్రి - కృష్ణపక్షం - దక్షిణాయనం' వీటిలో మొదటిదిగాక తక్కిన మూడూ కాలవాచకశబ్దాలు. సంఖ్యాధిక్యంచేత కాలమనేమాటతోనే అన్నింటిని కలిపి భగవంతుడు యిరవై మూడవ శ్లోకంలో వ్యవహరించాడు. ఇచ్చట కాలాభిమానిదేవతలే వుద్దేశ్యంకాని కాలంకాదని భాష్యకారులన్నారు. పగటిపూట చచ్చినవారంతా బ్రహ్మలోకంవెళ్లుతారని, రాత్రిపూట చచ్చినవారంతా చంద్రలోకం వెళ్లుతారని చెప్పుట సరికాదు. కాలమే అని చెబితే యీ అనర్థంవచ్చి పడ్తుంది. ఎందరో పుణ్యాత్ములు - ఉపాసకులు రాత్రిపూట కృష్ణపక్షంలో మరణిస్తూన్నారు. శ్రీరవీంద్రనాథఠాకూరు దక్షిణాయనంలో మరణించారు. ఈ అనర్థం తొలిగేకోసం కాలమనేమాటకు కాలాభిమానిదేవతలు సూచించిన మార్గమంటూ సమన్వయం చేయడం జరిగింది. మహాభారతంలో చెప్పిన భీష్ముని విషయం ప్రత్యేకం. ఉత్తరాయణకాలం వచ్చేవరకు ఆయన వేచుకొని యెందుకు దేహం వదిలాడనే చర్చతో మనకంతగా యిప్పుడు పనిలేదు. ఇప్పుడీ శ్లోకంలో 'గతి' అని, రాబోయే యిరవైయేడవశ్లోకంలో 'సృతీ' అని మార్గాలే సూచింపబడ్డాయి. "గతి-సృతి" శబ్దాలు మార్గమనే అర్థాన్ని యిచ్చేవి. అందువలన వెనుక చెప్పిన కాలశబ్దం మార్గోపలక్షితమంటూ భాష్యకారులన్నారు.

ఈ మార్గాలు రెండూ ప్రవాహరూపంగా అనాదికాలంనుండి జగత్తులో శాశ్వతంగా వున్నాయి. ఉపాసనాధికారులు — కర్మాధికారులుండేనరకూ యీ మార్గాలు వుండేటీ త్తవి. జ్ఞానం కల్గినవారికిమాత్రం మిథ్యామాత్రాలుగా గోచరిస్తవి కాని, అజ్ఞానులకు శాశ్వతంగానే వుంటవి.

ఆచార్య వినోబా మొదలైనవారు యీ ప్రసంగాలను రూప కాలంకారాలుగా గ్రహించి క్రిందివిధంగా అర్థం చెప్పినారు. శుక్లగతి అంటే జ్ఞానమార్గం. కృష్ణగతి అంటే అజ్ఞానమార్గం. శుక్లగతిలో, అగ్నియొక్క—పగటియొక్క — శుక్లపక్షంయొక్క — ఉత్తరాయణంయొక్క తోడ్పాటుండాలె. అగ్ని అంటే యజ్ఞానికి—కర్మకు ప్రతీకం. యజ్ఞార్థమైన కర్మ చేస్తూ చేస్తూ మరణిస్తే అగ్నిదేవుని కృపవున్నట్లు. పగలంటే మెల్కొనివుండే సమయం; సూర్యుడు ప్రకాశించే సమయం. బుద్ధి తేజస్వంతంగా జాగరూకంగావుండి మరణిస్తే పగటిదేవతయొక్క అనుగ్రహం కల్గినట్లు. శుక్లపక్షమంటే చంద్రప్రకాశం రోజుకు రోజుకు వృద్ధిబొందేకాలం. చంద్రుడు మనస్సుకు సంకేతం. మనస్సులోని పవిత్రదైవీభావాలు నానాటికి వికసించి మరణకాలానికి పూర్ణత్వం పొందాయంటే శుక్లపక్ష దేవతయొక్క అనుగ్రహం చేకూరినట్లు. ఉత్తరాయణమంటే ఆకాశంలో మబ్బులు మోడాలు లేక సూర్యుడు స్పష్టంగా ప్రకాశించే సమయం. హృదయాకాశంలో అజ్ఞానమేఘాలు తొలగి జ్ఞానసూర్యుడు ప్రకాశిస్తూంటే, ఉత్తరాయణదేవతయొక్క అనుగ్రహం కల్గినట్లు. ఈ మార్గంలో మహాప్రయాణంచేసిన వ్యక్తి తిరిగిరాని బ్రహ్మలోకాన్ని చెందుతాడు. ఇది అర్చిరాదిమార్గం. దీనికి విపరీతమైంది ధూమాదిమార్గం. ఈ విషయంలో శ్రీజ్ఞానేశ్వరుడు తన అభిప్రాయాన్ని యీ విధంగా వెల్లడించాడు:

"మనుష్యుడు శరీరదృష్టివదలి తాను బ్రహ్మస్వరూపుడనేనంటూ తెలిసికొని వుండాలె. నీటికి తనయందు తరంగత్వ ముందా లేదా అనే ఆభాస యెప్పుడైనా వుంటుందా? దానియందు తరంగాలు వున్నా లేకున్నా అది నీరే నీరు. తరంగాలతోపాటు నీరు పుట్టిందిలేదు. తరంగాలతోపాటు గిట్టిందిలేదు. ఈ విధంగా దేహంతోకూడిగూడా బ్రహ్మస్వరూపులుగా వుండేవారిని విదేహులని అంటారు. ఈ విదేహులకు మరణమొకటి వుందా అని? అట్టివారికి సమస్త దేశకాలాలు ఆత్మస్వరూపాలే. కుండ సరళంగా పగిలితే కుండలోని ఆకాశం మహాకాశంలో కలిసిందని, వక్రంగా పగిలితే మహాకాశంలో కలియదని వుందా? కుండ మాత్రం నశిస్తూందికాని దానిలోని ఆకాశం, కుండ పుట్టకముందూ

వుంది. కుండ పగిలినతర్వాతా వుంది. ఈ విధంగా బ్రహ్మజ్ఞానసహాయంతో బ్రహ్మస్వరూపులైన యోగులకు మార్గమేది ? అమార్గమేది ? ".

"అర్జునా ! ఈ ఉభయమార్గాల తత్త్వాన్ని యెరిగిన యోగి మోహానికి బద్ధుడుకాడు. ఈ విషయాలను తెలియనివాడుమాత్రం, అదెట్టిదో యిదెట్టిదో అనే మోహభ్రాంతులకు గురికాగలడు. ఇది తెలిసి, సర్వకాల సర్వావస్థలలో యోగయుక్తుడవై వుండు".

భవిష్యత్తుపై ఆశపెట్టుకుని వర్తమానాన్ని జారవిడుచుకోడం మూఢుని లక్షణం. బుద్ధిమంతుడు యేమరక వర్తమానాన్ని సద్వినియోగం చేసుకోగల్గుతాడు. అట్టివాని భవిష్యత్తుకూడా బంగారుగానే వుంటుంది. వర్తమానం మనచేతిలో వుందికాని భవిష్యత్తు మన వశంలో లేదుగదా ! చివరికి అది రంగంలోకి వస్తుందో భంగమై పోతుందో యెవరు చెప్పగల్గుతారు ? శుక్లగతి కృష్ణగతుల సంగతులు నీకు చెప్పినానుగదా ! వాటిపై భ్రమవదులు. ఇవిగాక మరొక్కటి శుద్ధగతివుంది. అది యేదంటావా? సర్వకాల సర్వావస్థలలో యోగయుక్తుడవై వుండుట. ఏమిటాయోగం ? ఆత్మయోగం — పరమాత్మయోగం. "సమత్వం యోగ ఉచ్యతే". చిత్తం బ్రహ్మాకారం చెందివుండుట యోగం. అయిదవ అధ్యాయం యెనిమిది తొమ్మిది శ్లోకాలలో చెప్పినట్లు, కంటూ వింటూ తింటూ తిరుగుతూ తన స్వరూపాన్ని మరువకుండా వుండుటే యోగం. పతంజలి చిత్తాన్ని సూక్ష్మం చేయుమంటాడు. భగవంతుడు చిత్తాన్ని విశాలం చేయుమంటాడు. పతంజలియోగానికి, బైటివ్యవహారం ప్రతిబంధంగా వుంటుంది. భగవంతుని అభిప్రాయంలో స్వరూపాన్ని మరువక చేసే ప్రతిపనీ యోగమే. "యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః" — మనస్సు యెక్కడెక్కడికి పోతే అక్కడక్కడే సమాధి. ఇది శుద్ధగతి.

శుక్ల కృష్ణగతులు యే ముహూర్తంలోనో వస్తాయంటూ వాటికోసం గడియలు లెక్కపెట్టుకుంటూ కూర్చోవద్దు. చచ్చిన తర్వాత వచ్చే ఆ ముక్తిని నమ్ముకొని సద్యా యిప్పటి కర్తవ్యాన్ని మరువవద్దు.

సర్వకాల సర్వావస్థలలో సిద్ధమై వుండే స్వరూపయోగాన్ని గుర్తించావంటే నీ ముక్తి పరోక్షంగాకాదు, ప్రత్యక్షంగావుంది. ఇదే శుద్ధగతి.

భగవంతుడు తనబోధను ఉపసంహరిస్తూన్నాడు. చిట్టచివర ఫల శ్రుతి శ్లోకంతో గ్రంథం ముగుస్తూంది. ఈ యెనిమిదవ అధ్యాయంలోని విషయాలను వింటే తెలుసుకుంటే వచ్చే ప్రయోజనం యేమి? ఏ పని చేసినా ఒక ప్రయోజనమంటూ వుండాలెగదా! మీరూ ఉదయం సాయంకాలం రెండుపూటలావచ్చి యీ అధ్యాయప్రవచనాన్ని విని పోతూన్నారు. పనో పాటో వ్యాపారమో సాపారమో చేసుకుంటే పదిరూపాయలు సంపాదించుకొని వుండేవాళ్లు. దీన్ని వినుటతో యేమయ్యా ప్రయోజనం? — అని మీకూ శంక కల్గివుండవచ్చు. భగవంతుడు చెబుతున్నాడు. వినండి.

"వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥"

"అర్జునా! నీ వడిగిన యేడు ప్రశ్నలకు యీ అధ్యాయంలో సమాధానాలు చెప్పబడ్డాయికదా! ఈ తత్త్వాన్ని గ్రహించి అనుష్ఠించిన యోగికి కల్గే ఫలితం విను. బ్రహ్మచర్యనియమపూర్వకంగా షడంగ సహితవేదాలను అధ్యయనంచేస్తే యేఫలం లభిస్తుందో, ఆ ఫలితాన్ని కూడా యితడు అతిక్రమించి పోతాడు. సాంగోపాంగంగా అశ్వమేధాది యజ్ఞాల నాచరిస్తే యేఫలం వస్తుందో, ఆ ఫలాన్ని సైతం యితడు దాటిపోతాడు. చిత్తైకాగ్రతతో కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులను చేస్తే యేఫలితం కల్గుతుందో దాన్ని సహా మించిపోతాడు. ఉత్తమ దేశకాలాలలో సత్పాత్రను సశాస్త్రీయంగా శ్రద్ధాపూర్వకంగా గోభూ హిరణ్యాదులను దానంచేస్తే యేపుణ్యం సిద్ధిస్తుందో దాన్నికూడా అతిక్ర మించి పోతాడు. ఈ మానవలోకంలో పవిత్రమైన యీ నాల్గు కర్మలలో యే ఒక్కదాన్ని అయినా నియమపూర్వకంగా చేయడం కష్టంగా వుంటుంది. నాల్గింటి ఫలం యేకరాశిగా కలిసివచ్చిందంటే యేమని చెప్పాలె? ఈ అధ్యాయంలోని బోధను విని ఆలకించి యిందలి తత్త్వాన్ని